శ్రీమతే రామానుజాయ నమః



శ్రీ ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన

# శ్రీవేంకటేశ స్తోత్రలహరి

## (సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనములు)

తమిళవ్యాఖ్య

న్యాయవేదాంతవిద్వాన్, శ్రీవైష్ణవ సింహ

ఉ.వే. శ్రీమాన్. టి.ఎ.కృష్ణమాచార్యస్వామివారు

అనువాదము

శ్రీమాన్. ఈ.ఏ. శింగరాచార్యులు

ఉ.వే.శ్రీమాన్ కందాళ వేంకటచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక

2007



శ్రీమతె రామానుజాయ నమః

శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ
వేదాంత ప్రవర్తకులైన శ్రీమత్పరమహంస
పరివ్రాజకాచార్యులైన తిరుమల తిరుపతి
తిన్ననూ్నరు దేవస్థానములకు ధర్మకర్తలైన
పెరియ కోవిల్ కేళ్వి అప్పన్

## శ్రీ రంగరామానుజ పెద్దజీయర్ స్వామివారు

### నారాయణస్మరణపూర్వకముగా వ్రాయించి పంపిన పత్రిక



### మంగళాశాసనము

శ్రీ వేంకటాచలాధీశం శ్రియా-ధ్యాసితవక్షసమ్ ।
శ్రితచేతనమందారం శ్రీనివాస మహంభజే ॥

శ్రియఃపతియై, అవాప్తసమస్తకాముడై, పరమకారుణికుడగు భగవానుడు జగద్రక్షణను, చేతనోద్ధరణను ప్రధానముగా చేసికొని పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ-అనెడి అయిదు రూపములలో వేంచేసియుండునని శ్రీపాంచరాత్రములో, పురాణములలో చెప్పబడియున్నది. వీనిలో అర్చావతారము గొప్పది అని, భగవానుని సేవించి, నమస్కరించి, శరణాగతిచేసి తరించుటకు కలియుగములో ఉపాయము,



ఉపాయమును అదియేనని మన ఆచార్యులు పల్కుదురు. "ఇన్నిలత్తిల్ అర్చావతార మెళిదెన్టాన్" అనుచు శ్రీమణవాళమామునులు తిరువాయ్‌మొళినూ్ర్రాది ప్రబంధములో అనుగ్రహించుట ఇచట స్మరింపతగినది.

అర్చకాభిమతుడై, **108** దివ్యదేశములలో అర్చామూర్తిగా భగవానుడు వేంచేసియుండుట, తిరుమల రెండవదివ్యదేశమనుట సుప్రసిద్ధము.

వేదములు, పురాణములు, ఋషులు వాక్కులును భగవానుని నిద్రలేపి, స్తుతించి, అతని శ్రీపాదములలో "ఉన్నడికీళ్ అమర్న్దు పుకున్దేనే" అని శరణాగతిచేసి, అతనిని ఆశ్రయింపవలెనని తెలుపుచున్నది. బ్రహ్మర్షి యైన విశ్వామిత్రుడును "కౌసల్యాసుప్రజా ! రామ ! ...... దైవ మాహ్నికమ్" అనుచు సుప్రభాతము పాడుట, స్తుతించి, ప్రపత్తి చేయుటయును శ్రీరామాయణములో గమనింపవచ్చును.

శ్రీరంగనాథునకు "తిరుప్పళ్ళియెழுచ్చి" ప్రబంధమును తొణ్డరడిప్పొడి యాళ్వార్లు పాడుట, మిగిలిన ఆళ్వార్లును, ప్రపన్నజనకూటస్థులైన నమ్మాళ్వార్లును తమ ప్రబంధములలో భగవానునకు సుప్రభాతము పాడి, అతని గుణానుభవములను పాడి, అతని శ్రీపాదములలో ప్రపత్తిని చేసి, మంగళాశాసనమును చేసి ఉజ్జీవించుట సర్వవిదితము. ఆరీతిలోనేకదా మన ఆచార్యులును ఆశ్రయించిరి.

శేషాంశసంభూతులైన యతిరాజులును, రామానుజపునరవతారభూతులైన శ్రీమణవాళమామునులును తిరుమలలో వేంచేసియుండి, వేంకటేశ్వరుని సన్నిధి నిర్వాహ- మును, కైంకర్యమును నడపుటను శ్రీ అనన్ద్వాన్ అనుగ్రహించిన శ్రీవేంకటాచలేతిహాస- మాల, తిరుమలై ఒழுగు అను గ్రంథములలో చూడవచ్చును.

విశదవాక్ శిఖామణియైన శ్రీ మణవాళమహామునితో, వారి అష్టదిగ్గజములలో ప్రసిద్ధులగు శ్రీ ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ తిరుమలకు వేంచేసిన ఒకసమయమున, అందఱును శ్రీనివాసుని శ్రీపాదములను ఆశ్రయించి, అతని కరుణను పొందవలెనను గొప్ప కరుణను కలవారై, ఆళ్వార్లు అనుగ్రహించిన రీతిలో సంస్కృతభాషలో చాల విలక్షణముగా సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనములను పాడిరి. ఈ గ్రంథములలో ఆళ్వార్ల శ్రీసూక్తులలోని సంప్రదాయ విషయపూర్తిని, అర్థపుష్టిని, శబ్దపుష్టిని చూచి, మిక్కిలి ప్రసన్నులైన మణవాళమహామునులు శ్రీతిరువేఙ్గడముడైయాన్ సన్నిధిలో ప్రాతఃకాలమున ఆలయద్వారకవాటములను తెఱచునపుడు తొణ్డరడిపొడి ఆళ్వార్లు అనుగ్రహించిన "తిరుప్పళ్ళి యెழுచ్చి" ప్రబంధమునకు బదులుగా శ్రీప్రతివాది భయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన సంస్కృతభాషలోని శ్రీవేంకటేశ సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళములను అనుసంధానము చేయు క్రమమును ఏర్పాటుచేసిరి.

ఈ క్రమము మార్గీమాసము తప్ప మిగిలిన మాసములలో ఆనాటినుండి ఈనాటివరకు నడచుచున్నది. మార్గీ మాసములో తిరుప్పళ్ళియెుచ్చి అనుసంధానము నడచుచున్నది.

ఈ రీతిలోనే మిగిలిన దివ్యదేశములలోని అర్చామూర్తులకును పలువురు సుప్రభాతాదులను చేసి, అనుసంధించుచున్నారు. అయినను, సుప్రభాతమన్నచో, శ్రీ అణ్ణన్ స్వామి అనుగ్రహించిన సుప్రభాతముమాత్రమే అందటికిని మనసున స్ఫురించును. "వినా వేంకటేశం న నాథో న నాథః" అనుటచేతను, "వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన, వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి" అనెడి ప్రమాణమునుబట్టి, శ్రీవేంకటేశ సుప్రభాతము జగత్ప్రసిద్ధమై, గృహములలో, పలు సన్నిధులలో, బయటను అనుసంధింప బడుచున్నది.

శ్రీ ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ అనుగ్రహించిన సంస్కృత సుప్రభాత స్తోత్రము, ప్రపత్తి ఇత్యాదులు అందటికిని తెలియునట్లు తమిళములో న్యాయవేదాంతవిద్వాన్ శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.ఏ.కృష్ణమాచార్యస్వామివారు వ్యాఖ్యానమును చేసిరి.

"తెన్నాట్టు తిలకము"గా, జగత్ప్రసిద్ధులుగా వేంచేసి యున్న శ్రీ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారి శ్రీవేంకటేశ సుప్రభాత తమిళ వ్యాఖ్యానమునకు శ్రీ ఉ.వే. ఈ.ఏ.శింగరాచార్యస్వామి ఆంధ్రానువాదమును చేసి, ఆంధ్రదేశములోనున్నవారికి మహోపకారమును చేయవలెనని ముందుకువచ్చుట చాలా సంతోషకరముగా నున్నది.

శ్రీ ఉ.వే. శింగరాచార్యస్వామి కూడా గొప్ప విద్వాంసులు. మావట్ల విశేషప్రపిపత్తిని కలవారు. వారు వ్రాయు శ్రీవేంకటేశసుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసన స్తోత్రములయొక్క ఆంధ్రానువాదమును ప్రచురించుటకు ద్రవ్య సహాయమును చేయుటకై ముందుకు వచ్చిన శ్రీమతి మంచుకొండ లక్ష్మీకుమారి, శ్రీమాన్ మంచుకొండ అప్పలరాజు దంపతులు ప్రశంసింపతగినవారు. ఈ దంపతులకు, శ్రీ ఉ.వే. శింగరాచార్యస్వామికిని శ్రీ పద్మావతీసమేత శ్రీనివాస భగవానుడు సకలసౌభాగ్యములను, ఆయురారోగ్య-ఐశ్వర్యములను, భగవద్భాగవతాచార్య కైంకర్యసిద్ధిని కటాక్షింపవలెనని, ఇంకను వీరు ఇటువంటి గొప్ప సంప్రదాయగ్రంథ ప్రచురణలు చేయవలెననియును తిరువేఙ్గడముడైయాన్ శ్రీపాదములలో సేవించి, ప్రార్థించుచు, అనేక మంగళాశాసనములను చేయుచున్నాము.

రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్.

తిరుపతి
తేది - 17.7.2007
ఆణివర ఆస్థానం

పెరియ కోవిల్ కేళ్వి అప్పన్
శ్రీ రంగరామానుజపెద్దజీయర్‌స్వామివారు



మహామహోపాధ్యాయ, శాస్త్రరత్నాకర, కవిశాబ్దిక కేసరి
ఉ.వే.శ్రీమాన్. శ్రీ.న.చ. రఘునాథాచార్యస్వామివారు
అధ్యక్షులు, సత్సంప్రదాయ పరిరక్షణ సభ,
శివనగర్, వరంగల్లు.

# ప్రస్తావము

శ్రీవేంకటేశ్వరుడు ప్రపంచమున అత్యంత ప్రసిద్ధినొందిన దైవమైనట్లే, ఆ స్వామి యొక్క సుప్రభాతాది స్తుతియు సర్వలోకప్రసిద్ధి నొందినది. ఈమధ్యకాలమున అవతరించిన తత్తద్దేవతాసుప్రభాతములన్నియు ఏతదనుకారములే గాని, వేటిలోను అపూర్వత లేదు.

శ్రీవేంకటేశ్వర సుప్రభాతమునకు వివిధ భాషల్లో వ్యాఖ్యలున్నూ వెలసియున్నవి. శ్రీమాన్ చెలమచర్ల రంగాచార్యులుగారు తేటతెనుగులో ప్రతిపదార్థ తాత్పర్యములను సంగ్రహముగా వ్రాసి సుమారు 50 సంవత్సరాలకు పూర్వము ముద్రించినట్లు గుర్తు. ఇపుడీ ద్రవిడ-ఆన్ధ్ర వ్యాఖ్యానములు రెండునూ శ్రీవైష్ణవసంప్రదాయ నిష్ణాతులైనవారు రచించినవైనందున, స్తోత్రకర్తయైన శ్రీ ప్ర.భ. అణ్ణన్‌స్వామివారి హృద్గతాశయములు ఇందు సువ్యక్తమైనవి. పాఠకులకును పలు సంప్రదాయార్థములు తెలియుటకు వీలైనది. అత్యన్తావశ్యకమైన, బహుజనాపేక్షితమైన ఈ విపులవ్యాఖ్య ప్రకాశితమగుట అత్యన్త శ్లాఘనీయాస్పదము. ఆన్ధ్ర వివరణ (అనువాద) కర్త శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులుగారు సంస్కృత-ద్రవిడ-ఆన్ధ్ర భాషలలో ప్రవీణులు, బహుగ్రన్థకర్తలు అగుటచే ఇది నిర్దుష్టమేగాక సమగ్రముగూడనని గ్రహింపవచ్చును.

శ్రీమాన్ కందాడ వేంకటాచార్యస్వామి (విజయనగరం) వారి తిరునక్షత్ర సందర్భమున ఈ గ్రన్థము ప్రకటితమగుట, దీనికి ముద్రణకైంకర్యభారమును శ్రీ ఆచార్యులవారి శిష్యవర్గములోనివారు శ్రీమాన్ మంచుకొండ అప్పలరాజు - శ్రీమతి సౌ. మంచుకొండ లక్ష్మీకుమారి దంపతులు వహించుట సువర్ణమునకు సౌరభము అబ్బినట్లయినది. విజయనగరంలోని త్రైవర్ణిక రామానుజకూటంలోని సభ్యులద్వారా ప్రతి ఏట ఒక సద్గ్రన్థము ఆచార్యోపహారముగా సమర్పితమై వెలువడుట అత్యన్త ముదావహము.

ఇట్లు
మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర
శ్రీ.న.చ. రఘునాథాచార్యులు
సత్సంప్రదాయ పరిరక్షణ సభాధ్యక్షులు

శివనగర్, వరంగల్
30-6-2007

**సాహిత్యవిద్యా ప్రవీణ, భాషాప్రవీణ**
**ఉ.వే.శ్రీమాన్. కిడాంబి వేంకటాచార్యస్వామివారు, ఎమ్,ఏ**
**(భూతపూర్వ ఆంధ్రశాఖాధ్యక్షులు, వై.ఎన్.కాలేజ్ )**
**స్థానాచార్యులు, ఆదికేశవ ఎంబెరుమానార్ స్వామివార్ల దేవస్థానం**
**కోవెలవీధి, నరసాపురం**

స్వస్తి శ్రీ ర్దిశతాత్

## ఏష హ్యేవానన్దయాతి

వేఙ్కటాద్రిసమం స్థానం బ్రహ్మాణ్డే నాస్తి కించన ।
వేఙ్కటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥

శ్రీమణవాళమామునుల అష్టదిగ్గజములలో అప్రమేయప్రతిభాశాలి ప్రతివాది భయంకరం అణ్ణన్‌స్వామివారు. ఉభయవేదాన్తములయందు, న్యాయమీమాంసాది శాస్త్రములయందును వీరికిగల ప్రతిభాపాటవములు అనన్యాదృశములు. వాదకేళికి విచ్చేసిన ప్రతిపక్షులను పరాజితులను జేసి స్వాచార్యులచే "వాదిభీకరా" అని ప్రశంసింపబడినవారు. (ప్రాస్తావికంలో చూడవచ్చును)

శాస్త్రచర్యలలో వీరి వాక్కు ఎంతటి కర్కశమైనదో కవితావిషయమున నంతటి లలితమైనది.

"సాహిత్యే సుకుమారవస్తుని......తర్కే వా.......మయి......సమం లీలాయతే భారతీ" అను సూక్తి వీరి విషయమున సార్థకము.

ఇట్టి ప్రభావంగల అణ్ణన్ అనుగ్రహించిన దివ్యకృతులు పెక్కులు. పై కృతులలో ప్రస్తుత శ్రీవేంకటేశ్వర సుప్రభాతాదిరచనలు పరమవిలక్షణములైనవి. మణవాళ మామునుల వైభవమును గ్రహించిన పిమ్మట అణ్ణన్ వారివిషయంలో "తేవు మత్తఱియేన్" అను రీతిలో నమితప్రావణ్యము గలవారై, తదాస్థానరత్నమై వెలుగొందినారు.

ఒక పర్యాయం మామునులు తిరువేఙ్గడముడైయాన్‌కు మంగళాశాసనం చేయుటకు తిరుమలైకు వేంచేసినారు. స్వాచార్యుల ననుసరించిన అణ్ణన్ తదాజ్ఞతో శ్రీనివాసుని సన్నిధిలో పై స్తోత్రములను ఆశువుగా ననుగ్రహించినారని పెద్దల సూక్తి. (ప్రాస్తావికంలో చూడవచ్చును)

ఈ శ్లోకములు శ్రీనివాసుని నిర్హేతుకకృపతో, ఆచార్యానుగ్రహంతో నవతరించినవి గావున "మొెపట్టోడుమ్ కవియముదమ్" అను రీతిగా శబ్దార్థపుష్టితో



గూడి పరమరస్యములైయున్నవి. సంస్కృతవేదాన్తములలోని గాంభీర్యము, ద్రావిడవేదాన్తములలోని మాధుర్యము అణ్ణన్ శ్రీసూక్తులలో నిండియుండు రీతి ముచ్చట గొల్పును.

సాంప్రదాయికములైన విషయములతోబాటుగా వేదాన్తవేద్యములైన పెక్కు విషయములు ఇమిడియుండుట వీనిలోని ప్రత్యేకత.

భగవానునికి దాసభూతుడైన చేతనుడు స్వామికి సుభ్రాతమును పల్కుట, స్తుతించుట, నీవే రక్షకుడవని విన్నపించుట, స్వామి అభివృద్ధికి కోరుట-అనునవి చేయదగినవి. దీనిచే స్వస్వరూపము సిద్ధించుటయేగాక స్వామికి ప్రీతి కల్గును. "ఆభిముఖ్యసూచనమాత్రత్తాలే సన్తోషమ్ విళైయుమ్" అని కదా శ్రీలోకాచార్యుల శ్రీసూక్తి. "వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లుగా" స్వామి సంతోషించును.

భగవదారాధన సుప్రభాతముతో ప్రారంభమై, మంగళాశాసనముతో (శాత్తుముఱై) పూర్తియగును. ఈ క్రమములో పై శ్లోకముల కూర్పును భావింపవచ్చును. తిరుమలైలోని శ్రీనివాసుని సన్నిధిలోనేగాక సకలఅర్చామూర్తుల సన్నిధులలోను పై సుప్రభాతాదులు అనుసన్ధింపబడుట వీని ప్రాముఖ్యమును తెల్పును.

సాధారణముగా, సుప్రభాతములను అనుసన్ధించువారే గాని అందలి విశేషాల్ని ఆకళింపుజేసికొన యత్నించువారు విరళముగా నుందురు.

పరమభోగ్యములైన ఈ స్తోత్రములయందలి భావాల్ని సాధారణవ్యక్తులు సైతము ఆస్వాదింపవలయునను ఉదారాశయంతో ఉభయవేదాన్తధిషణామండితులు, విశేషించి తమిళ ఇలక్కణంలో సిద్ధహస్తులు, "శ్రీవైష్ణవసింహ" బిరుదాంకితులు, తిరుపతిలోని ప్రాచ్యకళాశాలలోని న్యాయశాఖకు భూతపూర్వాధ్యక్షులు, కీర్తిమూర్తులు, శ్రీమాన్.టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు తమిళంలో సువిశదమైన వ్యాఖ్యను కృపజేసినారు.

కాంచీ మహావిద్వాన్ ప్ర.భ.అణ్ణన్ స్వామివారు శ్రీకృష్ణమాచార్యస్వామివారి రచనలను సంభావించినారనగా నింతకంటె నీ వ్యాఖ్యాసౌవాదవాన్ని తెలుపుటకు వేఱొక ఉదాహరణము వలదుకదా! పైతమిళ వ్యాఖ్యలోగల కొన్ని విశేషాలు -

10వ శ్లోకంలో- స్వాచార్యులైన మామునులపరంగా జేసిన స్వాపదేశవివరణం- "భృంగావలీ-కమలోదర" శబ్దస్వారస్యము.

14వ శ్లోకంలో -శ్రీనివాసపుష్కరిణినిగూర్చిన విశేషాలు

15వ శ్లోకంలో- శ్రీశేషశైల-గరుడాచల-వేంకటాద్రి మొదలగువాని నామసార్థక్యము; వానికి సంబంధించిన ఐతిహ్యములు

21వ శ్లోకంలో -ద్వయమంత్రార్థము ఇమిడియున్న సౌందర్యము. ఇట్లెన్నియో విశేషాలు. తవ్విన కొలది నిధినిక్షేపములు లభించును.

తమిళంలోనున్న పై వాఖ్యను అనువదించి తెలగువారికి అందజేసిన మహోదారులు ఉ.వే.శ్రీమాన్.డా॥ చి॥ శింగరాచార్యస్వామివారు. పెక్కు దివ్య ప్రబన్ధములకు, సంప్రదాయస్తోత్రములకు విశేషపీఠికలతో శింగరాచార్యస్వామివారు కూర్చిన వ్యాఖ్యలు భక్తిసంప్రదాయమునకు సిగపూవులై అలంకరించుచున్నవి.

"మణినా వలయం వలయేన మణిః" అను న్యాయానుసారం మూలవ్యాఖ్య, అనువాదం పరస్పరశోభాధాయకములై యలరారుచున్నవి.

కళలకు కాణాచియైన విజయనగరం ప్రపత్తిసంప్రదాయానికికూడ నెలవు. సంప్రదాయశిరోమణులైన కీర్తిమూర్తులు, ఉ.వే.శ్రీమాన్.కందాళ వేంకటాచార్యస్వామివారి కటాక్షంతో, ఉపదేశాదులతో లబ్ధసత్తాకమైనది-ఇందలి "త్రైవర్ణికశ్రీవైష్ణవగోష్ఠి". ఈ గోష్ఠివారు నిర్వహించు కార్యక్రమములే వీరి సంప్రదాయనిష్ఠకు తార్కాణము.

శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి కుటుంబసభ్యుల, ముఖ్యముగా శ్రీమతి జానకిగారి ఉపదేశములను పొందు భాగ్య మీ గోష్ఠివారికి కల్గుట ముదావహము.

ప్రతివర్షము ఆచార్యతిరునక్షత్రోత్సవసందర్భంగా జరుగుసభలలో ఆచార్యవరివస్యగా నొక సంప్రదాయ గ్రంథమును పెద్దలచే ఆవిష్కరింపజేయుట ఈ గోష్ఠికివారికి పరిపాటి. పై ఆచారం ప్రకారం శ్రీ శింగరాచార్యస్వామివారిచే ననువదింపబడిన శ్రీవేంకటేశ్వర సుప్రభాతగ్రంథమును ఆవిష్కరింపజేసి ఆస్తికుల కందించుట ప్రశంసనీయము.

ఆచార్యకైంకర్యముగా నీ గ్రంథముద్రణమునకై తమ పవిత్రద్రవ్యాన్ని సమర్పించిన శ్రీమతి మంచుకొండ లక్ష్మీకుమారి, శ్రీమాన్ అప్పలరాజు దంపతులకు ఆనందనిలయుడైన స్వామి ఆయురారోగ్యఐశ్వర్యాదులను అనుగ్రహించి ఆచార్యసేవానందమును ప్రసాదించుగాక యని అస్మదారాధ్య దైవమైన భగవద్రామానుజుల దివ్యపాదారవిన్దముల సన్నిధిలో ప్రార్థించుచున్నాను.

సన్తు శ్రేయాంసి భూయాంసి

ఇట్లు
భాగవతవంశవదుడు
కిడాంబి వేంకటాచార్యులు

నరసాపురం
27-6-07

“పండితరత్న”, ఉ.వే.శ్రీమాన్

## ఆచార్య, టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు

సంపాదకులు, భక్తినివేదన, సింహాచలం, విశాఖపట్టణం

# ప్రత్యూషదివ్యపవనాంకూరపరిష్వంగము

శ్రీవేంకటేశసుప్రభాతం అతివిలక్షణమైన మధురప్రబంధం. ఇది చాతురంగం. జగదవనచింతాయోగనిద్రాభిరాముడైన పరంధాముని మేలుకొలిపి, స్తుతించి, శరణాగతి చేసి, పరవశాన మంగళాశాసనం కావించటం ఈ ప్రబంధపరమార్థం.

శ్రీమద్వరవరమునుల అష్టదిగ్గజశిష్యులలో ప్రతివాదిభయంకరులుగా ప్రఖ్యాతులు, బహుప్రబంధనిర్మాతలు, ప్రౌఢవిద్వత్కవులు అయిన అణ్ణన్‌స్వామి ఈ ప్రబంధనిర్మాతలు.

వాయు, వారాహ, స్కాంద, బ్రహ్మాండాది నైకపురాణాంతర్గతకథాదీప్తితో, ఆళువారుల, ఆచార్యుల స్తుతివిసరస్ఫూర్తితో సప్తగిరివాసుని శ్రీనివాసుని కలరూపును కనులార, మనసార, తనివితీర అనుభవించి ఆ ఆనందపారవశ్యాన అణ్ణన్‌స్వామి లోకానికి అందించిన అమృతరసకలశం ఈ సుప్రభాతం. వీరువారనక సర్వులకూ ప్రాతర్నిత్య నిషేవ్యంగా స్పృహణీయ మీప్రబంధం.

ఏ స్తుతిప్రబంధమయినా, శబ్దానుసంధానంతోపాటు అర్థానుభావనము ఏర్పడితే కలిగే ఆనందం ఇంతా అంతా కాదు. ఈ దృష్టిలో స్తోత్రప్రబంధాలకూ వ్యాఖ్యానాలావశ్యకాలు. ఆ వ్యాఖ్యానమూ కేవల శబ్దార్థ వివేచన దృష్టితో కాక, సంప్రదాయ దృష్టితో కవి అంతరంగానికి సన్నిహితంగా, ప్రతిబింబకంగా సమ్యగ్విషయావగాహన పాటవంతో, మసకబారని చూపుతో, అకుటిలచిత్తాన, హృదయసంవాదంకలిగి అనుశీలనం కావించాలి. అట్లాంటి చూపు, మనసుతోపాటు వ్యాఖ్యానిర్మాణానికి కావలసిన పరికరం పర్యాప్తంగా కలవారు కావాలి వ్యాఖ్యాతలు.

ప్రథమంగా ఈ ప్రబంధానికి సరసము, ప్రామాణి`ము అయిన వ్యాఖ్యానాన్ని తమిళభాషలో అనుగ్రహించినవారు న్యాయవేదాన్తవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్.టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు. వారు సంస్కృతద్రావిడభాషలలో సమస్కంధులు. బహుప్రబంధ వ్యాఖ్యాననిర్మాణలబ్ధయశోవిరాజితులు. సత్సంప్రదాయనిష్ఠులూ కావటంతోపాటు తిరుమలకు చెందినవారు. క్షేత్రతీర్థస్థలసంప్రదాయవిషయపరిజ్ఞానం కలవారు.



“నామూలం లిఖ్యతే...నానపేక్షిత ముచ్యతే” అన్నట్లు సాగింది వారి వ్యాఖ్యాన నిర్మాణవైఖరి.

“ఈషత్ప్రఫుల్లసరసీరుహనారికేళపూగద్రుమాదిసుమనోహరపాలికానామ్” అన్నచోట పాలికాశబ్దానికి గుత్తులు అని అర్థం వ్రాస్తూ, ప్రస్తుతనిఘంటువులలో ఈ అర్థంలో ఈ శబ్దం కనబడటంలేదంటూ భక్తాంఘ్రిరేణువుల తమిళప్రయోగాన్ని (వణ్ పాళైగళ్ నాఉ) ఉపష్టభకంగా ఉదాహరించినారు. ఇక్కడ ఒక మాట. తెలుగులోను గుత్తులు అన్న అర్థంలో “పాళలు” అని అల్లసాని ప్రయోగం ఉంది. ఇది దేశ్యపదం. అణ్ణన్ ఈ దేశ్యపదాన్నే పాలికారూపంతో ప్రయోగించినారు అనిపిస్తుంది.

స్థానికసమయాచారాలు తెలిస్తేకాని కొన్ని విషయాలు ప్రామాణికంగా వివరించలేరు.

ఏలాలవంగఘనసారసుగంధితీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణమ్

అన్నప్పుడు “వియత్సరితి” అంటే మిన్నేటిలోని అనకుండా, ఆకాశగంగలోని-అని వ్రాయటం స్థలసమయాచారవిశేషాభిజ్ఞతకు దృష్టాంతం.

ఆయా సందర్భాలలో ద్వయార్థసమన్వయాన్ని, శరణాగతితత్వాన్ని నిరూపించి సమన్వయించిన పట్టులు కొల్లలు. సర్వథా ఈ వ్యాఖ్యానం హృద్యం, అనవద్యమూను.

ఈ తమిళవ్యాఖ్యానాన్ని లలితవిశదంగా ప్రస్తుతం తెలుగువారికి సమర్పిస్తున్న వారు వ్యాఖ్యాతృశిరోమణి.ఉ.వే.శ్రీమాన్.డా.ఈ.ఏ.శింగరాచార్యస్వామివారు. శ్రీస్వామివారు బహుస్తోత్రప్రబంధవ్యాఖ్యాతలు. నిండుకుండ. నిరంతరబహుగ్రంథనిషేవణ తత్పరులు. సంస్కృతాంధ్రద్రావిడసాహిత్యముల చెలిమి కలిమి బలముగ కలవారు. ఉభయవేదాన్త సీమంతినీ చరణాబ్జమధువ్రతులు. వ్యాఖ్యానరచనా పర్యాప్తపరికరదక్షులు. తమిళవ్యాఖ్యాన భోగ్యతను గుర్తించి దానిని తెలుగువారికి సమర్పింప కూతూహలపడిన ఉదారులు.

మూలానుగుణముగా తెలుగువ్యాఖ్య రూపొందినది.

ఇన్ని యోగ్యతలు కల శ్రీశింగరాచార్యస్వామివారు. తెలుగు వారి నాలుకలపై నిత్యం నర్తించే ఈ సుప్రభాతప్రబంధానికి మధురమైన వ్యాఖ్యానాన్ని అందించడం “ప్రత్యూషదివ్యపవనాంకూరపరిష్వంగం” వంటిది.

రతనాలను గనులనుంచి తవ్వి తలకెత్తే వారున్నా, వాటికి మెరుగులు పెట్టి ప్రకాశింపజేసే వారు లేకపోతే మరుగున పడిపోతాయి; మాసిపోతాయి.

శ్రీశింగరాచార్యస్వామివారు వెలికితీసిన ఈ ప్రబంధవ్యాఖ్యానరత్నాన్ని ప్రకాశింపచెయ్యటానికి సిద్ధపడి ఆచార్యవరివస్యగా ఈ కైంకర్యాన్ని ప్రపన్నలోకానికి సమర్పిస్తున్న కైంకర్యవల్లభులు శ్రీమతి లక్ష్మీకుమారి, శ్రీమాన్ మంచుకొండ అప్పలరాజు దంపతులు. వీరి ఆచార్యప్రతిపత్తికి అనేకమంగళాశాసనములు.

ఉభయవేదాంతవిదుషీమణి, తమకు ఆచార్య అయిన శ్రీమతి జానకమ్మగారి నిర్దేశకత్వంలో విజయనగరం త్రైవర్ణిక రామానుజకూటం ప్రతియేటా జరుపుకొనే ఆచార్య వరివస్యలో ఈ సవ్యాఖ్యానప్రబంధాన్ని భాగవతగోష్ఠికి ఉపాయనంగా సమర్పించుకోవడం ప్రశస్యతరం. వారి కైంకర్యశ్రీ నిత్యశ్రీః, నిత్యమంగళముగా విరాజిల్లుగాక.

ఇట్లు
విన్నవించు భాగవతవిధేయుడు
టి.పి. శ్రీరామచంద్రాచార్య



శాస్త్రరత్నాకర
ఉ.వే.శ్రీమాన్.డా.ఎస్.వి.రంగరామానుజాచార్యస్వామివారు
అధ్యక్షులు, ఉభయవేదాంతాచార్యపీఠము
ప్రిన్సిపాల్, ప్రాచ్యకళాశాల, కొవ్వూరు.

శ్రీమతే రామానుజాయ నమః

## కృతే చ ప్రతికర్తవ్యమ్

'సుప్రభాతం' అనగానే ఆబాలగోపాలం ఆంధ్రదేశంలో శ్రవణపేయంగా స్మృతిపథంలో మెదిలేది శ్రీవేంకటేశ్వరసుప్రభాతమే. ఈ సుప్రభాతం ప్రచారమాధ్యమాల ద్వారా ప్రతి శనివారం మంగళధ్వనిగా దేశపు నలుచెరగులా ప్రతిధ్వనించింది. దీన్ని అనుగ్రహించినవారెవ్వరోకూడా చాలామందికి తెలియదు. సాధారణజనాల నాల్కల పైకూడా స్ఫురించే ఈ సుప్రభాతాన్ని ప్రతివాదిభయంకరం అణ్ణన్ అనేవారు అనుగ్రహించారు. ఇది పైకి ఒక సాధారణసుప్రభాతంగా గోచరించినా చక్కటి వర్ణనాచాతురితోను, సంప్రదాయ పరిమళంతోను (శోత్ర-పరిత్ర) హృదయరంజకంగా కూర్పబడింది. సుప్రభాతకర్త శ్రీవేంకటేశస్తుతిలోని మొదటిశ్లోకంలోనే చక్కని వర్ణనాశిల్పాన్ని దర్శింపజేశారు. అమ్మయొక్క వక్షఃస్థలాలంకృతమైన కుంకుమచేత, స్వామి అమ్మను ప్రీతితో కౌగలించుకొన్నప్పుడు స్వామి మేని సహజనీలిమతోపాటు 'రాగ' రంజితమైంది. దానివల్ల స్వామి దేహం 'అతులిత' మైంది. వేదంలోని "నీలతోయదమధ్యస్థా" అనేచోట 'మధ్యస్థనీలతోయదా విద్యు దివ' అని భగవద్రామానుజులు వ్యాఖ్యానించారు. స్వామి దేహం సహజనీలమై మేఘమనోజ్ఞంకాగా, దాని చుట్టూ లక్ష్మీవిద్యుత్తు పరివేష్ఠించి ఉండి సౌవర్ణరాగరంజితమైనదని అద్భుతమైన భావన ఆవిష్కరింపబడింది. భోజుడు దాన్నే 'లక్ష్మీవిద్యుల్లసితమ్' అని విశదపరచాడు. ప్రస్తుతంలో, ఆ సౌవర్ణకాంతికి తోడుగా కుచకుంకుమరాగంకూడా చేరి, స్వామి దేహానికి విలక్షణకాంతిని సంతరించినదన్నమాట. 'నియత' అని అనడం చేత ఈ అరుణిమ ఏదో ఒక కాలానికి పరిమితంకాక సార్వకాలికం అని వ్యక్తమై, అమ్మ 'నిత్యానపాయిని' అని స్ఫురింపజేస్తున్నది. ఈ రాగం శరీరానికి మాత్రమే పరిమితంకాక, ఆంతరమైన హృదయస్థానాన్నికూడా రాగరంజితం చేసి, స్వామి 'లోకపతి' కావడానికి కావలసిన "ప్రీతి" గుణాన్నికూడా అవగతం చేస్తున్నది. ఈ రాగమే, స్వామి నేత్రాలకు సహజమైన రాగాన్ని అతిశయవైభవంగా చేస్తున్నది. దానివల్ల స్వామి సర్వదా సర్వాశ్రయణీయుడని వ్యక్తమవుతున్నది. ఇలా ప్రతిశ్లోకంలో ఒక విలక్షణ భావాభివ్యంజనం మనం గమనింపవచ్చు.

ఇక, సుప్రభాత, స్తుతి, ప్రపత్తులకు, మంగళాశాసనానికి వ్యాఖ్యను వెలయించిన మహానుభావులు న్యాయవేదాన్తవిద్వాన్, శ్రీవైష్ణవసింహ, ఉ.వే.శ్రీమాన్.టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారి వివరణశైలి మనోజ్ఞం. సుప్రభాతంలోని 14వ శ్లోకంలో "శ్రేయో-ర్థినో హరవిరించిసనందనాద్యాః, ద్వారే వసంతి వరవేత్రహతోత్తంగాః' అన్నచోట శ్రేయోర్థులైన వారిని వేత్రంతో హననం చేయడం సహజం అని సాధారణబుద్ధికి తోచవచ్చు. చాలా స్తుతుల్లో ఇలాంటి వర్ణనం అవర్ణనీయం. దేవతాంతరవిషయంలో సామాన్యంగా గోచరించేదే. కాని, ఇందులో ఒక ఔపనిషదరహస్యం ఉంది. పరమపదంలో దగ్గర ద్వారపాలకులేకాక 'యష్టిహ' శబ్దంచే నిర్దేశింపబడే మహూర్తనాయకులుంటారని సౌబాలం చెబుతుంది. ఏదో ఒక ఉపాసనతో పరమపదాన్ని చేరిన సనకసనందనాదులను ఆ యష్టిహాశబ్దనిర్దేశ్యులైన ముహూర్త పురుషులు వేత్రదండాలతో కొడతారని చెప్పబడింది. కాని ఇది కొట్టడం కాదు. కేవలం స్పృశించడమే. ప్రస్తుతంలో అయితే, ఈ శ్లోకవ్యాఖ్యానంలో వ్యాఖ్యాత. "వేత్రవరం వ్రజామి ఎన్ఱు భట్టర్ అరుళిచ్చెయ్‌దపడి గర్భగృహత్తిన్ వెళివాశలిల్ కుఱుక్కాక అమైక్కప్పట్టిరుక్కుమ్ ఉల్ తడియిల్ మోదిక్కొణ్డ తలైయై యుడైయవర్‌గళ్" ("వేత్రవరం వ్రజామి" అని భట్టరువారి సాయించినట్లుగా, గర్భాలయపు వాకిలిబయట అడ్డంగా నిలుపబడి ఉన్న బెత్తముపై మోదుకొనిన తలలను కలవారు) అని అర్థాన్ని చెప్పి ఎంతో ఔదార్యాన్ని పోషించారు వ్యాఖ్యాత. ఇక్కడ శిష్టసమ్మతమైన చక్కని సంప్రదాయాచారం. వ్యక్తమవుతున్నది. ఉపనిషత్తు కుడా ఈ భావాన్నే వ్యక్తపరచింది తప్ప, నెత్తిపై కొట్టడాన్ని కాదు. "ఏలాలవంగ" ఇత్యాది సుప్రభాత శ్లోకంతో ఆకాశగంగాతీర్థం స్వామికైంకర్యాంలో నిరంతరం వినియోగింపబడేదన్న ఆచారం విశదపరుపబడింది. 23వ శ్లోకంలోని వ్యాఖ్యలో కూడా' "కాంతాకుచాంబురుహకుట్మలలోలదృష్టే" అన్న సంబోధనంలోని రహస్యం లెస్సగా విశదపరచబడింది.

ఇలా ఎన్నో మనోజ్ఞభావాలతో హృద్యమైన సుప్రభాత, స్తోత్ర, ప్రపత్తి, మంగళాశాసనకదంబాన్ని పెద్దలవ్యాఖ్యతోపాటు, తమ ఆంధ్రానువాదాన్ని లెస్సగా జతపరచి అనుగ్రహించిన మన సింగరాచార్యస్వామి సర్వథా అభినందనీయులు. దాన్ని వెలికిదేవడంలో ఆర్థికంగా తమ ఔదార్యాన్ని ఆవిష్కరించిన శ్రీమాన్ మంచుకొండ అప్పలరాజు, లక్ష్మీకుమారి దంపతులు అనేక మంగళాశాసనాలకు అర్హులు. అస్తు.



శ్రీమతే రామానుజాయ నమః

## ఆచార్యవందనము

యో నిత్య మచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ-
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతో-స్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

మా ఆచార్యులు ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్ర సందర్భమున 19వ ఉభయవేదాన్తపండితసభలలో విశేషముగ 'ఆచార్యవరివస్య'ను చేసుకొనే భాగ్యము మాకు ఈ సంవత్సరము ప్రాప్తమయినది. భాగవతసమ్మానము, గ్రంథముద్రణకైంకర్యము చేసుకొనే అదృష్టము మమ్మలను వరించినది. 'సిరిరా మోకాలొడ్డుట' అవివేకముకదా ! ఆనందముగా అంగీకరించినాము. ఆచార్య ఋణము తీరనిదే. అయినా, ఈ కైంకర్యమువలన భగవద్భాగవతాచార్య మంగళాశాసనములను పరిపూర్ణముగ పొందగలిగే అవకాశము మాకు కలిగినది. "ఆచార్యవాన్ పురుషో వేద" అని శ్రుతివాక్యము." దైవముకన్న ఆచార్యుడే మిన్న" అన్నది పెద్దల సూక్తి. నిగ్రహానుగ్రహములు రెండును కలవాడు భగవంతుడు. కేవలానుగ్రహము కలవారు ఆచార్యులు. భగవంతుని ఆశ్రయించినవారికి పురుషార్థసిద్ధి కలుగుతుందో లేదో అనే సందేహముండవచ్చును. కాని భాగవతులను ఆశ్రయించినవారికి ఆ సందేహము అవసరము లేదు.

"సిద్ధి ర్భవతి వా నేతి సంశయో-చ్యుతసేవినామ్ ।
న సంశయో-స్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్ ॥

మానవజన్మ దుర్లభమైనది. అటువంటి జన్మ లభించినవాడు సదాచార్యులను ఆశ్రయించి, వారి అభిమానమునకు, అనుగ్రహమునకు పాత్రుడగుట అరుదైన విషయము. సదాచార్యులనుపదము భగవద్రామానుజులవారికే తగినదని అంటారు. "తస్మిన్ రామానుజార్యే గురు రితి చ పదం భాతి, నాన్యత్ర". రామానుజులవారి శ్రీపాద సంబంధము కలవారు తప్పక సద్గతని పొందుతారని సంప్రదాయజ్ఞుల విశ్వాసము. మాకు మా ఆచార్యులు శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారే అపరరామానుజులు. మాత్రైవర్ణికవైష్ణవకులమును ఉద్ధరించిన మహానుభావులు వారే. వారి మంగళాశాసనమే మాకందరికీ అన్ని విధములైన సంపదలను కలిగించుచున్నది.

మా దంపతులపట్ల వారికి ప్రత్యేకమైన అభిమానము. "కొంతమంది చేసేది తక్కువ. చెప్పుకొనేది ఎక్కువ. కాని మీ దంపతులు చెప్పకుండానే చేసే స్వభావం

కలవారు” అని వారు మమ్ములను మనసారా అభినందించి ఆశీర్వదించేవారు. సాత్త్వికమైన ప్రవృత్తిని కలిగి అందరితో కలిసిమెలిసి ఉండే మమ్ములను చూచి చాలా సంతోషించేవారు. మా మామగారు శ్రీమాన్ రామకృష్ణగారికిగల శ్రీమద్రామాయణపారాయణనిష్ఠను వారు చాలా అభినందించినారు. మా పెద్దలకుగల మంచిసంస్కారములను అలవరచుకొని అందరి మన్ననకు పాత్రులమయేటట్లు వారు మమ్ములను దీవించినారు. ఏదైనా సత్కార్యమునకు సహకరిస్తే తమకు ఉపకారము చేసినట్లుగా పొంగిపోయే నిర్మలహృదయులు మా వేంకటాచార్యస్వామివారు.

వారి తిరునక్షత్రమహోత్సవజ్ఞాపికగా ఈ సంవత్సరం 'శ్రీవేంకటేశ స్తోత్రలహరి'ని ప్రచురించుకొనే అవకాశము కలిగినది.శ్రీ వేంకటేశసుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనములు అందరికీ నిత్యానుసంధేయములు. వాటికి చక్కటి తమిళ, ఆంధ్ర, వ్యాఖ్యానములతో ఈ గ్రంథము అందమైన రూపమును పొందినది. ఇది అందరికీ ఆమోదయోగ్యమవుతుందని మా ఆశ. ఏడుకొండలవానిని దర్శిస్తే ఏడేడు జన్మల పాపములు రూపుమాసిపోతాయి. ఆయనకు సుప్రభాతము పాడితే మన అజ్ఞానాంధకారము తొలగిపోతుంది. ఆయనను స్తుతిస్తే మనకు త్రికరణశుద్ధి కలుగుతుంది. ఆయనను ఆశ్రయిస్తే ఉత్తమగతి లభిస్తుంది. ఆ స్వామికి నిత్యము మంగళాశాసనము చేస్తూ నిత్యకైంకర్యపరులము కావాలనే మన ఆశ ఆచార్యాను గ్రహముంటే తప్పక నెరవేరుతుంది.

మా ఆచార్యులు నామధేయము ఆ వేంకటాచలాధీశునిదే కావడము మాకు మరింత స్ఫూర్తినిచ్చింది. వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రజ్ఞాపికగా శ్రీ వేంకటేశ స్తోత్రలహరి ఆవిష్కరింపబడడము విశేషముగా అనిపిస్తోంది. “శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే” అంటూ ఒకేసారి ఆచార్యులను, ఆరాధ్యదైవమును ఆశ్రయించే అవకాశము కలగడము రామానుజుల అనుగ్రహవిశేషము. “నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్” అంటూ శ్రీ వేంకటాచార్యస్వామివారి శ్రీచరణములను, “జీవిల్ కాలమెల్లామ్ ......” అంటూ ఆ శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీచరణములను సేవించుకొని తరించే భాగ్యము మాకు తరతరములవరకు కలగాలని, వంశాభివృద్ధికలిగి భగవద్భాగవతాచార్య కైంకర్య పరులమయేటట్లు మంగళాశాసనము చేయమని భాగవతోత్తములందరినీ సవినయముగా ప్రార్థిస్తున్నాము. దానికి మా రామానుజులవారి అనుగ్రహము తోడుగా ఉండాలని కోరుకుంటున్నాము.

మా ప్రార్థనను మన్నించి మమ్ములను తమ అమూల్యములైన మంగళాశాసనములతో కటాక్షించిన పరమహంసపరివ్రాజకాచార్య, శ్రీశ్రీశ్రీతిరుమల తిరుపతి పెరియకోవిల్ కేళ్వి అప్పన్ శ్రీరంగరామానుజ పెరియజీయర్ స్వామివారి దివ్యసన్నిధిలో “తలైయల్లాల్ కైమ్మాఱిలేన్” అనురీతిలో కృతజ్ఞతాపూర్వకముగా శిరసా ప్రణమిల్లుచున్నాను. మాకు ప్రత్యేకమైన మంగళాశాసనములను కావిస్తూ తమ అమూల్యములైన అభిప్రాయములను అందించిన పెద్దలు, భాగవతోత్తములు ఉ.వే. శ్రీమాన్ శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామివారికి, ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారికి, ఉ.వే. శ్రీమాన్ టి.పి. రామచంద్రాచార్యస్వామివారికి, ఉ.వే. శ్రీమాన్ సముద్రాల రంగరామానుజాచార్యస్వామివారికి, తమిళవ్యాఖ్యకు చక్కటి ఆంధ్రవివరణమును అందించడమేకాక గ్రంథముద్రణముకొరకు అన్నివిధముల శ్రమించిన సహృదయులైన ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శింగరాచార్యస్వామివారికి ప్రత్యేకముగా కృతజ్ఞతలు తెలియజేసుకొనుచు దాసోహములు సమర్పిస్తున్నాము. ఈ సదవకాశమును మాకు కలిగించిన మాఆచార్యకుటుంబమునకు ప్రీతిపూర్వకముగా దాసోహములు కావిస్తూ కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాము.

శ్రీశ ! శ్రియా ఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయ ముపేయతయా స్ఫురంత్యా ।
నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ తుభ్యమ్
స్యాం కింకరో వృషగిరీశ ! న జాతు మహ్యమ్ ॥

ఇట్లు
భాగవతవిధేయులు
మంచుకొండ అప్పలరాజు
మంచుకొండ లక్ష్మీకుమారి దంపతులు

# ప్రాస్తావికం

కర్కటే పుష్యసంజాతం వాదిభీకర మాశ్రయే ।
వేదాంతాచార్యసచ్ఛిష్యం వరయోగిపదాశ్రితమ్ ॥

సంస్కృతసాహిత్యంలో ప్రత్యేకస్థానాన్ని అలంకరిస్తున్న స్తోత్రవాఙ్మయశాఖ విషయవైవిధ్యాన్నిబట్టి, ప్రక్రియావైలక్షణ్యాన్నిబట్టి పలు రీతుల్లో విస్తరించింది. అందులో సుప్రభాత, ప్రపత్తి, మంగళాశాసనాలరూపంలో రచింపబడ్డ స్తోత్రాలు విలక్షణమైన, విశిష్టమైన సంప్రదాయానికి చెందినవి. ఈ విభాగానికిచెందిన సంస్కృతస్తుతుల్లో మొట్టమొదటివిగా చెప్పదగినవి శ్రీప్రతివాది భయంకరం అణ్ణన్ అనుగ్రహించిన శ్రీవేంకటేశసుప్రభాతమ్, శ్రీవేంకటేశస్తోత్రమ్, శ్రీవేంకటేశప్రపత్తి, శ్రీవేంకటేశ మంగళాశాసనమ్ అనే నాల్గు స్తోత్రాలు. ఇవి ప్రస్తుతం చక్కని, సంప్రదాయసిద్ధమైన, మధురమైన తమిళవ్యాఖ్యానువాదం భగవద్భాగవతలోకానికి సాదరంగా అందింపబడు తున్నది. (తెన్గలై వైష్ణవశాఖకు చెందిన ఆచార్యులలో అత్యంతం ప్రసిద్ధులు, సాక్షాత్తు శ్రీరంగనాథుడే స్వయంగా ఆశపడి ఆశ్రయించినవారైన ఆచార్య శ్రేష్ఠులు శ్రీమద్వరవరమునులు. వీరికి గల అష్టదిగ్గజాలనే ఎనిమిదిమంది శిష్యులలో ప్రతివాది భయంకరం అణ్ణన్ ఒకరు. వీరి అభిజనం కాంచీపురం. ముడుమ్బైవంశానికి చెందిన అనంతాచార్యులనే మహనీయులకు కంచిసమీపంలోని “తిరుత్తణ్కా” అనే క్షేత్రంలో క్రోధ (1361 సం॥రం), ఆషాఢమాసం (ఆడిమాసం) కృష్ణచతుర్దశి మంగళ వారంనాడు పుష్యమీనక్షత్రంలో వీరు అవతరించారు. వీరి బాల్యనామం “హస్తిగిరినాథ నణ్ణన్”. వీరి బాల్యం, విద్యాభ్యాసాదులు అన్నీ కాంచీపురంలోనే గడచినవి. అత్యంతప్రతిభా వంతులైన వీరు అచిరకాలంలోనే పలు శాస్త్రాల్లో, సంస్కృతవేదాంతంలో నిరుపమానమైన పాండిత్యాన్ని గడించి ప్రసిద్ధి చెందారు. శ్రీవేదాంత దేశికులు, వారి కుమారులు నయనవరదాచార్యులవారివంటి పెద్దల అనుగ్రహానికి పాత్రులయ్యారు. తమకు ఆచార్యులైన నయనవరదాచార్యులవారితో వాదించాలని వచ్చిన మయావాదిని అణ్ణన్ ఓడించడాన్ని చూచిన నయనవరదాచార్యులవారు వీరిని సంతోషంతో “ప్రతిభయంకరా! రండు” అని సాదరంగా సంబోధించడంవల్ల, ఆ పేరే వీరికి నిరూపకనామమైనదట. కొంతకాలం కంచిలో వరదరాజస్వామి సన్నిధిలో ఆరాధన తీర్థకైంకర్యాన్ని నిర్వహించిన వీరు తరువాత తాతాచార్యులవారి ఆదేశానుసారం తిరుమలకు వచ్చి, అక్కడ శ్రీవేంకటేశుని ఆరాధనకు అవసరమైన తీర్థాన్ని తీసికొనివచ్చే కైంకర్యాన్ని నిర్వహించారు.



ఆ సమయంలోనే తెన్గలై శ్రీవైష్ణవ గురుపరంలోని గొప్ప ఆచార్యులైన శ్రీవరవర మునులగుణవైభవాన్ని, పాండిత్యాన్ని గూర్చి విని, వారిని సేవించాలనే ఆశతో శ్రీరంగానికి చేరి, అక్కడ వరవరమునుల పాదసన్నిధిని ఆశ్రయించి, వారి విషయంలో గొప్ప ప్రావణ్యాన్ని పొందారు. ఒక పర్యాయం శ్రీవరవరమునులతో పాటు వీరు తిరుమలకు వేంచేసినపుడు ఆచార్యనియమానుసారం శ్రీవేంకటేశ్వరుని విషయంగా ప్రస్తుత స్తోత్రాలను నాల్గింటిని ఆశువుగా అనుగ్రహించారు అని పెద్దల సూక్తి.

అణ్ణన్ ఈ స్తుతులను రచించడానికి పూర్వమే భక్తాంఘ్రిరేణుసూరి శ్రీరంగనాథుని విషయంలో “తిరుప్పళ్ళి యెళుచ్చి” అనే సుప్రభాతస్తుతిప్రబంధాన్ని అనుగ్రహించినా, అది తమిళభాషలో రచింపబడినది కాబట్టి, సంస్కృతభాషలో సుప్రభాతాది స్తుతుల రచనకు అణ్ణనే ఆద్యులని అనవచ్చు. వీరు ఇంకా శ్రీరంగాది పలు దివ్యదేశాలలోని అర్చామూర్తుల విషయంలో సుప్రభాతాదిస్తోత్రాలను అనుగ్రహించారని చెప్పబడుతున్నా, అవి అన్నీ లభిస్తున్నట్లు తోచదు. ఈ ఆచార్యవర్యులు శ్రీభాష్యం, శ్రీభాగవతం, సుబాలోపనిషత్తు, అష్టశ్లోకి, యతిరాజవిశంతి-అనే కృతులపై లఘు వ్యాఖ్యలను, శ్రీ రంగనాథ సుప్రభాతం, రామానుజసుప్రభాతం, శ్రీకృష్ణమంగళం, ప్రపత్తి యోగకారిక, సప్తతిరత్నమాలిక, శ్రీవరమునిశతకం, పాదాదికేశవమాల, బుద్ధిస్తవం, నిత్యారాధనవిధి, వరవరమునిసుప్రభాతం, వరవరమునిమంగళాశాసనం, శెయ్యతామరైత్తాళిణై పాశురం, భాష్యకారమంగళం ఇత్యాది పలు కృతులకు రచించినట్లు చెప్పబడుతున్నది. వీటిలో కొన్నిమాత్రమే ప్రస్తుతం లభ్యాలు.

ప్రపత్తి సంబంధించిన విశేషాలు, మంగళాశాసన స్వరూపవిశేషాలు తమిళ వ్యాఖ్యానంలోనే వివరంగా ప్రస్తావింపబడ్డవల్ల వాటినిగూర్చి ఇక్కడ ప్రస్తుతించవలసిన పని లేదు. సుప్రభాతంవిషయంలో మాత్రం కించిత్తు విన్నపింపబడుతున్నది. “ఉత్తిష్ఠ పురుష! హరి! లోహితపింగళాక్ష!” (తైత్తి.నారాయణవల్లి) (ఎఱ్ఱతామరలవంటి ఎఱ్ఱని కన్నులుకల పరమాత్మా! పరమపురుషా! లెమ్ము) అని అంటూ అసాధారణాలైన రెండు నామాలతో సంబోధిస్తూ, పుండరీకాక్షత్వమనే అసాధారణ చిహ్నాన్ని నిర్దేశిస్తూ వేదపురుషుడు పరమపురుషునకు సుప్రభాతాన్ని పల్కాడు. ఈ వైదిక సత్సంప్రదాయాన్ని వాల్మీకి మహర్షి “కౌసల్యాసుప్రజా రామ” అని అంటూ విశ్వామిత్రముని ముఖంగా ఉపబృంహణం చేశారు. ఉత్తరకాండలోకూడా “వీర! సౌమ్య! విబుధ్యస్వ కౌసల్యానందవర్ధన!, జగద్ధి సర్వం స్వపితి త్వయి సుప్తే నరాధిప” (37-4) (ధీరుడా!

అందమైనవాడా! కౌసల్య ఆనందాన్ని పెంపొదించేవాడా! నిద్రలే. నీవు నిద్రిస్తే లోకమంతా నిద్రపోతుంది కదా!) అని అంటూ ఈ విషయాన్ని అమ్రేడితం చేశారు. ఇందువల్ల భగవానునకు సుప్రభాతాన్ని పాడడమనేది పరమవైదికమైన, శ్రుతీతిహాస సిద్ధమైన సత్సంప్రదాయమనే విషయం స్పష్టపడుతున్నది.

"య ఏషు సుప్తేషు జాగర్తి" (కఠ-2-5-8) (అందఱు జీవులు నిద్రించేటపుడు కూడా ఇతడు మేల్కొని ఉంటాడు) అని సంస్కృతవేదంలోను, "ఉఱఙ్గువాన్‌పోల్ యోగు శెయ్‌దపెరుమాన్" (నిద్రిస్తూ ఉండేవానివలె కన్నులు మూసికొని జీవరక్షణ చింతను చేసే స్వామి) అని ద్రావిడవేదంలోను పరమాత్మ నిత్యజాగరూకుడై ఉంటాడని చెప్పబడుతూ ఉండగా ఇక సుప్రభాతాన్నిపాడే ఆవశ్యకత భక్తులకు ఏమి? అనే ప్రశ్న కలుగుతుంది. దీన్ని అభిజ్ఞులైన పూర్వాచార్యులు పలురీతుల్లో సమాధానించారు. తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు "తిరుప్పళ్ళి యెళుచ్చి" అనే సుప్రభాతప్రబంధాన్ని శ్రీరంగనాథుని విషయంగా విజ్ఞాపన చేయడంలోగల సామంజస్యాన్ని వివరిస్తూ నంజీయర్ అనే ఆచార్యవర్యులు "అనాది కాలంగా అజ్ఞానంతో నిద్రపోయే ఈ దివ్యసూరులకు శ్రీరంగనాథుడు తన నిరవధికకృపతో ప్రబోధాన్ని కల్గించి, అనుగ్రహించినందువల్ల, తత్త్వజ్ఞానాన్ని పొందిన ఆళ్వార్లు శ్రీరంగ నాథుణ్ణి ప్రాప్యంగా, ప్రాపకంగా తలుస్తూ స్థిరమైన అధ్యవసాయాన్ని కల్గినవారయ్యారు. వీరిని ఆ స్థితిలో చూచిన శ్రీరంగనాథుడు నిర్భరుడై ఆనందంతో కన్నులను మూసికొన్నాడు. అపుడు ఈ ఆళ్వార్లు తమవలె ఇతరులుకూడా ఉజ్జీవించాలనే భావంతోను, కైంకర్య భావనతోను స్వామిని ప్రబోధిస్తూ ఈ తిరుప్పళ్ళి యెళుచ్చి అనే దివ్యప్రబంధాన్ని పాడారు" అని అనుగ్రహించడం ప్రకృతంలో కూడా అనుసంధేయం. ఇక, ఈ సుప్రభాతాన్ని వసంతతిలక వృత్తంలో అణ్ణన్ అనుగ్రహించడం కూడా గమనించవలసిన ఇంకొక విషయం. కాళిదాస మహాకవి రఘువంశమహాకావ్యంలోని 5వ సర్గచివరలో అజమహారాజుకు సుప్రభాతాన్ని పాడే సందర్భాన్ని ఈ వృత్తంలోనే రచించడం అణ్ణన్‌ను ప్రేరేపించి ఉండవచ్చు.

అణ్ణన్ అనుగ్రహించి ఈ స్తుతుల శైలి అత్యంతం మధురం. వీటిని అణ్ణన్ అనుగ్రహించేటపుడు పలు వేదవేదాంతాది సూక్తులే కాకుండా, దివ్యసూరులు దివ్యప్రబంధాలు, వాటికి పూర్వాచార్యులు అనుగ్రహించిన రస్యవ్యాఖ్యానాలుకూడా వారి మనస్సులో మెదిలి ఉంటాయి - అనే విషయం ఈ స్తుతులను నిశితంగా పరిశీలించిన వారికి మాత్రమే గోచరిస్తుంది. అందువల్ల ఇవి సామాన్యస్తుతులు కావు.



శ్రీవైష్ణవ సంప్రదాయ రహస్యసర్వస్వాలుగా భావించతగినవి. ఇంతవరకు ఎంతోమంది ఈ కృతులకు వ్యాఖ్యానాలను వెలయించినా, భాషాపరమైన, ఆలంకారికాలైన, వేదాంతశాస్త్ర గమ్యాలైన విషయాలను వివరించారే తప్ప, దివ్యసూరిసూక్తులను, వాటికి గల పూర్వాచార్య వ్యాఖ్యాలను దృష్టిలో ఉంచుకొని వ్యాఖ్యానించినవారు ఎవరూ లేరనే చెప్పాలి. ఆ కొఱత తీర్చినది ప్రస్తుత తమిళ వ్యాఖ్య.

తమిళభాషలో రచింపబడినా, అత్యంతసరళం, సువిశదమైన ఈ వ్యాఖ్యానాన్ని అనుగ్రహించినవారు తిరుపతివాస్తవ్యులు, వైకుంఠవాసులు, గురువర్యులు, శ్రీవైష్ణవసింహ బిరుదభూషితులు, న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ పురిశై తిరుమలై అనన్దాణ్‌పిళ్ళై కృష్ణమాచార్యస్వామి వారు. వీరి వైభవం సందర్భానుగుణమని సంగ్రహంగా నివేదింపబడు తున్నది. వీరి అభిజనం కంచిసమీపంలోని పురిశై అగ్రహారం. తిరుపతిలోని సంస్కృత కళాశాలలో వీరు న్యాయశాస్త్రాన్ని మిగిలిన సామాన్య శాస్త్రాలతో పాటు ఉ.వే.శ్రీమాన్ ఉత్తమూరు వీరరరాఘవాచార్యస్వామివారు, ఉ.వే.శ్రీమాన్ పురిశై కృష్ణమాచార్యస్వామి వారివంటి మహనీయుల సన్నిధిలో క్షుణ్ణంగా అధికరించారు. తరువాత తమిళ విద్వాన్ పరీక్షలోకూడా ప్రథములుగా ఉత్తీర్ణులయ్యారు. శ్రీభాష్యాన్ని శ్రీపురిశై కృష్ణమాచార్య స్వామివారి సన్నిధిలో, భగవద్విషయాన్ని ఉ.వే.శ్రీమాన్ కచ్చి కిడాంబి యామునాచార్య స్వామివారి సన్నిధిలో అధికరించారు. పలు సంప్రదాయ రహస్యాలను తెలిసిన వీరి వ్యక్తిత్వం చాలా విలక్షణమైనది. వీరి ఋజుత్వం, అర్థశుద్ధి, నిర్మలమైన ఆచారవ్యవహారాలు ఇత్యాదులు -అన్నీ విలక్షణాలే. "వస్త్రేణ వపుషా వాచా" ఇత్యాది సూక్తికి వీరు ఉత్తమోదాహరణం. వీరివలెనే, వీరి అనుజులు ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారు కూడా ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని కలవారు. పరమసాత్త్వికులు. వ్యాకరణ శాస్త్రాన్ని సొంతం అధ్యయనం చేసినవారు. వీరిరువురు చాలాకాలం తిరుపతిలో, తిరుమలలో దివ్యప్రబంధగోష్ఠిని అలంకరించి, శ్రీవేంకటేశుని విషయంలో వాగ్రూపమైన కైంకర్యాన్ని చేసిన మహనీయులు. శ్రీమాన్ కృష్ణమాచార్యస్వామి మొదట కొంత కాలం శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాసంస్థలో తమిళపండిట్‌గా ఉండి, ఆ పిమ్మట శ్రీవేంకటేశ్వరాప్రాచ్య కళాశాలలో న్యాయశాఖాధిపతిగా వృత్తిని నిర్వహించి, ఎంతమందికో శాస్త్రభిక్షను పెట్టారు. మహావిద్వాన్ శ్రీకాంచీ అణ్ణంగరాచార్య స్వామివారితో దేహసంబంధాన్నికల వీరి అదృశ్యహస్తం అణ్ణంగరాచార్యస్వామి వారు ముద్రించిన పలు అమూల్యగ్రంథాల సంస్కరణలో ఉన్నది అనడం అత్యంతవాస్తవం. వీరు చేసిన ఎన్నో పరిష్కారాలను, సూచలను శ్రీఅణ్ణాస్వామివారు శ్రీవేళుక్కుడి

స్వామివారి వంటి పెద్దలు అందఱు నిర్వికల్పంగా ఆమోదించేవారు. చాలాకాలం నివృత్తిమార్గంలోనే జీవితాన్ని గడిపిన ఈ స్వామి ఆత్మీయుల ప్రార్థనపై రచించిన కృతులు కొన్ని మాత్రమే ఉన్నాయి.వాటిలో ప్రస్తుతతమిళ వ్యాఖ్య ఒకటి. ఇది కాక, అమృతఫలావళి వ్యాఖ్య, లోకాచార్య పంచాశత్ వ్యాఖ్య, దేవరాజార్య ప్రణీతమైన వరవరమునిశతకానికి వ్యాఖ్య, శ్రీఅణ్ణన్ ప్రణీతమైన, శ్రీవరవరముని విషయకమైన "కణ్ణినుణ్ శిఱుత్తామ్బు" కు వ్యాఖ్య, శ్రీకృష్ణమంగళవ్యాఖ్య, కూరనాథవింశతి, కూరనాథపంచాశత్, యతిరాజవింశతి, పూర్వోదినచర్యల వ్యాఖ్యలు, టి.టి.డివారి సప్తగిరి మాసప్రతిక (తమిళం)లో అనుగ్రహించిన పలు అమూల్యవ్యాసాలు పేర్కొనదగినవి. వీరి వ్యాసాలు "తిరుమలై యప్పన్ తిరువరుళ్" అనే పేరుతో రెండు సంపుటాలుగా పుస్తకరూపంలో ప్రచురించబడ్డాయి. వీరి సంపాదకత్వంలో టి.టి.డి. వారు సుమారు 50 సం.లకు పూర్వం ప్రచురించిన నిత్యానుసంధానం (తెలుగు వ్యాఖ్యతో), తిరువాయ్మొళి (తెలుగు వ్యాఖ్యతో) గ్రంథాలు పండితపామరులు అందఱిచేత ఆదరింపబడ్డాయి. వీరిని చెన్నైనగరవాసులు "శ్రీవైష్ణవసింహ" బిరుదంతో సత్కరించారు.

నా ఆంధ్రానువాదంలోని లోటుపాట్లను సహృదయపాఠకులు మన్నించి, గ్రంథాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు
భాగవత విధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు



# శ్రీవేంకటేశ సుప్రభాతమ్

(1) కౌసల్యాసుప్రజా! రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ! నరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్ ॥

(2) ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద! ఉత్తిష్ఠ గరుడధ్వజ!
ఉత్తిష్ఠ కమలాకాంత! త్రైలోక్యం మంగళం కురు!

(3) మాత స్సమస్తజగతాం మధుకైటభారేః
వక్షోవిహారిణి! మనోహరదివ్య(రూపే) మూర్తే ।
శ్రీస్వామిని! శ్రితజనప్రియదానశీలే!
శ్రీవేంకటేశదయితే! తవ సుప్రభాతమ్ ॥

(4) తవ సుప్రభాత మరవిందలోచనే!
భవతు ప్రసన్నముఖచంద్రమండలే ।
విధిశంకరేంద్రవనితాభి రర్చితే!
వృషశైలనాథదయితే! దయానిధే ॥

(5) అత్ర్యాది సప్తఋుషయ స్సముపాస్య సంధ్యా -
మాకాశసింధుకమలాని మనోహరాణి ।
ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రపన్నాః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(6) పంచాననాబ్జభవషణ్ముఖవాసవాద్యాః
త్రైవిక్రమాదిచరితం విబుధా స్తువంతి ।
భాషాపతిః పఠతి వాసరశుద్ధి మారాత్
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(7) ఈషత్ప్రఫుల్లసరసీరుహనారికేళ -
పూగద్రుమాదిసుమనోహరపాలికానామ్ ।
ఆవాతి మంద మనిల స్సహ దివ్యగంధైః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(8) ఉన్మీల్య నేత్రయుగ ముత్తమపంజరస్థాః
పాత్రావశిష్టకదళీఫలపాయసాని ।
భుక్త్వా సలీల మథ కేళిశుకాః పఠంతి
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(9) తంత్రీప్రకర్షమధురస్వనయా విపంచ్యా
గాయత్యనంతచరితం తవ నారదో-పి ।
భాషాసమగ్ర మసకృత్కరచారరమ్యం
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(10) భృంగావలీ చ మకరందరసానువిద్ధ-
ఝుంకారగీతనినదైః సహ సేవనాయ ।
నిర్యాత్యుపాంతసరసీకమలోదరేభ్యః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(11) యోషాగణేన వరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధిమంథనతీవ్రఘోషాః ।
రోషాత్ కలిం విదధతే కకుభ శ్చ కుంభాః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(12) పద్మేశమిత్రశతపత్రగతాళివర్గాః
హర్తుం శ్రియం కువలయస్య నిజాంగలక్ష్మ్యా ।
భేరీనినాద మివ బిభ్రతి తీవ్రనాదం
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

(13) శ్రీమన్నభీష్టవరదాఖిలలోకబంధో!
శ్రీ శ్రీనివాస! జగదేకదయైకసింధో ।
శ్రీదేవతాగృహభుజాంతరదివ్యమూర్తే!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(14) శ్రీస్వామిపుష్కరిణికాప్లవనిర్మలాంగాః
శ్రేయోర్థినో హరవిరించిసనందనాద్యాః ।
ద్వారే వసంతి వరవేత్రహతోత్తమాంగాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(15) శ్రీశేషశైలగరుడాచలవేంకటాద్రి -
నారాయణాద్రివృషభాద్రివృషాద్రిముఖ్యామ్ ।
ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(16) సేవాపరాః శివసురేశకృశానుధర్మ -
రక్షోంబునాథపవమానధనాధినాథాః ।
బద్ధాంజలిప్రవిలసన్నిజశీర్షదేశాః
శ్రీవేంకటాచలపతే! తవసుప్రభాతమ్ ॥

(17) ధాటీషు తే విహగరాజమృగాధిరాజ -
నాగాధిరాజగజరాజహయాధిరాజాః ।
స్వస్వాధికారమహిమాధిక మర్థయంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(18) సూర్యేందుభౌమబుధవాక్పతికావ్యసౌరి-
స్వర్భానుకేతుదివిషత్పరిషత్ప్రధానాః ।
త్వద్దాసదాసచరమావధిదాసదాసాః
శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥

(19) త్వత్పాదధూళిభరితస్ఫురితోత్తమాంగాః
స్వర్గాపవర్గనిరపేక్షనిజాంతరంగాః ।
కల్పాపగమాకలనయాకులతాం లభంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(20) త్వద్గోపురాగ్రశిఖరాణి నిరీక్షమాణాః
స్వర్గాపవర్గపదవీం పరమాం శ్రయంతః ।
మర్త్యా మనుష్యభువనే మతి మాశ్రయంతే
శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥

(21) శ్రీభూమినాయక! దయాదిగుణామృతాబ్ధే ।
దేవాధిదేవ! జగదేకశరణ్యమూర్తే ।
శ్రీమన్ననంతగరుడాదిభి రర్చితాంఘ్రే !
శ్రీవేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ ॥

(22) శ్రీపద్మనాభ! పురుషోత్తమ! వాసుదేవ!
వైకుంఠ! మాధవ! జనార్దన! చక్రపాణే! ।
శ్రీవత్సచిహ్న! శరణాగతపారిజాత!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(23) కందర్పదర్పహరసుందరదివ్యమూర్తే !
కాంతాకుచాంబురుహకుట్మలలోలదృష్టే ।
కల్యాణనిర్మలగుణాకర! దివ్యకీర్తే !
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(24) మీనాకృతే! కమఠ! కోల! నృసింహ! వర్ణిన్ !
స్వామిన్! పరశ్వథతపోధన! రామచంద్ర!
శేషాంశరామ! యదునందన! కల్కిరూప!
శ్రీవేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ !॥

(25) ఏలాలవంగఘనసారసుగంధితీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణమ్ ।
ధృత్వా-ద్య వైదికశిఖామణయః ప్రహృష్టాః
తిష్ఠంతి వేంకటపతే! తవ సుప్రభాతమ్ ॥

(26) భాస్వా నుదేతి వికచాని సరోరుహాణి
సంపూరయంతి నినదైః కకుభో విహంగాః ।
శ్రీవైష్ణవా స్సతత మర్థితమంగళా స్తే
ధామాశ్రయంతి తవ వేంకట! సుప్రభాతమ్ ॥

(27) బ్రహ్మాదయ స్సురవరా స్సమహర్షయ స్తే
సంత స్సనందముఖా స్త్వథ యోగివర్యాః ।
ధామాంతికే తవ హి మంగళవస్తుహస్తాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(28) లక్ష్మీనివాస! నిరవద్య! గుణైకసింధో!
సంసారసాగరసముత్తరణైకసేతో(పోత)!
వేదాంతవేద్యనిజవైభవ! భక్తభోగ్య!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

(29) ఇత్థం వృషాచలపతే రిహ సుప్రభాతం
యే మానవాః ప్రతిదినం పఠితం ప్రవృత్తాః ।
తేషాం ప్రభాతసమయే స్మృతి రంగభాజాం
ప్రజ్ఞాం పరార్థసులభాం పరమాం ప్రసూతే ॥

ఆ



# శ్రీవేంకటేశ స్తోత్రమ్

(1) కమలాకుచచూచుకకుంకుమతో
నియతారుణితాతులనీలతనో ।
కమలాయతలోచన! లోకపతే!
విజయీభవ వేంకటశైలపతే ॥

(2) సచతుర్ముఖషణ్ముఖపంచముఖ-
ప్రముఖాఖిలదైవతమౌళిమణే ।
శరణాగతవత్సల! సారనిధే!
పరిపాలయ మాం వృషశైలపతే ॥

(3) అతివేలతయా తవ దుర్విషహై
రనువేలకృతై రపరాధశతైః ।
భరితం త్వరితం వృషశైలపతే !
పరయా కృపయా పరిపాహి హరే ॥

(5) కలవేణురవావశగోపవధూ -
శతకోటివృతాత్ స్మరకోటిసమాత్ ।
ప్రతివల్లవికాభిమతతాత్ సుఖదాత్
వసుదేవసుతా న్న పరం కలయే ॥

(6) అభిరామగుణాకర! దాశరథే!
జగదేకధనుర్ధర! ధీరమతే ! ।
రఘునాయక! రామ! రమేశ! విభో!
వరదో భవ దేవ! దయాజలధే ॥

(7) అవనీతయాకమనీయకరం
రజనీకరచారుముఖాంబురుహమ్ ।
రజనీచరరాజతమోమిహిరమ్
మహనీయ మహం రఘురామ మయే ॥

(8) సుముఖం సుహృదం సులభం సుఖదం
స్వనుజం చ సుజాయ మమోఘశరమ్ ।
అపహాయ రఘూద్వహ మన్య మహం
న కథంచన కంచన జాతు భజే ॥

(9) వినా వేంకటేశం న నాథో ననాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి !
హరే! వేంకటేశ! ప్రసీద! ప్రసీద !
ప్రియం వేంకటేశ! ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥

(10) అహం దూరత స్తే పదాంభోజయుగ్మప్రణామేచ్ఛయా-గత్య సేవాం కరోమి ।
సకృత్సేవయా నిత్యసేవాఫలం త్వం ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ ॥

(11) అజ్ఞానినా మయా దోషా నశేషాన్ విహితాన్ హరే ।
క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైలశిఖామణే ॥

卐卐卐卐卐卐

# శ్రీవేంకటేశ ప్రపత్తి

(1) ఈశానాం జగతో-స్య వేంకటపతేః విష్ణోః పరాం ప్రేయసీ
తద్వక్షఃస్థలనిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

(2) శ్రీమన్! కృపాజలనిధే! కృతసర్వలోక!
సర్వజ్ఞ! శక్త! నతవత్సల! సర్వశేషిన్ !
స్వామిన్! సుశీల! సులభాశ్రితపారిజాత !
శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే ॥

(3) ఆనూపురార్పితసుజాతసుగంధిపుష్ప -
సౌరభ్యసౌరభకరౌ సమసన్నివేశౌ ।
సౌమ్యౌ సద్యా-నుభవనే-పి నవానుభావ్యౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(4) సద్యోవికాసిసముదిత్వరసాంద్రరాగ -
సౌరభ్యనిర్భరసరోరుహసామ్యవార్తామ్ ।
సమ్యక్షు సాహసపదేషు విలేఖయంతౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥



(5) రేఖామయధ్వజసుధాకలశాతపత్ర-
వజ్రాంకుశాంబురుహకల్పకశంఖచక్రైః ।
భవ్యై రలంకృతతలౌ పరతత్త్వచిహ్నైః
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(6) తామ్రోదరద్యుతిపరాజితపద్మరాగౌ
బాహ్యై ర్మహోభి రభిభూతమహేంద్రనీలౌ ।
ఉద్యన్నఖాంశుభి రుదస్తశశాంకభాసౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(7) సప్రేమభీతికమలాకరపల్లవాభ్యాం
సంవాహనే-పి సపది క్లమ మాదధానౌ ।
కాంతా వవాఙ్మనసగోచరసౌకుమార్యౌ
శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే ॥

(8) లక్ష్మీమహీతదనురూపనిజానుభావ -
నీళాదిదివ్యమహిషీకరపల్లవానామ్ ।
ఆరుణ్యసంక్రమణతః కిల సాంద్రరాగౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(9) నిత్యానమద్విధిశివాదికిరీటకోటి -
ప్రత్యుప్తదీప్తనవరత్నమహఃప్రరోహైః ।
నీరాజనావిధి ముదార ముపాదదానౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(10) విష్ణోః పదే పరమ ఇత్యుదితప్రశంసౌ
యౌ మధ్వ ఉత్స ఇతి భోగ్యతయా-ప్యుపాత్తౌ ।
భూయ స్తథేతి తవ పాణితలప్రదిష్టౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే

(11) పార్థాయ తత్సదృశసారథినా త్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి ।
భూయో-పి మహ్య మిహ తౌ కరదర్శితౌ తే
శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే ॥

(12) మన్మూర్ధ్ని కాళియఫణే వికటాటవీషు
శ్రీవేంకటాద్రిశిఖరే శిరసి శ్రుతీనామ్ ।
చిత్తే-ప్యనన్యమనసాం సమ మాహితౌ తౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(13) ఆమ్లానహృష్యదవనీతలకీర్ణపుష్పౌ
శ్రీవేంకటాద్రిశిఖరాభరణాయమానౌ ।
ఆనందితాఖిలమనోనయనౌ తవైతౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(14) ప్రాయః ప్రసన్నజనతాప్రథమావగాహ్యౌ
మాతు స్తనా వివ శిశో రమృతాయమానౌ ।
ప్రాప్తౌ పరస్పరతులా మతులాంతరౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(15) సత్వోత్తరైః సతతసేవ్యపదాంబుజేన
సంసారతారకదయార్ద్రదృగంచలేన ।
సౌమ్యోపయంతృమునినా మమ దర్శితౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

(16) శ్రీశ శ్రియా ఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయ ముపేయతయా స్ఫురంత్యా ।
నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ తుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ న జాతు మహ్యామ్ ॥



# శ్రీవేంకటేశ మంగళమ్

(1) శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయే-ర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

(2) లక్ష్మీసవిభ్రమాలోకసుభ్రూవిభ్రమచక్షుషే ।
చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్ ॥

(3) శ్రీవేంకటాద్రిశృంగాగ్రమంగళాభరణాంఘ్రయే ।
మంగళానాం నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥



(4) సర్వావయవసౌందర్యసంపదా సర్వచేతసామ్ ।
సదా సమ్మోహనాయా-స్తు వేంకటేశాయ మంగళమ్ ॥

(5) నిత్యాయ నిరవద్యాయ సత్యానంతచిదాత్మనే ।
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥

(6) స్వత స్సర్వవిదే సర్వశక్తయే సర్వశేషిణే ।
సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్ ॥

(7) పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే ।
ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్ ॥

(8) ఆకారతత్త్వ మశ్రాంత మాత్మనా మనుపశ్యతామ్ ।
అతృప్త్యమృతరూపాయ వేంకటేశాయ మంగళమ్ ॥

(9) ప్రాయ స్స్వచరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా ।
కృపయా దిశతే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥

(10) దయామృతతరంగిణ్యా స్తరంగై రివ శీతలైః ।
అపాంగై స్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్ ॥

(11) స్రగ్భూషాంబరహేతీనాం సుషమావహమూర్తయే ।
సర్వార్తిశమనాయా-స్తు వేంకటేశాయ మంగళమ్ ॥

(12) శ్రీవైకుంఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే ।
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్ ॥

(13) శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే ।
సర్వలోకనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

(14) మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।
సర్వై శ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయా-స్తు మంగళమ్ ॥

శ్రీమతే రామానుజాయ నమః

## ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ స్తుతి

వేదాంతదేశికకటాక్షవివృద్ధబోధం
కాంతోపయంతృయమినః కరుణైకపాత్రమ్ ।
వత్సాన్వవాయ మనవద్యగుణై రుపేతం
భక్త్యా భజామి పరవాదిభయంకరార్యమ్ ॥

వేదాంతదేశికులు కటాక్షంచేత వృద్ధి చెందిన జ్ఞానాన్ని కలవారు, శ్రీవరవరమునుల కరుణకు అద్వితీయపాత్రమైనవారు, శ్రీవత్సగోత్రంలో జన్మించినవారు, దోషాలు లేని గుణాలను కలవారైన ప్రతివాదిభయంకరాచార్యులవారిని (అణ్ణన్) భక్తితో సేవిస్తున్నారు.

(ఈ శ్లోకంలోని మొదటి పాదాన్ని శ్రీవరవరమునులు, రెండవ పాదాన్ని అణ్ణన్, ఉత్తరార్ధంలోని రెండు పాదాలను శ్రీఅణ్ణన్ శిష్యులును అనుగ్రహించినట్లు శ్రీవాదిభీకర గురువైభవమనే గ్రంథం తెలుపుతున్నది.)

శ్రీరమ్యజామాతృమునీంద్రశాసనాత్
యో మంగళాశాసనసౌప్రభాతికే ।
చక్రే ప్రపత్తిం చ వృషాచలేశితుః
తం వాదిభీకృద్గురు మాశ్రయామ్యహమ్ ॥

శ్రీవరవరమునుల ఆజ్ఞవల్ల శ్రీవేంకటేశుని విషయంలో మంగళాశాసనం, సుప్రభాతం ప్రపత్తి (చకారంచేత స్తోత్రం సూచింపబడింది) అనే వీనిని అనుగ్రహించిన శ్రీవాది భీకరార్యులను (అణ్ణన్) ఆశ్రయిస్తున్నాను.





శ్రీమతే వేంకటేశ్వర పరబ్రహ్మణే నమః

# శ్రీవేంకటేశ సుప్రభాతము - సవ్యాఖ్యానము

## అవతారిక-అనువాదము

ఆదిశేషుని అవతారమైన భగవద్రామానుజుల పునరవతారభూతులై, విశదవాక్ శిఖామణిరైన శ్రీమణవాళమహామునులకు గల, అష్టదిగ్గజాచార్యులను ప్రసిద్ధిపొందిన శిష్యులు ఎనిమిదిమందిలో ప్రతివాది భయంకరం అణ్ణన్ అను మహాచార్యులు ఒకరు. శ్రీమణవాళమహామునులు వేంకటాచలమునకు వేంచేసినపుడు వారి నియమనము ప్రకారము శ్రీవేంకటేశ్వరునిగూర్చి సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళా శాసనము- అను నాల్గు స్తోత్రములను ఆ స్వామి సమక్షమున ప్రాతఃకాలములో అణ్ణన్ విజ్ఞాపించుచు అనాదిగావచ్చు సంప్రదాయమును అనుసరించి మొదటగా "కౌసల్యాసుప్రజా రామ" అను ఇతిహాసశ్రేష్ఠమైన శ్రీరామాయణశ్లోకమును, "ఉత్తిష్ఠ నరశార్దూల" అను ఒక పురాణ శ్లోకమును అనుసంధించుచున్నారు. ఈ నాల్గు స్తోత్రములు వేంకటాద్రిపై ఆనాటినుండి ఈనాటివరకు ప్రతిదినము సుప్రభాతకాలమున అనుసంధింపబడుచున్నవి.



1. కౌసల్యాసుప్రజా! రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ! నరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్ ॥

కౌసల్యాసుప్రజాః = కౌసల్యయొక్క గొప్ప కుమారుడా!, నరశార్దూల = మానవులలో గొప్పవాడా!, రామ = రామా!, పూర్వా సంధ్యా = ఉదయకాలసంధ్యాసమయము, ప్రవర్తతే = ఆరంభమగుచున్నది, దైవమ్ ఆహ్నికమ్ = దేవతలనుగూర్చి చేయవలసిన పగటికాలములోని అనుష్ఠానము, కర్తవ్యం = చేయవలసియున్నది, ఉత్తిష్ఠ = లెమ్ము!

కౌసల్యాదేవి కుమారుడా!, పురుషోత్తమా! శ్రీరామా! పొద్దుపొడిచినది. ప్రాతః కాలకృత్యములను నిర్వహింపవలసియున్నది. కన్నులను తెఱచి నిద్రలెమ్ము. (ఈ శ్లోకము విశ్వామిత్రుడు శ్రీరాముని నిద్రలేపునట్లు వాల్మీకముని రచితమైన శ్రీరామాయణములో కలదు)

"కౌసల్యాసుప్రజా రామ" అను ప్రయోగమును "కౌసల్యా సుప్రజాః, రామ"

అని రెండుగా విడదీసినచో, కౌసల్యాదేవి సుపుత్రుడా! అని, రామా! అని, "కౌసల్యా, సుప్రజాః, రామ" అని మూడు పదములుగా గ్రహించినచో, "సుప్రజాః" అను పదము కౌసల్యకు విశేషణమై, శ్రీరామా!, (నీ తల్లియగు) కౌసల్య గొప్పకుమారుని కన్నది అయినది- అనియును అర్థములు స్ఫురించును. ఈ రెండు ప్రకారములైన అర్థములందును "రామా! - ఇంత అందమైన నిన్ను పుత్రునిగా పొందిన కౌసల్యయొక్క భాగ్యమెంతటిదో కదా!" అని కీర్తించుటలోనే తాత్పర్యము. విశ్వామిత్రుడు శ్రీరాముని, లక్ష్మణుని నిద్రలేపి, వారివలన నెఱవేర్పదలచిన తమ యాగకార్యమును మఱచి, శ్రీరాముని కుమారునిగా పొందిన తల్లిని స్తుతించుచున్నారు. "ఉణ్ణప్పుక్కు వాయై మఱప్పారైప్పోలే (మునివన్) వన్ద కార్యత్తై మఱన్దాన్. ఒరుతిరువాట్టి పిళ్ళైపెరుమ్బడియే! ఎన్గిఱాన్" (భుజింపబోయి నోటిలో ముద్దను పెట్టుకొనుటను మఱచువారివలె, ముని వచ్చిన కార్యమును మఱచెను. ఒక భాగ్యవతి పుత్రుని కన్న తీరు ఏమి ఆశ్చర్యము? అనుచున్నాడు - అనుచు తిరుప్పావైలోని రెండవ పాశురవాఖ్యలో "పరమన్" అను పదమును వ్యాఖ్యానించు సందర్భమున అళకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అను వైష్ణవ ఆచార్యులు పల్కిరి.

రామనామమునకు తన రూపసౌందర్యముచే, సద్గుణములు, లీలలు మొదలగువానిచే అందఱిని ఆనందింపచేయువాడని తాత్పర్యము. ఈ ఒక్కనామమే వేయి నామములతో సమానమైన గొప్పతనమును కల్గినది. "శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే, సహస్రనామ తత్తుల్యం రామ నామ వరాననే" (నాకు మిక్కిలి ప్రియమైనదానా!, నేను శ్రీరామా! రామా! రామా! అని రామ నామమును పల్కి ఆనందింతును. ఎందులకనగా అది వేయినామములతో తుల్యమైనది) అని పార్వతితో శివుడు పల్కుటను బట్టి ఈ పేరుయొక్క గొప్పతనమును తెలియవచ్చును. ఈ నామము దశరథుని కుమారుడగు శ్రీరామునకే కాక. అతడు ఎవరి అవతారమో ఆ పరబ్రహ్మకుకూడ వర్తించును అనుటకు అగస్త్యసంహితావచనము నొకదానిని ప్రమాణముగా శ్రీరామాయణ వ్యాఖ్యాతయగు శ్రీగోవిందరాజులు చూపిరి. "రమంతే యోగినో-నంతే సత్యానందే చిదాత్మని,ఇతి రామపదేనాసౌ పరంబ్రహ్మో-భిధీయతే" (అన్నిచోట్ల అన్ని కాలములందు, అన్ని ప్రకారములుగను ఉండుటచే అంతులేనివాడు, మార్పులేనివాడు, ఆనందరూపుడు, జ్ఞానస్వరూపుడును అగు పరమాత్మయందు యోగులు రమించుచున్నారు-అనగా మనస్సు నిలిపి ఆనందించుచున్నారు-అను కారణముచే ఈ పరమాత్మయగు పరబ్రహ్మము రామశబ్దముచే నిర్దేశింపబడుచున్నది) అనునదియే ఆ ప్రమాణము. దీనిచే పరబ్రహ్మవాచకమగు రామనామము ఆ పరబ్రహ్మ అవతారవిశేషమగు శ్రీరాముని (దాశరథుని) తెలుపుచున్నదని ఏర్పడినది.



పూర్వసంధ్య అనగా - ఉదయకాలసంధ్య. దీనిచే ఉత్తరసంధ్య అనగా - సాయంకాల సంధ్య అని, మధ్యసంధ్య అనగా మధ్యాహ్నకాల సంధ్య అని తెలియుచున్నది.

(ఉత్తిష్ఠ నరశార్దూల) - పురుషులలో శ్రేష్ఠులైనవాడా! మేల్కొని శ్రద్ధగా చేయవలసిన కార్యములుండగా నిద్రకు తావు ఈయతగునా? - అని, ఇంతవరకు నీ నిద్రాకాలిక సౌందర్యమును అనుభవించితిని, ఇక నిద్రలేచు సౌందర్యమును దర్శింపవలెను, నిద్ర లెమ్ము! అనియు దీనికి అర్థము-అని భావమును పల్కుదురు.

(దైవమ్ ఆహ్నికమ్ కర్తవ్యమ్)-నిద్రలేచినచో ఏర్పడు ఫలితము తెలుపబడుచున్నది. కలు ఫలము దేవుడగు నీచే వేదాదులయందు విధింపబడిన నిత్యకర్మను నేను చేయవలెను, నిద్ర లెమ్ము! అనియు రెండు భావములను తెలుపుదురు.

2 ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద! ఉత్తిష్ఠ గరుడధ్వజ!
ఉత్తిష్ఠ కమలాకాంత! త్రైలోక్యం మంగళం కురు!

గోవింద = పశువులను మేపు శ్రీకృష్ణా!, ఉత్తిష్ఠ = త్వరగా లెమ్ము, గరుడధ్వజ = గరుడుని ధ్వజమున కలవాడా!, ఉత్తిష్ఠ = త్వరగా లెమ్ము, కమలాకాంత = లక్ష్మీదేవికి ప్రియమైనవాడా! ఆకర్షణీయుడైనవాడా!, ఉత్తిష్ఠ = లెమ్ము, త్రైలోక్యం = ముల్లోకములను, మంగళం = శుభములను కల్గినవానినిగా, కురు = చేయుము

గోవిందా!, గరుడధ్వజా! కమలాకాంతా!, ముల్లోకములను కటాక్షముతో పవిత్ర మొనర్చుటకై నీవు వెంటనే లెమ్ము.

(ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద) - (ఇచటి) "ఉత్తిష్ఠ, ఉత్తిష్ఠ" అను పునరుక్తి త్వరను సూచించును "గోవిందో వాసుదేవే స్యాత్ గవాధ్యక్షే" అను నిఘంటు వచనమునుబట్టి గోవిందశబ్దము వాసుదేవుని, గోవులను కాయువానిని తెలుపును. వాసుదేవపదము "వాను శ్చాసౌ దేవ శ్చ వాసుదేవః" అని, "వసుదేవస్య పుత్రః వాసుదేవః" అను రెండు వ్యుత్పత్తులను కల్గినది. వీనిలో మొదటిది తనయందు సమస్తలోకము అణగియుండగా, తానును వానియందు నిలచియున్నవాడై, వానిలోని దోషము లేమియు తనయందు సంక్రమింపనివాడైన నారాయణుని, రెండవది శ్రీకృష్ణుని తెలుపును,. కావున గోవింద పదము మొదట నారాయణుడై, మధ్యలో వసుదేవుని పుత్రుడై, చివర గోకులమునకు వచ్చి గోపాలుడై నిలచిన భగవానుని తెలుపుచున్నదని గ్రహింపనగును. మఱియు గో శబ్దమునకు భూమి, వాక్కు, సూర్యుడు మొదలగు పలు అర్థములుండుటచే వానికి అనుగుణముగా వరాహావతారమును ఎత్తి భూమిని పొందినవాడని, వామనుడై భూమిని

## శ్రీమతే రామానుజాయ నమః
## అణ్ణన్ తనియన్

వేదాంతదేశికకటాక్షవివృద్ధబోధం
కాంతోపయంత్ృయమినః కరుణైకపాత్రమ్ ।
వత్సాన్వవాయ మనవద్యగుణై రుపేతం
భక్త్యా భజామి పరవాదిభయంకరార్యమ్ ॥

వేదాంతదేశికులు కటాక్షంచేత వృద్ధిచెందిన జ్ఞానాన్నికలవారు, శ్రీవరవరమునుల కరుణకు అద్వితీయపాత్రమైనవారు, శ్రీవత్సగోత్రంలో జన్మించినవారు, దోషాలు లేని గుణాలను కలవారైన ప్రతివాదిభయంకరాచార్యులవారిని (అణ్ణన్) భక్తితో సేవిస్తున్నారు.

(ఈ శ్లోకంలోని మొదటిపాదాన్ని శ్రీవరవరమునులు, రెండవపాదాన్ని అణ్ణన్, ఉత్తరార్ధంలోని రెండుపాదాలను శ్రీఅణ్ణన్ శిష్యులును అనుగ్రహించినట్లు శ్రీవాదిభీకరగురువైభవమనే గ్రంథం తెలుపుతున్నది.)

శ్రీరమ్యజామాతృమునీంద్రశాసనాత్
యో మంగళాశాసనసౌప్రభాతికే ।
చక్రే ప్రపత్తిం చ వృషాచలేశితుః
తం వాదిభీకృద్గురు మాశ్రయామ్యహమ్ ॥

శ్రీవరవరమునుల ఆజ్ఞవల్ల శ్రీవేంకటేశుని విషయంలో మంగళాశాసనం, సుప్రభాతం ప్రపత్తి (చకారంచేత స్తోత్రం సూచింపబడింది) అనే వీనిని అనుగ్రహించిన శ్రీవాదిభీకరార్యులను (అణ్ణన్) ఆశ్రయిస్తున్నాను.





## శ్రీప్రతివాది భయంకరం అణ్ణన్ వాழித్తిరునామము

మన్నుపుకళ్ మణవాళముని క్కన్బన్ వాழியే
మాఱన్ శడకోపన్ మెయి మవాదాన్ వాழியే
అన్నైయిలుమ్ అడైన్దవర్పాల్ అరుళుడైయోన్ వాழியే
అడైవుడనే వేదాన్తమ్ అఱిన్దురైత్తాన్ వాழியే
ఎన్నైయున్దన్ ఇన్నరుళాల్ ఎడుత్తళిత్తాన్ వాழியే
ఇరణ్డులకుమ్ తన్పుకళ్ యేత్తుమవన్ వాழியే
పన్నుకలై ఆర్వార్కళ్ పదముడైయోన్ వాழியే
పరవాది భయఙ్కరనార్ పడియిలెన్డుమ్ వాழியే.

శాశ్వతమైన కీర్తినికల మణవాళ మహామునులకు ప్రీతిపాత్రమైనవారు వర్ధిల్లుగాక ! లోకవిలక్షణమైన ప్రవర్తనను కల, శఠవాయువును కోపించిన నమ్మాళ్వార్ల సూక్తిని అనవరతము మననము చేయువారు వర్ధిల్లుగాక ! ఎల్లప్పుడూ తనను ఆశ్రయించినవారి విషయంలో కరుణను కలవారు వర్ధిల్లుగాక ! క్రమమైన రీతిలో వేదాంతశాస్త్రాన్ని అధ్యయనం చేసి, దానిని ప్రవచించువారు వర్ధిల్లుగాక ! నన్ను కూడా తమ దయతో స్వీకరించి, కాపాడినవారు వర్ధిల్లుగాక! లీలావిభూతి, నిత్యవిభూతులనే రెండులోకాలచే కీర్తింపబడేవారు వర్ధిల్లుగాక ! తత్త్వార్థములను విమర్శించి పల్కిన ఆళ్వార్ల శ్రీచరణాలను ఆశ్రయించినవారు వర్ధిల్లుగాక ! ప్రతివాది భయంకరం అణ్ణన్ ఈభూమిలో ఎల్లప్పుడు వర్ధిల్లుగాక !



పొందినవాడని, హంసరూపమును దాల్చి శబ్దరాశియగు వేదమును విభజించి, గ్రహించినవాడని, హయగ్రీవుడై అవతరించి వేదమును ప్రకాశింపచేసినవాడని, సూర్యమండలమును పొందినవాడని-ఇట్లు గోవిందశబ్దమునకు పలు విధములు అర్థములను చెప్పువారును కలరు. ముందు శ్లోకమున శ్రీరాముని నిద్రలేపుటచే ఇందు అతనికి పిమ్మట అవతరించిన శ్రీకృష్ణుని నిద్రలేపుచున్నారని పల్కుట యుక్తము.

ఆళ్వార్లు శ్రీవేంకటేశ్వరుని శ్రీకృష్ణునిగా వర్ణించిన సందర్భములు ముప్పది రెండుకు మించియుండగా, శ్రీరామునిగా వర్ణించిన సందర్భములు ఆఱేడు మాత్రము కలవు. అవతారక్రమమును అనుసరించుటకంటె ఆచార్యులకు ఆళ్వార్లను అనుసరించుట ముఖ్యమగుటచే గోవిందుని ముందుగా లేపి, దానికి పిమ్మట శ్రీరాముని నిద్రలేపుటయే క్రమమని తోచియుండవచ్చును. అయినను ఇచట ఏదోఒక పురాణశ్లోకముగా భావింపబడుచున్న 'ఉత్తిష్ఠోత్తిష్ఠ' అను శ్లోకముకంటె ఇతిహాసశ్రేష్ఠమగు శ్రీరామాయణము నందలి "కౌసల్యాసుప్రజా" అను శ్లోకము ఉన్నతమైనదగుటచే శ్లోకగౌరవమునందు మనస్సును నిలిపి, ఈరెండిటిలో ఉన్నతమైన "కౌసల్యా" అను శ్లోకముతో శ్రీరామునకు సుప్రభాతమును పల్కిరి అని అనదగును.

మఱియు, వరాహపురాణము మొదటిభాగములో 49వ అధ్యాయమునందు ఇంద్రుడు మొదలగు దేవతలు చతుర్ముఖుని పురస్కరించుకొని వేంకటేశ్వరుని స్తుతింపగా, స్వామి "మీరింక కొంచెముకూడ చింతింపకుడు. శీఘ్రమే రావణుని సమిత్రబాంధవముగా నేను వధింతును. ఇది సత్యము" అని పల్కినట్లు కలదు. కావున శ్రీవేంకటేశ్వరుడు, శ్రీరాముడు ఒక్కడే అనునది మిక్కిలి స్పష్టమగుటచేతను, దీనినిబట్టి చూచినచో వాల్మీకిముని తన శ్రీరామాయణములో వేటగానికి శాప మిచ్చినట్లు (2-15), శ్రీరామునకు మంగళాశాసనము చేయునట్లును కన్పించు "మానిషాద" అను శ్లోకమునందు "మానిషాద" అనుటకు "మా నిషీదతి అస్మిన్" అను వ్యుత్పత్తి మూలముగా 'శ్రీనివాసా' అని (అలర్మేల్ మజ్గైయుఱైమార్బా) అని శ్రీరాముని సంబోధించి, "మండోదరీ రావణులను రాక్షసద్వంద్వమును చేరి, అందు కామముచే మోహించిన పురుషుడగువానిని సంహరించి, లోకమును రక్షించుటచే నీవు చిరకాలము వర్ధిల్లుదువుగాక" అని మంగళాశాసనమును చేయుటచే శ్రీరాముని, శ్రీవేంకటేశ్వరుని ఒక్కరే అని తలచి సంబోధించియుండవచ్చునని తోచుటచే, అట్టి వాల్మీకిచే రచింపబడిన "కౌసల్యా" అను శ్లోకమునందు గౌరవమును తోచునట్లు ప్రతివాది భయంకరం అణ్ణన్ శ్రీకృష్ణుని నిద్రలేపు శ్లోకమునకు ముందుగా శ్రీరామునకు సుప్రభాతమును పాడు శ్లోకమును అనుసంధించిరి అని భావించుటలో విప్రతిపత్తి



ఏమియులేదు.

(ఉత్తిష్ఠ గరుడధ్వజ) - "ధ్వజః చిహ్నే పతాకాయామ్" అను హైమనిఘంటువునుబట్టి గరుడుని గుర్తుగా కలవాడని, గరుడుని ధ్వజమందు కలవాడని రెండు విధములైన అర్థములను గరుడధ్వజనామ మిచ్చును. గరుడశబ్దము "గరుద్భిః డయతే"-ఱెక్కలతో ఆకాశమున ఎగురుచున్నాడని, "సర్పాన్ గిరతి"-సర్పములను మింగువాడని రెండువిధములైన అర్థములను ఇచ్చుచు, గరుడునకు యోగరూఢ మగుచున్నది.

(కమలాకాంతః) "కాంతః" - అను పదము "కము-కాంతా, కన-దీప్తౌ" అను రెండు ధాతువులనుండి పుట్టి, క్రమముగా ఆశ, కాంతి అను రెండు అర్థముల నిచ్చును. అందుచే "కమలాయాః కాంత" అనునది పిరాట్టి విషయమున ప్రేమను కలవాడను అర్థమును, "కమలయా కాంతః" అనునది లక్ష్మీదేవిచే కాంతిని కల్గినవాడను అర్థమును తెలుపును.

మొదటిది స్వామి లక్ష్మీదేవియందు ప్రేమలేని భర్తకాడని, మిక్కిలి ప్రేమను కల్గిన భర్త అను అర్థమును ఇచ్చుటచే "ఉనక్కేఱ్కుమ్ కోలమలర్ప్పావైక్కన్బా" (నీకు సాటివచ్చే లక్ష్మీదేవికి వల్లభుడా!) అను నమ్మాళ్వార్ల సూక్తిని తలపింపచేయును. రెండవ వ్యుత్పత్తియందు తెలుపబడిన కాంతి దేహకాంతి అని, ఆత్మకాంతి అని రెండువిధములైనది. వీనిలో మొదటిది తన శరీరములోనున్న నీలవర్ణముతోపాటు లక్ష్మీదేవియొక్క బంగారు వన్నె కలయికను పొందినవాడను అర్థమిచ్చుటచే "నిన్ఱాడు కణమయిల్ పోల్ నిఱముడైయ నెడుమాల్" (నిలచి నాట్యం చేసే నెమలివర్ణం వంటి వర్ణాన్ని కల ఆశ్రితవ్యాముగ్ధుడు) అను ఆళ్వార్ల ప్రయోగమును గుర్తుకుతెచ్చి, నెమలికంఠముయొక్క రంగు వంటి రంగును కలవాడను భావమును తెలుపును. ఆత్మకాంతి అను రెండవ అర్థమగు తేజస్సు. శత్రువులను అణచునట్టి సామర్థ్యము. అట్టి సామర్థ్యము భగవానునకు లక్ష్మీసంబంధముచే ఏర్పడును. "అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా" (శ్రీరా-38-18) (ప్రసిద్ధిని పొందిన జానకి ఎవనికి చెందినదో ఆ శ్రీరాముని తేజస్సు ఎవరిచేతను పరిచ్ఛేదింప వీలుకానిది) అని లక్ష్మీదేవి చేరికచే శత్రువులను అణచు సామర్థ్యమును కలవాడు శ్రీరాముడు అని చెప్పబడుట గమనార్హము.

(త్రైలోక్యం మంగళం కురు) - "త్రయో లోకా ఏవ త్రైలోక్యమ్" - స్వార్థే ష్యఞ్ ప్రత్యయము చివర చేరుటచే సిద్ధించిన రూపమిది. లోకశబ్దము లోకములను, అందలి జనమును తెలుపును. "లోక స్తు భువనే జనే" అని అమరకోశ వచనము. కావున నీవు నిద్రలేచి ముల్లోకములను మంగళమును పొందునట్లు చేయవలయును-అని,

ఐశ్వర్యము, కైవల్యము, పరమపదము అను ఫలములను ఆశించు మూడువిధములకు చెందిన జనులను ఆ ఫలమునెడి శుభమును పొందిన వారినిగా చేయవలయునను అర్థము ఏర్పడును. మఱియు, నిద్రలేచుట కన్నులకు తెఱచి కటాక్షించుటకు ఉపలక్షణమై, "నిద్రలేవనగును, అందమైన ఆ రెండు నేత్రములతో కటాక్షింపవలయును, కటాక్షించి మాకు మంగళములను కల్గింపవలెను" - అను అర్థమును చెప్పనగును. అంతియేకాక, "లోక్యతే అనుభూయతే ఇతి లోకః" అను వ్యుత్పత్తిచే లోకశబ్దము అనుభవింపబడు ఫలమునకును వాచకమగుటచే, ఆయా అధికారులకు మంగళములగు ఐశ్వర్యము మొదలగు ఫలములను అనుగ్రహింపవలయునను అర్థమును చెప్పనగును.

(3) మాత స్సమస్తజగతాం మధుకైటభారేః
వక్షోవిహారిణి! మనోహరదివ్య(రూపే) మూర్తే।
శ్రీస్వామిని! శ్రితజనప్రియదానశీలే!
శ్రీవేంకటేశదయితే! తవ సుప్రభాతమ్ ॥

సమస్తజగతాం=అన్ని లోకములకు, మాతః = తల్లీ, మధుకైటభ +అరేః = మధుకైటభులను అసురులను ఇద్దఱిని సంహరించిన విష్ణువుయొక్క, వక్షః+విహారిణి వక్షః స్థలమందు విహరించుదానా!, మనోహరదివ్యమూర్తే=అందమైన, గొప్పరూపమును కల్గినదానా!, శ్రీస్వామిని=(మాకు) స్వామినీ!, శ్రితజనప్రియదానశీలే=శరణు పొందిన జనులకు (వారు) కోరిన ఫలమును ఇచ్చుటయే స్వభావముగా కల్గినదానా!, శ్రీవేంకటేశదయితే =శ్రీవేంకటేశ్వరునకు ప్రియమైనదానా!, తవ = నీకు, సుప్రభాతమ్= సుప్రభాతమగుగాక!

అందఱికి తల్లివై, విష్ణువు వక్షఃస్థలమునందు అందమైన రూపముతో వేంచేసియున్నదానివై, మా స్వామినివైన శ్రీవేంకటేశ్వరుని ప్రియపత్నీ!, నీ ప్రభువునకు సుప్రభాతము పాడుచుండగా, నీవు ముందుగా లెమ్ము.

అను:-ఈ శ్లోకమునుండి సుప్రభాతస్తోత్రము ప్రారంభమగుచున్నది.

(సమస్తజగతాం మాతః)-"త్వం మాతా సర్వలోకానాం దేవదేవో హరిః పితా" (వి.పు.1-9-126) (లోకములకన్నిటికిని నీవు తల్లివి, దేవతలకు ప్రభువగు హరి తండ్రి) - అనుచు ఇంద్రుడు లక్ష్మీదేవిని స్తుతించుట మొదలగు ప్రమాణములు స్మరణీయములు.

(మధుకైటభారేః వక్షోవిహారిణి) - భగవానుడు అనిరుద్ధుడై అవతరించి, మధుకైటభులను వధించెనని పెద్దలందురు. "దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా, పశ్యతాం సర్వలోకానాం యయౌ వక్షఃస్థలం హరేః" (వి.పు.1-9-105) (పాలసముద్రమునందు అవతరించిన శ్రీదేవి స్నానముచేసినదై, దివ్యములైన వస్త్రములను, మాలలను, ఆభరణములను అలంకరించుకొని, దేవతలందఱు చూచుచుండగా విష్ణువుయొక్క వక్షః స్థలమును చేరెను) అను సూక్తికి అనుగుణముగా "మధుకైటభారేః వక్షోవిహారిణి" అని పలుకబడినది. విహరించుట అనగా-దుఃఖము తీరి ఆనందమును అనుభవించుట.



(మనోహరదివ్యమూర్తే) భగవానుని మనస్సును కొల్లగొట్టు, అందమైన గొప్ప రూపమును కల్గినదానా! "మూర్ఛా - మోహసముచ్ఛ్రాయయోః" అను ధాతువునుండి పుట్టిన మూర్తి శబ్దము మోహమును కల్గించు గొప్ప రూపమును తెలుపును. దివ్యమనగా అప్రాకృతము. అనగా-ప్రకృతిమండలములోని పంచభూతములచేకాక, పరమపదములోనున్న పంచభూతములచే పిరాట్టి తిరుమేని నిర్మింపబడినదని భావము.
(శ్రీస్వామిని)-భగవానుడు శ్రీస్వామి; ఈమె శ్రీస్వామిని.

(శ్రితజనప్రియదానశీలే) - ప్రియశబ్దమునకు ఇష్టమైనవాడని, భర్త అని అర్థము. "అభీష్టే అభీప్సితమ్ హృద్యం దయితం వల్లభం ప్రియమ్" అని, "ధవః ప్రియః పతి ర్భర్తా" అనియు అమరము ఈ రెండర్థములను తెలిపినది. కావున ఇచట తనను శరణు చెందిన జనులకు ఇష్టమైన ఫలమును ఇచ్చుటను స్వభావముగా కల్గినదానా! అని, ఆశ్రితులకు తన భర్తను ఇచ్చుటను స్వభావముగా కల్గినదానా! అని రెండర్థములను చెప్పవచ్చును. రెండవ అర్థము తిరుప్పావై ప్రబంధములోని "ముప్పత్తు మూవర్" (20) అను పాశురములో "ఉక్కముమ్ తట్టొళియుమ్ ఉన్ మణాళనైయుమ్ తన్దు ఇప్పోదే ఎమ్మై నీరాట్టు" (విసనకర్రను, అద్దాన్ని, నీ పెనిమిటిని ఇచ్చి ఇపుడే మమ్ములను నీరాడించు) అని అన్వయించి, ఆచార్యులు అనుగ్రహించిన అర్థమునకు అనుగుణము.

(శ్రీవేంకటేశదయితే)- పాపమును పోగొట్టు స్వభావమును కల్గియుండుటచే, తిరుమలకు, శ్రీనివాసునకు వేంకటశబ్దము అన్వయించును. కావున ఈ పదము శ్రీవేంకటాచలమునకు ప్రభువు అని, శ్రీవేంకటేశ్వరుడను ప్రభువని అర్థమిచ్చును. అట్టి ప్రభువునకు ప్రియమైనదానా! అని పై సూక్తి భావము. "ప్రభాతమ్" అనగా రాత్రి తొలగి పొద్దు పొడుచుకాలము. "సుప్రభాత" మనగా మంచి ప్రభాతము. మంగళకరమైన ఉదయమని అర్థము.

(4) తవ సుప్రభాత మరవిందలోచనే!
భవతు ప్రసన్నముఖచంద్రమండలే ।
విధిశంకరేంద్రవనితాభి రర్చితే!
వృషశైలనాథదయితే! దయానిధే ॥

అరవిందలోచనే = తామరపూలవంటి కన్నులను కల్గినదానా!, ప్రసన్నముఖచంద్రమండలే

= చంద్రమండలమువంటిదైన, ప్రసన్నమైన ముఖమును కల్గినదానా!, విధిశంకర + ఇంద్రవనితాభిః = బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలగువారి భార్యలగు సరస్వతి, పార్వతి, శచీదేవి మొదలగువారిచే, అర్చితే = ఆరాధింపబడినదానా!, దయానిధే = దయకు నిధివంటిదానా!, (జన్మస్థానమా!), వృషశైలనాథదయితే = శ్రీవేంకటేశ్వరునకు ప్రియమైనదానా!, తవ = నీకు, సుప్రభాతమ్ = సుప్రభాతమగుగాక!

తామరపూలవంటి కన్నులతో, చంద్రునివంటి ముఖముతో శ్రీవేంకటేశ్వరుని ఆనందింపచేసి, సరస్వతి-పార్వతి-శచీదేవి మొదలగు దేవతాస్త్రీలచే పూజింపబడి, మాపట్ల మిక్కిలి దయను కల శ్రీమహాలక్ష్మీ! నీకిది సుప్రభాతమగుగాక!

(అరవిందలోచనే)-సహజముగా అందమైన తల్లియొక్క కన్నులు బిడ్డను చూచిన సంతోషముచే తామరలవలె వికసించి, ఎఱ్ఱనివైనవని తాత్పర్యము.

(ప్రసన్నముఖచంద్రమండలే)-చంద్రమండలము ముఖమునకు ఆహ్లాదకరత్వములో మాత్రమే ఉపమానము. ప్రసాదగుణమునందు కాదు. ఎల్లప్పుడు కళంకముతోనుండు చంద్రునియందు స్వచ్ఛత అను ప్రసాదగుణము ఏనాటికిని సంభవింపలేనిదేకదా!

(విధిశంకరేంద్రవనితాభిః అర్చితే) - "దాసీభూతసమస్తదేవవనితామ్" (లక్ష్మ్యష్టోత్తరమ్) - (పరిచారికలుగా దేవతాస్త్రీలను అందఱికిని కల్గినదానా! నీకు నమస్కరింతును) అను సూక్తిని ఇచట గమనింపనగును. "బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయితః త్వద్దాసదాసీగణః" (చతుఃశ్లోకీ) - (బ్రహ్మ, శివుడు మొదలగు దేవగణములు, వారి దేవేరులును నీకు సేవకులు, సేవికలును) అను శ్రీయామునుల సూక్తియు స్మరణీయము.

(వృషశైలనాథదయితే)- "దయితా -చిత్తమ్ ఆదత్తే" -మనస్సును కొల్లగొట్టునది అను అర్థ మిచ్చు దయితా శబ్దము అందమైన పత్నిని తెలుపును.

(దయానిధే)-దయకు నిధియైనదానా! ఈమె చేయు పురుషకారమువలననే స్వామి యొక్క స్వాతంత్ర్యము అణగి, దయతల ఎత్తును. అతని దయయు ఈమె దయాగణముచే సఫలమగుటనుబట్టి ఈమెను దయానిధి అని పల్కుటలో విప్రతిపత్తి లేదు.

(5) అత్ర్యాదిసప్తఋషయ స్సముపాస్య సంధ్యా -
మాకాశసింధుకమలాని మనోహరాణి ।
ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రపన్నాః



శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

అత్రి + ఆది సప్తఋషయః = అత్రి మొదలగు సప్త ఋషులు, సంధ్యామ్ సముపాస్య = సంధ్యావందనమును చేసి, మనోహరాణి = మనస్సును అపహరించు, ఆకాశసింధు కమలాని = ఆకాశ గంగలోని తామరపూలను, ఆదాయ = తీసికొని వచ్చి, పాదయుగం= నీ పాదములు రెండిటిని, అర్చయితుం = పూజించుటకు, ప్రపన్నాః = వచ్చి, చేరిరి, శేషాద్రిశేఖరవిభో = ఆదిశేషపర్వతమునకు అధిపతియగు స్వామీ, తవ సుప్రభాతమ్= నీకు సుప్రభాతమగుగాక!

శ్రీవేంకటేశ్వరా!, అత్రి మొదలగు సప్తర్షులు కాలకృత్యములను తీర్చుకొని, నిన్ను సేవించుటకై, ఆకాశగంగలోని తామరపూలను గొని నీవద్దకు వచ్చి చేరిరి. నీవు మేల్కొనవలెను.

సప్తఋషులు - మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు-అని కొందఱు అందురు. వసిష్ఠ-కాశ్యప-అత్రి-జమదగ్ని-గౌతమ- విశ్వామిత్ర. భరద్వాజులు అని విష్ణుపురాణము తెలుపుచున్నది.

సంధ్య అనునది పూర్వసంధ్యకు, అపుడు జపింపవలసిన గాయత్రికి, అష్టాక్షరి మొదలగు మంత్రములకును, వానిచే ప్రతిపాదింపబడుచున్న భగవానునకు వాచకము. కావున "సంధ్యామ్ సముపాస్య" అనుటకు ప్రాతఃకాలమున జపింపతగిన మంత్రములను జపించి, వానిచే ప్రతిపాదింపబడు నిన్ను ధ్యానించి - అని తాత్పర్యము.

"కమలాని ఆదాయ పాదయుగమ్ అర్చయితుమ్" అనుచు పూవులను కోయుటకు, అర్చనను చేయుటకు ఋషులే కర్తలుగా తెలుపబడుటచే ఈ మునులు అర్చకమూలముగాకాక, భగవానుని పాదములందు స్వయముగా అర్చనను చేయు సంబంధమును కలవారనుట తెలియుచున్నది.

(శేషాద్రిశేఖరవిభో) - శేషాద్రి అనగా - ఆదిశేషుని రూపములోనున్న కొండ. శేఖర మనగా- శిరోభూషణము. "విభుః ప్రభౌ సర్వగతే" అను మేదినీనిఘంటు వచనమునుబట్టి శక్తిని కలవాడు, అంతట వ్యాపించియున్నవాడను రెండర్థములును భగవానుని యుందు పొసగును.

(6) పంచాననాబ్జభవషణ్ముఖవాసవాద్యాః
త్రైవిక్రమాదిచరితం విబుధా స్తువంతి ।

భాషాపతిః పఠతి వాసరశుద్ధి మారాత్
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

పంచానన + అబ్జభవ షణ్ముఖ వాసవ+ ఆద్యాః = శివుడు, బ్రహ్మ, షణ్ముఖుడు, ఇంద్రుడు మొదలగు, విబుధాః = దేవతలు, త్రైవిక్రమ + ఆది చరితమ్ = మూడు అడుగులతో లోకమును కొలుచుట మొదలగు నీ చరిత్రలను, స్తువంతి = స్తుతించుచున్నారు, భాషాపతిః = బృహస్పతి, ఆరాత్ = సమీపమున, వాసరశుద్ధిం = తిథి, వారము నక్షత్రము యోగము, కరణము మొదలగు) దినశుద్ధిని, పఠతి = పఠించుచున్నాడు, శేషాద్రిశేఖరవిభో = శ్రీవేంకటేశ్వరా, తవ సుప్రభాతమ్ = నీకు సుప్రభాతము.

శ్రీవేంకటేశ్వరా! బ్రహ్మ మొదలగు గొప్ప దేవతలు నీ త్రివిక్రమావతారాది వీర చరితములను కీర్తించుచు నిలుచున్నారు. బృహస్పతి పంచాంగమును పఠించుచున్నాడు. నీకు సుప్రభాతమగుగాక!

(పంచాననః) - అయిదు తలలను కలవాడు శివుడు. (అబ్జభవః) - భగవానుని నాభీకమలమునుండి పుట్టిన బ్రహ్మ. (షణ్ముఖః)-ఆర్గురు కృత్తికల స్తన్యమును ఒకేసారి త్రాగుటకు వీలుగా ఆఱు ముఖములను కల్గిన సుబ్రహ్మణ్యుడు.
(వాసవః)-అష్టవసువులకు నాయకుడైన ఇంద్రుడు.

(త్రైవిక్రమ+ఆదిచరితమ్) - భగవానుని చరిత్రలలో త్రివిక్రమునిగా మూడు పాదములతో లోకమును కొలిచిన చరిత్రము మిక్కిలి గొప్పది అగుటచే దానిని ముఖ్యముగా గ్రహించి, మిగిలినవానిని ఆది శబ్దముచే సూచింపచేసిరి.

(విబుధాః) "విశేషేణ బుధ్యంతే ఇతి విబుధాః"-మనకంటె ఎక్కువగా బాగుగా గ్రహించువారు కావున ఈ పదము దేవతలకు యోగరూఢము.

(భాషాపతిః) - వాక్పతియగు బృహస్పతి-అని అర్థము. ఈ పదము సరస్వతీదేవికి ప్రభువగు బ్రహ్మనుకూడ తెలుపునదైనను పంచాగమును పఠించుట పురోహితుని కృత్యమగుటచే ఇచట దేవపురోహితుడగు బృహస్పతిని తెలుపును. శ్రీరంగమున ఈనాటికిని పంచాంగమును పఠించువారు శ్రీరంగేశపురోహితులగు భట్టర్ వంశీయులే అగుట స్మరింపతగినది. వేంకటాచలముపై ఇప్పటికిని ఉదయమున తోమాలసేవకు, అర్చనకు నడుమ జరుగు పంచాంగపఠనము శ్రీరంగములోవలె ఉదయమున విశ్వరూపసేవ సమయమునకు ముందు జరుగుచుండుటను ఈ శ్లోకమునుబట్టి గ్రహింపవచ్చును.



(వాసరశుద్ధిమ్) దినముయొక్క మంచిసమయము. ఇది విడువదగిన సమయములగు వర్జ్యము మొదలగునవికూడ పఠింపబడుటచే అశుద్ధికిని ఉపలక్షణము.

(7) ఈషత్ప్రఫుల్లసరసీరుహనారికేళ -
పూగద్రుమాదిసుమనోహరపాలికానామ్ ।
అవాతి మంద మనిల స్సహ దివ్యగంధైః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

ఈషత్ ప్రఫుల్ల సరసీరుహ = కొంచెముగా వికసించిన తామరపూవులయొక్క, నారికేళ పూగద్రుమ + ఆది = కొబ్బరి, పోక మొదలగు వృక్షములయొక్క, సుమనోహర పాలికానామ్ = అందమైన గుత్తులయొక్క, దివ్యగంధైః సహ = గొప్ప సువాసనలతో కూడినదై, అనిలః = వాయువు, మందం = మెల్లగా, ఆవాతి = వీచుచున్నది, శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్ = శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

శ్రీవేంకటేశ్వరా! ఉదయకాలమారుతము తామరపూలనుండి నారికేళ-పోక మొదలగు వృక్షములనుండి సుగంధమును గ్రహించి, వీచుచున్నది.నీకు సుప్రభాతమగుగాక!

(పాలికా)-గెల (గుత్తి). ఈ పదము ఈ అర్థమున ప్రస్తుతము నిఘంటువులలో కన్పించుటలేదు. ఈ శబ్దమునకు ఇచట ఇదియే అర్థమనుటను - "పైమ్బొళిక్కుముకిన్ మడలిడైక్కీఱి వణ్పాళైకళ్ నాఱ వైకఱై కూర్న్దదు మారుద మిదువో" (ఈ ప్రాతః కాలంలోని ఈ వాయువు పచ్చదనాన్ని కల తోటలలోని పోకచెట్లయొక్క మట్టలను గీఱినందువల్ల అందమైన లేతమట్టల సువాసనలను వీస్తున్నది.) అను విప్రనారాయణ సూరి తిరుప్పళ్లియెళుచ్చి ప్రబంధములో పల్కుటచే తెలియనగును. కొందఱు పాలికవలె ఉండుటచే గుత్తిని "పాలికగా చెప్పవచ్చును. ఎట్లనగా - పోక మొదలగు వృక్షముల గుత్తులు వివాహసందర్భములలో నవధాన్యములను మట్టిపాత్రలలో ఉంచి, పిమ్మట అవి మొలకెత్తినపుడున్న సన్నివేశమువలె నుండుటచే "- అని అందురు.

బాగుగా వికసించినచో పూల సువాసన పోవును. కావున "ఈషత్ ప్రఫుల్ల" అని పల్కిరి. తిరుమలగిరిపైనున్న వృక్షములు, లతలు, అన్నియు అప్రాకృతములని పురాణములు తెలుపుచుండుటచే వాని గంధము ప్రాకృతగంధము కాదు. కావున "దివ్యగంధ" శబ్దప్రయోగము సార్థకము.

(8) ఉన్మీల్య నేత్రయుగ ముత్తమపంజరస్థాః
పాత్రావశిష్టకదళీఫలపాయసాని ।
భుక్త్వా సలీల మథ కేళిశుకాః పఠంతి

శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

ఉత్తమపంజరస్థాః = గొప్ప గూళ్లలోనున్న, కేళిశుకాః = విలాసార్థమై పోషింపబడు చిలుకలు, నేత్రయుగమ్ = రెండు నేత్రములను, ఉన్మీల్య = తెఱచి, పాత్ర+అవశిష్ట = (నీవు ఆరగింపగా) పాత్రలలో మిగిలిన, కదళీఫలపాయసాని = అరటిపండ్లను, పాయసమును, భుక్త్వా = భుజించి, అథ = పిమ్మట, సలీలం = విలాసముగా, పఠంతి = పల్కుచున్నవి. శేషాద్రిశేఖరవిభో=శ్రీవేంకటేశ్వరా!, తవ = నీకు, సుప్రభాతమ్ = సుప్రభాతమగుగాక!

శ్రీవేంకటేశ్వరా! నీ కోవెలలో పోషింపబడు లీలాశుకములు నీవు రాత్రి ఆరగింపగా మిగిలిన అరటిపండ్లను, పాయసమును గ్రహించి, నీ నామసంకీర్తనము చేయుచున్నవి. నీకు సుప్రభాతమగు గాక !

(ఉత్తమపంజరమ్) - ఉన్నతమైన గూడు. ఇచటి ఔన్నత్యమేమనగా బంగారు తీగలతో అల్లబడి, మణులు పొదగబడి, మనోహరముగా నుండుటయే.

(శుకాః పఠంతి)-చిలుకలు పల్కుచున్నవి, దేనిని అనగా - తిరునామములను అను పదమును ఇచట అధ్యాహారము చేసికొనతగును. "కూట్టిలిరున్దు కిళి ఎప్పోదుమ్ కోవిన్దా కోవిన్దా ఎన్ఱైక్కుమ్" (గూటిలో నుండి చిలుక ఎల్లప్పుడూ గోవిందా! గోవిందా! అని పిలుస్తుంది) (నాయ్చ్చియార్‌తిరుమొళి-12-9) అని గోదాదేవి పల్కెను కదా! చిలుక పంజరములు బంగారు తీగలతో అల్లబడి, మణులు పొదగబడియుండునా? ఏమి? అనినచో, "అలర్‌మేల్‌మఙ్గై యుఱైమార్బన్" (తిరువాయ్-6-10-10) (లక్ష్మీవల్లభుడు) అని, "తిరువేఙ్గడత్తుఱై శెల్వన్" (పెరియ తిరు-1-8-10) (వేంకటాద్రిలోని శ్రీమంతుడు) అని ఆళ్వార్ల మంగళాశాసనమును పొందిన తరువాత శ్రీనివాసునకు లేని సంపదలేదు కదా!

శ్రీరంగమునగల కిళి మండపము (చిలుకల మండపము) వలె తిరుమల యందును ఒక చిలుకల మండపము ఉండి, శ్రీరంగములోని చిలుకలు "రంగా రంగా, శ్రీరంగా" అని పల్కునట్లే, ఇచటి చిలుకలు "గోవిందా! గోవిందా!" అని పిలుచుచుండెను కాబోలు!

(పాయసమ్)-పాలు చేర్చిన అన్నము కాదు; పాలలో పక్వమైన అన్నము. "పయసి సంస్కృతమ్ పాయసమ్" అను వివరణమునుబట్టి పాలను నీరుగా వాడి పండిన (పూర్తిగా పాలతో వండిన) క్షీరాన్నమని భావము ఏర్పడును. సహజముగా తీయగా పల్కు చిలుకలు పాయసము భుజించినచో పాడునా? అని అడుగవలెనా? చెప్పవలెనా?



శ్లోకమున "కేళిశుకాః తవ సుప్రభాతమ్ పఠంతి"-చిలుకలు నీకు సుప్రభాతమును పల్కుచున్నవి - అని అన్వయించి అర్థమును చెప్పుట మిక్కిలి సరసము.

(9) తంత్రీప్రకర్షమధురస్వనయా విపంచ్యా
గాయత్యనంతచరితం తవ నారదో-పి ।
భాషాసమగ్ర మసకృత్కరచారరమ్యం
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

నారదః అపి = నారదుడును, భాషాసమగ్రమ్ = సంస్కృతభాషామయమైన, తవ అనంతచరితమ్ = నీ అంతులేని వీరచరిత్రను, తంత్రీప్రకర్ష = తీగల బిగువుచే, మధురస్వనయా = తీయని ధ్వనినికల, విపంచ్యా = ఏడు తీగలతో కూడిన వీణతో, అసకృత్‌కరచారరమ్యమ్ = మాటిమాటికి చేతులతో తంత్రులను తడవుటద్వారా అందముగా నుండునట్లు, గాయతి = పాడుచున్నాడు, శేషాద్రిశేఖరవిభో = శ్రీవేంకటేశ్వరా!, తవ = నీకు, సుప్రభాతమ్ = సుప్రభాతము.

నారదముని తన వీణను చేతితో మాటిమాటికి తడవుచు, మీటుచు, నీ అనంతము లైన వీరచరిత్రలను పాడుచున్నాడు. శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతమగుగాక!

"తుమ్బురునారదర్ పుకున్దనరివరో" (తుంబురుడు, నారదుడు వీరే వచ్చారు.) అను తొణ్డరడిప్పొడి యాళ్వార్ల సూక్తియొక్క వివరణమే ఈ శ్లోకము. "కల్వి వాయుమే" (తిరువాయ్1-10-11) (విద్య కైంకర్యమను ఫలమును ఇచ్చును) అనునట్లు విద్యకు ఫలము భగవత్‌కైంకర్యమగుటచే నారదభగవానుడు తన సంగీతసాహిత్యజ్ఞానమును, వీణావాదనకౌశలమును భగవత్కైంకర్యమునకు ఉపయోగపడవలయునని తలచి, సంస్కృతభాషామయములైన భగవత్కీర్తనలను వీణతో వాయించుచు పాడుచున్నాడు. సంగీతవిద్వాంసులు తమ సామర్థ్యమును చూపి ప్రభువులవద్ద బహుమతిని పొందునట్లు బహుమతిని సంపాదించుటకొఱకై నారదుడు ఈ గానమును చేయుట లేదు. సహజముగానే అతడు అట్టి ఆశను లేనివాడగుటచే సకలకళావల్లభుడగు శ్రీవేంకటేశ్వరుని వద్ద తన శక్తిసామర్థ్యములను ప్రదర్శింపడు. కావున అట్లనుట పొసగదు. "మదుశూదనన్ వాయిల్ కుళలినోశై శెవియై ప్పట్రి వాఙ్గ నన్నరమ్బుడైయ తుమ్బురునోడు నారదనుమ్ తన్దమ్ వీణై మఱన్దు" (పెరియాళ్వార్ తిరుమొళి-3-6-5) (శ్రీకృష్ణుని వేణుగానం తమ చెవులకు సోకగా మంచి తీగలను కల వీణలను కల్గిన తుంబురుడు, నారదుడు తమ వీణలను మఱచిపోయారు) అనునట్లు వీరు పడిన పాట్లను దివ్యసూరుల

సూక్తులవలన తెలియవచ్చును.

వీణల తంత్రులను బిగువుగా కట్టనిచో అపస్వరము పలుకును. కావున "ప్రకర్ష" అని అనిరి. "నారం ద్యతి"-మానవుల అజ్ఞానమును ఖండించును. "నారం దదాతి"-జ్ఞానమును ఇచ్చును ఈ రెండు నారదశబ్దమునకు వ్యుత్పత్తులు. శ్రీమన్నారాయణుని కీర్తించుచు, అంతట సంచరించుచు, ఆ స్వామి యొక్క వైభవమును గూర్చిన అజ్ఞానమును పోగొట్టి, జ్ఞానమును కల్గించువాడగుటచే నారదుడను పేరు వీరికి యోగరూఢము.

(10) భృంగావలీ చ మకరందరసానువిద్ధ-
ఝుంకారగీతనినదైః సహ సేవనాయ ।
నిర్యాత్యుపాంతసరసీకమలోదరేభ్యః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

భృంగ+ఆవళీ చ=తుమ్మెదల వరుసలు, మకరందరస+అనువిద్ధ=తేనెను ఆస్వాదించుట వలన కల్గిన ఆనందముతో కూడిన, ఝుంకారగీతనినదైః సహ =ఝుంకారమను పాటల శబ్దములతోకూడ, ఉపాంతసరసీ=సమీపములోని సరస్సులలో కల, కమల+ఉదరేభ్యః = తామరపూవుల అంతర్భాగములనుండి, సేవనాయ=నిన్ను సేవించుటకై, నిర్యాంతి= వెలువడుచున్నవి, శేషాద్రిశేఖరవిభో=శ్రీవేంకటేశ్వరా!, తవ= నీకు, సుప్రభాతమ్= సుప్రభాతము.

వేంకటేశ్వరా! సమీపములోని సరస్సులలో పూచిన తామరపూలలోని మకరందమును తాగి ఆనందము అతిశయించిన తుమ్మెదలు ఝుంకార ధ్వనులను చేయునవియై నిన్ను సేవింపవలెనని వరుసలుగా ఆ పూలనుండి బయటకు వచ్చుచున్నవి. నీకు సుప్రభాతమగుగాక.

తుమ్మెదలు తటాకములలోని తామరపూలలోగల మకరందమును తాగి, అంతకంటె ఉత్కృష్టమైన తేనె అగు శ్రీవేంకటేశ్వరుని కన్నులతో పానము చేయుటకొఱకు నారదమహర్షి వలె కీర్తించుచు వచ్చుచున్నవి. భృంగములకు భగవానుని గూర్చిన జ్ఞానము ఉన్నదా? అని అడుగవలసినపనిలేదు. వేంకటాచలమును చేరిన మాత్రముననే తిర్యక్కులకును జ్ఞానోదయ మగును. "వైప్పన్ మణి విళక్కా మామతియై మాలుక్కైన్టై ప్పాళుదుమ్ కైనీట్టుమ్ యానైయై" (నాన్ముకన్ తిరువన్దాది-46) (వేంకటేశ్వరునకు మణిదీపంగా నిలువు) అనుచు తిరుమళిశై య్యాళ్వార్లు పల్కిరికదా!



ఇక, స్వాపదేశార్థమునకు వచ్చినచో. "శేమ ముడై నారదర్ మునివాహనర్ తమ్బిరాన్మార్ పోల్వార్ వణ్డు తుమ్బి యెన్నుమ్" అని (నారదుడు, మునివాహన సూరి, తంబిరాన్మార్ల వంటి గాన కైంకర్యాన్ని చేసేవారు తుమ్మెదలుగా రూపింపబడ్డారు) (ఆచార్యహృదయమున) సూక్తి చొప్పున తుమ్మెదలు అనుచు ముందు శ్లోకమున తెలుపబడిన నారదులవలె సారగ్రాహులై, తమకు ప్రక్కన నిలచియున్న ఆచార్యులగు మణవాళ మహామునులు మొదలగు మహాత్ములను సూచించునని, "మకరంద" ఇత్యాదిగా వారు తమ మనస్సులో ఊటిన తేనె అగు స్వామిని ముందునాటి రాత్రి మొదలుకొని ప్రభాతమువరకు అనుభవించిన ఆనందముతో కూడిన ఝుంకార ధ్వనులవంటి "హరి హరి" అను గీతములను పాడుకొనుటను తెలుపునని చెప్పనగును. అట్లే, "ఉపాంత సరసీకమలోదరేభ్యః" అనుటచే ప్రక్కనగల స్వామి పుష్కరిణి మొదలగు సరస్సులలోని తీర్థముల మధ్యభాగమును సూచించి, "సేవనమ్" అనుచు "తేనే! తిరువేఙ్గడమామలై మేయ కోనే" (తేనెవలె మధురమైనవాడా! శ్రీవేంకటాచలంలో నివసించే స్వామీ!) (పెరియతిరువన్దాది-1-10-7) అనునట్లు బయట కనుపించు వేంకటేశ్వరుడను మకరందమును గ్రోలుటను తెలిపి, "దాసుడనగు నాయొక్క ఆచార్యులగు మణవాళ మహామునులవంటివారు ఇంతవరకు అంతర్యామి రూపమును అనుభవించి, కీర్తించుచు, బయలుదేరి, సరస్సులలో స్నానము చేసి, అచటినుండి నిన్ను సేవించుటకు వేంచేయుచున్నారు-అను అర్థమును చెప్పుట పొసగును. ఈ అర్థమున కమలశబ్దము "సలిలమ్ కమలమ్ జలమ్" అను అమరకోశవచనానుసారము నీరు అను అర్థము నిచ్చును.

(11) యోషాగణేన వరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధిమంథనతీవ్రఘోషాః ।
రోషాత్ కలిం విదధతే కకుభ శ్చ కుంభాః
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

ఘోష+ఆలయేషు=గొల్లపల్లెలోని ఇండ్లలో, యోషాగణేన=స్త్రీల సమూహముచే, వరదధ్ని = గొప్ప పెరుగు, విమథ్యమానే=చిలుకబడినపుడు, దధిమంథన తీవ్రఘోషాః=పెరుగును చిలుకుటచే పుట్టిన గొప్ప ధ్వనిని కల, కుంభాః=పెరుగు కుండలు, కకుభః చ=దిక్కులును, రోషాత్=రోషమువలన, కలిం=తగవును, విదధతే=చేయుచున్నవి (కాబోలు అనునట్లున్నవి) శేషాద్రిశేఖరవిభో=వేంకటేశ్వరా, తవ=నీకు, సుప్రభాతమ్=సుప్రభాతము.

గోపికలు తమ ఇండ్లలో పెరుగును చిలుకునపుడు పుట్టిన గొప్ప ధ్వని దిక్కులన్నిటియందు వ్యాపించినది. ఆ ధ్వని పెరుగు కుండలు, దిక్కులును ఒకదానితో వేఱొకటి కోపముతో వాక్స్పర్ధను చేయునట్లు తోచుచున్నది. వేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

అను:- ఈ శ్లోకము "వాశనఱుఙ్కుళలాయ్చ్చియర్ మత్తినాలోశైపడుత్త తయిరరవమ్" (సువాసనను కల కేశాలను కల్గిన గోపికలు కవ్వంతో చిలికినపుడు వచ్చే పెరుగు ధ్వనిని) (తిరుప్పావై-7) అను గోదాదేవి సూక్తిని "ఉద్గాయతీనా మరవిందలోచనే" (శ్రీభాగ-10-46-47) అను శ్లోకమును అనుసరించి రచింపబడినది. పెరుగును చిలుకు ధ్వని పెరుగు కుండలనుండి పుట్టి, దిక్కులయందు ప్రతిధ్వనించి, ఈ విధముగా రెండును ఒకదానితో వేఱొకటి స్పర్ధించుట-భల్లుడు, భల్లాక్షుడు అను రెండు హంసలు వాదించుకొనుచు జానశ్రుతికి వేదాంతజ్ఞానమును కల్గించినట్లు పైలోకములోనుండు ఇంద్రాదిదేవతలకు జ్ఞాన ప్రదమగుచున్నది. అనగా-పరమపదనాథుడు వేంకటేశ్వరుడుగా అవతరించి, అతని వాత్సల్యాదిగుణములను అధికాధికముగా ఇచట అందఱును అనుభవించుచుండగా, మీరు మాత్రము పైన నుండుట ఎందులకు? త్వరగా వచ్చి, అనుభవించుడు-అని జ్ఞానోపదేశమును చేయుచున్నదని తాత్పర్యము. ఈ అర్థము శ్లోకములోని చకారమును "విదధతే" అనుపదముతో కలిపి, ఇచట అనుక్తమైన, జ్ఞానమును కల్గించుట అను క్రియను సముచ్చీకరించుచున్నదను భావముతో చెప్పబడినది.

(12) పద్మేశమిత్రశతపత్రగతాళివర్గాః
హర్తుం శ్రియం కువలయస్య నిజాంగలక్ష్మ్యా ।
భేరీనినాద మివ బిభ్రతి తీవ్రనాదం
శేషాద్రిశేఖరవిభో! తవ సుప్రభాతమ్ ॥

పద్మేశమిత్ర=సూర్యునితో స్నేహమునుకల, శతపత్రగత=తామరపూవును పొందిన, అళివర్గాః=తుమ్మెదల సమూహములు, నిజ+అంగలక్ష్మ్యా=తమ మేని శోభతో, కువలయస్య కలువలయొక్క, శ్రియం= శోభను, హర్తుం=పోగొట్టుటకు, భేరీనినాదమ్ ఇవ=భేరి అను వాద్యము యొక్క మ్రోత అనునట్లు, తీవ్రనాదమ్=గొప్ప ధ్వనిని, బిభ్రతి=వహించుచున్నవి, శేషాద్రిశేఖరవిభో=వేంకటేశ్వరస్వామీ!, తవ=నీకు, సుప్రభాతమ్=సుప్రభాతమగుగాక!

శ్రీవేంకటేశ్వరా! తుమ్మెదలు, తమ నల్లని మేని సొగసుతో కలువల నల్లదనములోని అందమును జయించుటకొఱకు చేయబడు గొప్ప ధ్వనియా ఇది! అనునట్లు ఝంకారములను చేయుచున్నవి. నీకు సుప్రభాతమగుగాక!



"పద్మేశమిత్ర" అను తామరపూవుయొక్క విశేషణము, సూర్యునకు స్నేహితుడగు, లేక సూర్యుని స్నేహితునిగా కల-అను అర్థములను ఇచ్చుచు, సూర్యునిచే వికసింపజేయబడిన-అను అర్థమును స్ఫురింపజేయును. పొద్దు పొడిచినది-అని తెలుపుట దీని ఉద్దేశ్యము. శతపత్రమనగా నూఱు రేకులనుకల ఒకజాతి తామరపూవు. సహస్రపత్రమనెడి వేయిరేకులనుకల తామరపూవుకూడ కలదు. సహజమైన తుమ్మెద ఝంకారము యుద్ధభేరినినాదముగా ఉత్ప్రేక్షింపబడుచున్నది. తుమ్మెదలు తమ సేన అనెడి తమ మేని శోభతో కువలయముయొక్క సేన అగు దానిమేని అందమును, ఝంకారము అను భేరీనాదమును చేసి జయించుచున్నది-అని తాత్పర్యము.

(13) శ్రీమన్నభీష్టవరదాఖిలలోకబంధో !
శ్రీ శ్రీనివాస! జగదేకదయైకసింధో ।
శ్రీదేవతాగృహభుజాంతరదివ్యమూర్తే !
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

శ్రీమన్=ఎల్లప్పుడు సంపదను కలవాడా! (సంపద మాఱనివాడా!) అభీష్టవరద=కోఱిన వరములను ఇచ్చువాడా!, అఖిలలోకబంధో=లోకులకందఱకు అన్ని విధములైన బంధువుగా అయినవాడా! శ్రీశ్రీనివాస=అందమైన శ్రీనివాసా!, జగత్ ఏక=లోకములో సాటిలేని, దయా+ఏకసింధో=కరుణకు అద్వితీయ సముద్రమైనవాడా! శ్రీదేవతా గృహభుజాంతర =లక్ష్మీదేవి అనెడి దేవతకు నివసించు గృహముగా వక్షఃస్థలమును కలవాడా!, దివ్యమూర్తే =అందమైన తిరుమేనిని కలవాడా!, శ్రీవేంకటాచలపతే= శ్రీవేంకటాచలమునకు ప్రభూ!, తవ సుప్రభాతమ్=నీకు సుప్రభాతమగుగాక!

సంపదను కలవాడవై, సర్వవిధబంధువై, దయాపూర్ణుడవై, మాకు తల్లి అగు లక్ష్మీదేవిని వక్షఃస్థలమున కలవాడవై, ప్రకాశించుమూర్తిని కలవాడవై, అడిగిన వరములను అన్నిటిని ఇచ్చువాడవై, వేంకటాచలమున వేంచేసియున్న స్వామీ! శ్రీనివాసా! నీకు సుప్రభాతము.

(శ్రీమన్) ఇచటి సంపద్వాచకమగు శ్రీశబ్దము నిత్యవిభూతి, లీలావిభూతి-అను సంపదలను రెండింటిని తెల్పును. దీనిచే అభీష్టవరదుడు స్వామి అనుటకు తగిన హేతువు సూచింపబడినది. సందపను నిండుగా కలవాడేకదా అడిగిన వరములను అన్నిటిని ఇవ్వగలడు. "శ్రీశ్రీనివాస" అనునది వేంకటేశ్వరుని నామము. లక్ష్మీదేవికి నివాసస్థానమైన వాడని దాని భావము. ఎట్లు నివాసమగుచున్నాడు? అను ప్రశ్నకు "శ్రీదేవతాగృహ భుజాంతర" అను విశేషణము సమాధాన మిచ్చుచున్నది. లక్ష్మీదేవికి తన వక్షఃస్థలములో స్థానము నిచ్చి, తన్మూలమున ఆమెకు నివాస స్థానమగుచున్నాడని భావము. ఇంతకు ముందే భగవానునియందున్న దయ వక్షఃస్థలవాసిని అగు లక్ష్మిచే

వృద్ధి పొందింప బడుటచే, స్వామి దయకు సాటిలేని సముద్రమువంటివాడు అగుచున్నాడు-అను భావము "జగదేకదయైకసింధో!" అను ప్రయోగముద్వారా వ్యక్తము. భగవానుడు దివ్యమూర్తిని కలవాడగుటయును లక్ష్మివలననే. భగవానుని నల్లని తిరుమేని హిరణ్యవర్ణయగు లక్ష్మీదేవి తిరుమేని సంబంధముచే తళతళమని మెఱయుచుండుటచే, అందమైన పరభాగశోభను కల రూపమును కలవాడగుచున్నాడు. పరభాగ మనగా -విభిన్న వర్ణసమ్మేళనమువలన కల్గిన ఆకర్షణీయమైన శోభ.

(14) శ్రీస్వామిపుష్కరిణికాప్లవనిర్మలాంగాః
శ్రేయోర్థినో హరవిరించిసనందనాద్యాః ।
ద్వారే వసంతి వరవేత్రహతోత్తమాంగాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

శ్రీస్వామిపుష్కరిణికా+ఆప్లవనిర్మలాంగాః=శ్రీస్వామి పుష్కరిణిలో స్నానము చేయుటచే నిర్మలమైన దేహమును కలవారును, శ్రేయః+అర్థినః=(నీ వలన) శ్రేయస్సును పొందవలెనని ప్రార్థించువారును అగు, హరవిరించిసనందనాద్యాః=శివుడు, బ్రహ్మ, సనందనుడు మొదలగువారు, ద్వారే=(నీ) కోవెల వాకిటిలో, వరవేత్రహత+ఉత్తమాంగాః =(ద్వారపాలకులచే) గొప్ప బెత్తముతో కొట్టబడిన శిరస్సులను కలవారై, వసంతి =నిలచియున్నారు. శ్రీవేంకటాచలపతే=శ్రీవేంకటేశ్వరా, తవ=నీకు, సుప్రభాతమ్ =సుప్రభాతమగుగాక!

శ్రీవేంకటేశ్వరా! బ్రహ్మ, శివుడు మొదలగు దేవతలు, సనకసనందనాది యోగులును నీ కోనేటిలో స్నానమాడి, పవిత్రులై, నీ వాకిటిలో కాపలాకాయువారి చేతిబెత్తములతో కొట్టబడిన శిరస్సులను కలవారైనను అచటినుండి తొలగి పోకుండ, ఆ వాకిటియందే నిలచియున్నారు. వారికి నీ దర్శనము నిచ్చుటకు నీకు సుప్రభాతమగుగాక!

శ్రీస్వామియొక్క పుష్కరిణిక అని, శ్రీస్వామిని ఐన పుష్కరిణిక అని "శ్రీస్వామి పుష్కరిణికా" అను పదమునకు గల రెండు వ్యుత్పత్తుల ద్వారా కోనేరి అనుటకు స్వామి యొక్క పుష్కరిణిక - అని, స్వామిని అగు పుష్కరిణిక - అని రెండువిధములుగా విడదీయవచ్చును. స్వామియగు శ్రీనివాసుడు అవబృథస్నానమును చేయు పుష్కరిణి అని, అన్ని పుష్కరిణులకును స్వామిని అనియు - ఇట్లు రెండు విధములైన అర్థములు పురాణములలో తెలుపబడినవి.

వామనపురాణము 32 అధ్యాయములో భగవానుడు శంఖజునితో "ఈ పర్వతమునందు దివ్యమైనది, గొప్పది, పాపమును పోగొట్టునది, పుణ్యమును ఇచ్చునది, గంగ మొదలగు సకలతీర్థములతో సమానమైనది, పవిత్రమైన తీర్థమును కల్గినది, స్వామి పుష్కరిణి అని ముల్లోకములందు ప్రసిద్ధిని పొందినది అగు పుష్కరిణి ఒకటి కలదు. అందు స్నానమాడి మానవులు పాపవిముక్తులు అగుదురు" అని పల్కుటను బట్టి ఈ పుష్కరిణి పవిత్రతను తెలియనగును. ఇతః పూర్వమే గొప్పతనమును పొందియున్న శివుడు, బ్రహ్మయు ఇంకను గొప్పతనమును పొందుట అనగా-పొందిన మహిమను కోల్పోకుండ నిలచియుండునట్లు పొందుటయే. సనందనాదులు ఎల్లప్పుడును బ్రహ్మధ్యానమునే చేయుదురు. ఆధ్యానమునకు మధ్యలో అంతరాయము రాకుండనుండవలెనని వారు స్వామిని ప్రార్థింతురు.

"బ్రహ్మ వేలాదియుగముల కాలము విష్ణువును ఆరాధించి, ముల్లోకములను సృష్టించు అధికారమును తిరిగి పొందెను అని వినికిడి" అనెడి మహాభారతశ్లోక మిచట స్మరింపనగును.

"వరవేత్రహతోత్తమాంగాః" అనుటకు పూర్వము తెల్పిన అర్థమే కాక, "వేత్రవరం వ్రజామి" (శ్రీరంగపూర్వ-58) అని భట్టర్ అనుగ్రహించినరీతిలో గర్భగృహముయొక్క వాకిలి బయట అడ్డముగా నిలుపబడియున్న బెత్తముపై మోదుకొనిన తలలను కలవారు అను అర్థమునుకూడ చెప్పవచ్చును. ఆ వేత్రముయొక్క ప్రహారములను పొందినవి అగుటచే వారి శిరస్సులు ఉత్తమాంగములను సార్థకనామధేయములను కల్గినవి అయినవి అని తాత్పర్యము.

(15) శ్రీశేషశైలగరుడాచలవేంకటాద్రి -
నారాయణాద్రివృషభాద్రివృషాద్రిముఖ్యామ్ ।
ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

శ్రీశేషశైల గరుడాచల వేంకటాద్రి నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రిముఖ్యామ్ = శేషాచలము, గరుడాచలము, వేంకటాచలము, వృషభాచలము, వృషాచలము మొదలగు పేర్లను, త్వదీయవసతేః = నీ వాసస్థానమగు పర్వతమునకు, అనిశం=ఎల్లప్పుడును, వదంతి=పల్కుచున్నారు, శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్=వేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

శ్రీవేంకటేశ్వరా! ఇచటకు వచ్చిన భక్తులు నీ వాసస్థానమగు వేంకటాచలము యొక్క పలు నామములను నిరంతరము అనుసంధించుచున్నారు. నీకు సుప్రభాత మగుగాక!

ఆదిశేషుడే వేంకటాచలముగా అవతరించుటచే ఇది శేషాచలమను పేరును పొందినది. బ్రహ్మాండపురాణములోని 2వ అధ్యాయములో భగవానుడు ఆదిశేషునితో "క్రీడించుటకు తగిన చోట నివసింపవలెనని నా అభిప్రాయము. నారదుడు పల్కిన

మాటను వింటివి కదా! అతడు చెప్పినచోట భూలోకములో నీవు ఒక పర్వతరూపమును దాల్చియుండుము. నీ పడగల క్రింది భాగమున నేను లక్ష్మీదేవితో కలసి నివసింతును" అని పల్కుట, ఆదిశేషుడును ఆ విధముగానే పర్వతాకారమును పొందుటయును కాననగును.

గరుడాచలము- గరుడునిచే తీసికొని రాబడిన పర్వతమగుటచే వేంకటాచలమునకు గరుడాచలమని పేరు. శ్వేతవరాహస్వామి భూమిని పూర్వములెనే స్థిరముగా నిలిపి, లోకులను ఉజ్జీవింపజేసి, వారిని భూమియందు నివసించునట్లు చేయదలచి, గరుడునితో "మహాబలశాలివైన వైనతేయా! నీవు వెంటనే పరమపదమునకు పోయి, అచటగల నా క్రీడాపర్వతమును ఇచటకు తీసికొనిరమ్ము" అని ఆజ్ఞాపింపగా, గరుడుడు ఆ పర్వతమును తీసికొనివచ్చెను-అని వరాహపురాణము పూర్వభాగములోని 2వ అధ్యాయములో కలదు.

"వేంకటాద్రి- వేమ్" అనునది మోక్షమును నిర్దేశించు బీజాక్షరము. "కట" శబ్దముచే ఐశ్వర్యము చెప్పబడుచున్నది. కావున మోక్షమును, ఇహలోకపరలోకములలోని ఐశ్వర్యమును జనులు దీనివలన పొందుచున్నారు, కావున వేంకటాద్రి అనబడుచున్నది. అని వరాహపురాణము మొదటి భాగము 4వ అధ్యాయము తెలుపుచున్నది. అట్లే, "వేమ్" అనునది సకల పాపములను నిర్దేశించును. "కట" శబ్దముచే ఆ పాపదాహము తెలుపబడుచున్నది. పాపములను దహించును కావున ఈ కొండకు వేంకటాచలమను పేరు కల్గినది-అని భవిష్యోత్తరపురాణములోని 2వ అధ్యాయములో తెలుపబడినదానికి అనుగుణముగా వేంకటాద్రి శబ్దమునకు రెండు విధములైన వ్యుత్పత్తులు కలవనుటను గమనింపనగును.

నారాయణాద్రి- నారాయణుడను బ్రాహ్మణుడొకడు ఈ కొండపై ఘోరతపస్సును చేసి, భగవానుని సాక్షాత్తు దర్శించి, ఈ పర్వతము తన పేరుతో వ్యవహరింపబడవలెనని వరమును వేడగా, అందులకు భగవానుడంగీకరించుటచే ఇది నారాయణాద్రి అయినది అని బ్రహ్మాండపురాణము 3వ అధ్యాయములోనుండుట చూడదగినది.

వృషభాద్రి- సాధువులను పీడించుచున్న శివభక్తుడగు వృషభుడను అసురుడొకడు తన కెదురుగా తటాలున ప్రత్యక్షమైన ఒక పర్వతమునందు వేటగాని రూపములో కన్పించిన భగవానునితో పోరాడి, ఆ స్వామి ప్రయోగించిన చక్రాయుధముతో అతడు మరణించి నపుడు, తన పేరుతో ఈ కొండ పిలువబడవలెనని స్వామిని ప్రార్థింపగా, ఆ ప్రార్థనను భగవానుడు అంగీకరించెను. కావున దీనికి వృషభాద్రి అను పేరు కల్గెను. ఈ వృత్తాంతము బ్రహ్మాండపురాణములోని 5వ అధ్యాయములోనుండుటను గమనింపుడు.



వృషాద్రి- వృషుడను మనువు ఇచట తపస్సు చేయగా, ఆ తపస్సునకు మెచ్చిన వరాహ స్వామి "నీవు తపస్సుచేసి ఇచట వృషశబ్దవాచ్యమగు ధర్మమును వృద్ధి చేయుటచే ఈ పర్వతము వృషాద్రి అను పేరుతో పిలువబడును" అని వరమును ఇచ్చెనని వామ పురాణములోని 22వ అధ్యాయములోనుండుటను గమనింపుడు. ఇట్లే, అంజనాచలము అను మొదలగు పలు నామములు ఈ కొండకు ఉండుట పురాణములలో అచట అచట గమనింపనగును.

ఈ పర్వతనామములను చెప్పుచున్నవారుగా ముందు శ్లోకమున తెలుపబడిన బ్రహ్మ మొదలగువారిని చెప్పనగును.

**(16)** సేవాపరాః శివసురేశకృశానుధర్మ -
రక్షో-బునాథపవమానధనాధినాథాః ।
బద్ధాంజలిప్రవిలసన్నిజశీర్షదేశాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

సేవాపరాః=నీ సేవలో ఆసక్తినికల, శివ-సురేశ-కృశాను-ధర్మ-రక్షః అంబునాథ-పవమాన-ధనాధినాథాః=శివుడు, ఇంద్రుడు, అగ్ని, యముడు, నిఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు-అను దేవతలు, బద్ధ+అంజలి ప్రవిలసత్=జోడించిన చేతులతో వెలుగుచున్న, నిజశీర్షదేశాః=తమ శిరస్సులను కలవారుగా, సంతి=ఉన్నారు, శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్=శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము

శ్రీవేంకటేశ్వరా! శివుడు, ఇంద్రుడు మొదలగు దిక్పాలకులు ఎనిమిదిమంది తమ తలలపై జోడించిన చేతులను కలవారై, నీ సేవ కొఱకు కాచుకొని ఉన్నారు. నీకు సుప్రభాతమగుగాక!

శివుడు, ఇంద్రుడు ఇత్యాదిగా ఇచట తెలుపబడిన ఎనిమిదిమంది క్రమముగా ఈశాన్యము, తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పడమర, వాయవ్యము, ఉత్తరము -అను ఎనిమిది దిక్కులకు అధిపతులు.

"అంజలిః- అమ్ జలయతి" అకార వాచ్యుడగు భగవానుని ద్రవీకరించుచున్నది-అనగా దయగలవానినిగా చేయుచున్నది-అను కారణముచే చేతులను జోడించుటకు అంజలి అను పేరు కల్గినది. ఈ అంజలి మస్తిష్కము, సంపుటము మొదలగు రీతులలో అనేక విధములు. తలపై చేతులను జోడించుట మస్తిష్కప్రణామమని, వక్షఃస్థలమునకు నేరుగా చేతులను జోడించుట సంపుట ప్రణామమని, పేరు. ఇంకను ఇట్టి పలు రీతులలోని అంజలిబంధములు పాంచరాత్ర శాస్త్రములలో తెలుపబడినవి. ఇచట దిక్పాలకులు మస్తిష్కప్రణామమును చేయుచున్నారు. వీరి శిరస్సులకు అలంకారము

కిరీటములు కావు; అంజలియే అనుట "ప్రవిలసత్" అను ప్రయోగముద్వారా వ్యక్తమగుచున్నది.

(17) ధాటీషు తే విహగరాజమృగాధిరాజ -
నాగాధిరాజగజరాజహయాధిరాజాః ।
స్వస్వాధికారమహిమాధిక మర్థయంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

తే ధాటీషు=నీ విజయయాత్రలలో, విహగరాజ-మృగాధిరాజ-నాగాధిరాజ-గజరాజ హయాధిరాజాః=గరుడ-సింహ-శేష-గజ-అశ్వరాజులు, స్వస్వ+అధికారమహిమ+ అధికమ్=తమకు తమకుగల అధికారమహిమలలో ఆధిక్యమును, అర్థయంతే ప్రార్థించుచున్నారు, శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్=శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

శ్రీవేంకటేశ్వరా! నీవు సైన్యముతో విజయముకొఱకు బయలుదేరు ప్రయాణములలో గరుడుడు మొదలగువారు ఇంతకు ముందే తమకు గల అధికారమహిమకంటె ఎక్కువ అధికారము కలుగవలెనని నిన్ను ప్రార్థింపవచ్చిరి. నీకిదే సుప్రభాతమగుగాక!

"ధాటీ" అనగా దండయాత్ర. దిగ్విజయయాత్ర-అని అర్థము. గజరాజ, హయాధిరాజ శబ్దములు వరుసగా ఐరావత, ఉచ్చైఃశ్రవములను తెలుపునని పల్కి, ఇంద్రుని గజము, అశ్వమును ఇంద్రుని అనుజుడగు (ఉపేంద్రుడగు) వేంకటేశ్వరునకును చెందినవి అని గ్రహించుటయును తగును.

గరుడుడు మొదలగు ఈ అయిదుగురకును శత్రువులను నిరసించుటకు తగిన అధికారము, ఇంకను గల అన్ని మహిమలు ఇతఃపూర్వమే భగవానునిచే అనుగ్రహింప బడినను, యుద్ధములో స్వామి ఇచ్చిన ఆజ్ఞను శీఘ్రముగా నెరవేర్చుటకు అది చాలదని తలచి, ఉదారుడగు భగవానునివద్ద ఇంకను మఱింత ఎక్కువగా అధికారమహిమను పొందవలెనని ప్రార్థించుచున్నారను భావమును చెప్పుదురు.

(18) సూర్యేందుభౌమబుధవాక్పతికావ్యసౌరి-
స్వర్భానుకేతుదివిషత్పరిషత్ప్రధానాః ।
త్వద్దాసదాసచరమావధిదాసదాసాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

సూర్య+ఇందు భౌమ బుధ వాక్పతి కావ్య సౌరి స్వర్భాను కేతు=సూర్యుడు, చంద్రుడు,



అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు, కేతువు-అనెడి, దివిషత్ ప్రధానాః=దేవసమూహములోని ముఖ్యులు, త్వత్దాసదాస=నీదాసుల దాసులకు, చరమావధిదాస=చివరి ఎల్లలోనున్న దాసులకును, దాసాః=దాసులై, సంతి=ఉన్నారు, శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్=శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

శ్రీవేంకటేశ్వరా! నవగ్రహములనబడు ప్రధానదేవతలు నీ దాసుల దాసులకు చరమావధిదాసులైనవారికిని దాసులై, నీ వాకిటిలో కాచుకొనియున్నారు. నీ కిదే సుప్రభాతము.

నవగ్రహములు భగవద్దాసులకు చరమావధిదాసులగుచున్నారనుటచే, ఆ గ్రహములు మిగిలినవారికి వారి వారి జాతకములను అనుసరించి కొన్ని సందర్భములలో అశుభఫలములను ఇచ్చినను, భగవానుని దాసుల విషయమున అట్లుకాకుండ వారికి దాసులైయుండి, ఎల్లప్పుడును సత్ఫలములనే ఇత్తురను భావము స్ఫురించును. "వళ్ళలే! ఉన్ తమర్క్కొన్ఱుమ్ నమన్తమర్ కళ్ళర్ పోల" (పెరియ తిరు-8-10-7) (ఓ ఉదారుడా! నీ దాసులకు ఎల్లప్పుడు యమభటులు చోరులవలె భయపడుతూ వర్తిస్తారు) అనునట్లు చోరులవలె భయపడుచు, దాగి, వర్తింతురనుట, "విధయ శ్చ వైదికాః త్వదీయగంభీర మనోనుసారిణః" (స్తోత్ర-20) అనునట్లు వైదికవిధులును భగవద్భక్తుల గంభీరములగు భావములను అనుసరించుననుట వాస్తవస్థితికాగా, నవగ్రహములు అతని దాసులకు దాసులగుటలో అడ్డులేదు కదా!

(19) త్వత్పాదధూళిభరితస్ఫురితోత్తమాంగాః
స్వర్గాపవర్గనిరపేక్షనిజాంతరంగాః ।
కల్పాపగమాకలనయాకులతాం లభంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

త్వత్ పాదధూళి= నీ చరణధూళిచే, భరితస్ఫురిత= నిండి, వెల్గుచున్న, ఉత్తమాంగాః =శిరస్సులను కలవారగు నీ దాసులు, స్వర్గ+అపవర్గ=స్వర్గమునందు, మోక్షమునందు, నిరపేక్షనిజ+అంతరంగాః = ఆశలేని తమ మనస్సులను కలవారై, కల్ప+ఆగమ+ ఆకలనయా =ప్రళయము వచ్చునను భావనతో, ఆకులతాం =మనః క్లేశము, లభంతే=పొందుచున్నారు. శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్ =శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

శ్రీవేంకటేశ్వరా! నిన్ను సేవించి, నీ పాదరేణువులను తలపై దాల్చి, దాని వలన స్వర్గమోక్షములనుకూడ గర్హించు నీ భక్తులు, కలియుగ ప్రత్యక్షదైవమగు నీవు కలియుగము అంతమైనచో అంతర్ధానమగుదువు; పరమపదమును తిరిగి చేరుదువు

అను భయముతో నున్నారు. స్వామీ! నీకు సుప్రభాతము.

భగవత్పాదద్వయాకారముగా భగవానుని లలాటమున సమర్పింపబడు పచ్చకర్పూరపు పొడియే ఇచట పాదధూళి శబ్దముచే చెప్పబడినది అని అందురు. భగవత్పాదాకృతిలో శ్వేతమృత్తికను భక్తులు అలంకరించు కొవచ్చునే కాని, దానిని భగవానుడు ధరింపవచ్చునా? అను ప్రశ్నకు కూరేశుల "ఊర్ధ్వపుండ్రతిలకం బహుమానాత్ కిం బిభర్షి వరద స్వలలాటే" (వరదరాజస్తవ-26) (వరదరాజస్వామీ! నీ భక్తులకు ఊర్ధ్వగతిని (పరమపదమును) పొందించుచున్నది ఇది - అను గౌరవముతో ఊర్ధ్వపుండ్రతి లకమగు ఈ శ్వేతచూర్ణమును నీ లలాటమున ధరించుచుంటివా? ఏమి!'' అను సూక్తి సమాధానమిచ్చుచున్నది. లేక, ఊర్ధ్వపుండ్రము సమర్పించునపుడును, తొలగించునపుడును పచ్చకర్పూరపు పొడి పాదములలో పడు అనుభవముండుటచే, పాదములందు పడు ధూళిని పాదధూళి అనియు చెప్పవచ్చును. ప్రతిశుక్రవారము నాడు అలంకరించిన శ్వేతచూర్ణమును మరుసటి శుక్రవారమునాడు భక్తులకు వినియోగించుటయు, వారు దానిని లోనికి స్వీకరించుట, శిరస్సును దాల్చుటయును ఈనాటికిని తిరుమలలో అలవాటులో ఉండుట గమనింపతగినది.

"కల్పాగమాకలనయా ఆకులతాం లభంతే"- పరమ శివుడు భగవానుని వద్ద- "స్వామీ! వేంకటేశ్వరా! నీవు ఎచట ఎల్లప్పుడు నివసింతువో, అచటనే నేను కూడ వాసమును చేయవలెను" అని ప్రార్థింపగా, మేఘవర్ణుడగు వేంకటేశ్వరుడు "ఈ కొండపై ప్రళయమువచ్చువరకు నేను నివసింతును. మహాదేవా! నీవును ఈ కొండచరియలో ఆగ్నేయదిక్కులో నివసింపుము" (వరాహ.పురా పూర్వభాగ-18 అధ్యాయము) అని పల్కినట్లుండుటచే, చిరంజీవులగు మార్కండేయాది మహర్షులు "ప్రళయము సంభవించినచో వేంకటేశ్వరుడు పరమపదమునకు తిరిగి చేరును. అపుడు వేంకటేశ్వరుడై, నిత్యసూరులతో భేదము లేకుండ వానరములకు, వ్యాధులకు సైతము సేవను అనుగ్రహించునట్టి సౌశీల్యగుణాద్యనుభవమును కోల్పోవలసివచ్చునే!" అని కలత చెందుచున్నారు - అనియు చెప్పవచ్చును.

(20) త్వద్గోపురాగ్రశిఖరాణి నిరీక్షమాణాః
స్వర్గాపవర్గపదవీం పరమాం శ్రయంతః ।
మర్త్యా మనుష్యభువనే మతి మాశ్రయంతే
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

స్వర్గ+అపవర్గపదవీం=స్వర్గమార్గమగు ధర్మమార్గమును, మోక్షమార్గమగుభక్తి మార్గమును, పరమాం=పరిపూర్ణముగా, శ్రయంతః=ఆశ్రయించుచున్న, మర్త్యాః=మానవులు, త్వత్ = గోపుర+అగ్రశిఖరాణి=నీ గోపురముల అగ్రభాగములలోగల శిఖరములను, నిరీక్ష



మాణాః =చూచుచున్నవారై, మనుష్యభువనే=మానవలోకములోనే, మతిం= (ఉండవలెనను) భావమును, ఆశ్రయంతే=పొందుచున్నారు, శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్= శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

దానధర్మములను, భక్తిప్రపత్తులను పూర్ణముగా అనుష్ఠించి, ఈ శరీరావసానమున స్వర్గమును, మోక్షమును మేము తప్పక పొందెదదము-అని తలచువారుకూడ నీ గోపురకలశములను చూడగానే స్వర్గమోక్షములలో గల ఆశ నశించి, ఇంకను కొంత కాలము ఈ లోకములోనే పుట్టి, నిన్నే సేవింపవలెనని తలచుచు, ఇచటనే నిలచియున్నారు. శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

నమ్మాళ్వార్లు తిరువాశిరియ ప్రబంధములో "పరమపదమునందు భగవానుని శ్రీపాదములను తలయందు అలంకరించుకొనవలెనని ఆశపడి, అతనిని ఎల్లప్పుడు అచటనే భావించి కఱగి, ఆనందించు అవకాశము లభించినను, దానిని పురుషార్థముగా తలతునా?" అని పల్కిరి. ఆ ఆళ్వార్లే పెరియ తిరువన్దాది అను ప్రబంధములో "పుండరీ కాక్షా! నీ కల్యాణగుణములను చింతించు భావము తప్ప, నీ దాసులకు నీవు గొప్పగా పల్కి, అనుగ్రహించు పరమపదము సైతము రసించునా!" అనుచు భగవానుని సాక్షాత్తు ప్రశ్నించిరి. తిరుమళిశై ఆళ్వార్లు తిరుచ్ఛన్దవిరుత్తము అను ప్రబంధములో (108) "బ్రహ్మశివేంద్రాదిలోకములు లభించినను, పరమపదానుభవమే లభించి, అది గొప్పగా తోచినను, భగవానునితో చేరవలెనని ఆశపడి ఇచటనే ఉండుట తప్ప వేఱొకదేనిని అయినను నేను లెక్కింతునా!" అని పల్కిరి. తొణ్డరప్పొడియాళ్వార్లు తిరుమాలై ప్రబంధములో "అచ్చుతా! అమరరేఱే" (అచ్యుతా! నిత్యసూరి నాథా!) ఇత్యాదిగా నామసంకీర్తననమును చేసి, ఆనందించుట తప్ప, పరమపదానుభవమును పొందినను దానిని కోఱను" అనిరి. తిరుప్పాణాళ్వార్లు "అణియరఙ్గన్ ఎన్నముదినై క్కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే" (నాకు అమృత వంటివాడైన శ్రీరంగనాథుని చూచిన నా కన్నులు వేఱొక దానిని దేనినీ చూడవు) అని పల్కిరి. ఆ విధముగానే ఈ శ్లోకములో చెప్పబడిన అధికారులు సాధనానుష్ఠానములను చేసినవారై, స్వర్గమునో, లేక పరమపదమునో పొందుటకు తగిన యోగ్యతను పూర్ణముగా పొందియున్నను, వానిని ఉపేక్షించి, శ్రీవేంకటేశ్వరుని కోవెలలోని గోపుర కలశములను, అందలి స్వామిని సదా దర్శించుటకు సహాయపడునట్టిది అగు ఈ లోకములోని జన్మనే ఆశపడుచున్నారు-అని భావము.

(21) శ్రీభూమినాయక! దయాదిగుణామృతాబ్ధే !
దేవాధిదేవ! జగదేకశరణ్యమూర్తే ।
శ్రీమన్ననంతగరుడాదిభి రర్చితాంఘ్రే!
శ్రీవేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ ॥

శ్రీభూమినాయక=లక్ష్మీదేవికిని, భూదేవికిని భర్తయైన వాడా, దయా+ఆదిగుణ+అమృత అబ్దే=దయ మొదలగు గుణములనెడి అమృతము పుట్టు సముద్రమా!, దేవ+అధిదేవ =దేవతలందఱిలో గొప్ప నాయకుడా!, జగత్+ఏకశరణ్యమూర్తే=లోకమునకు ఒకే శరణమగు (అనన్యశరణమైన) తిరుమేనిని కలవాడా! శ్రీమన్=లక్ష్మీసహితుడా!, అనంత గరుడ+ఆదిభిః=ఆదిశేషుడు, గరుడుడు మొదలగువారిచే, అర్చిత+అంఘ్రే =పూజింపబడిన శ్రీపాదములను కలవాడా!, శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్=శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

శ్రీదేవి, భూదేవులకు భర్తవై, దయాదిగుణములకు సముద్రమవై, దేవదేవుడవై, లోకములో సాటిలేని శరణమై, నిత్యసూరులగు ఆదిశేషుడు మొదలగువారిచే పూజింపబడువాడవై, సంపద అంతయు పూర్ణముగా కలవాడవై, వేంకటాచలములో వేంచేసియుండు స్వామీ! నీకు సుప్రభాత మగుగాక!

ఈ శ్లోకము ద్వయమంత్రార్థమును వివరించుచున్నది. "శ్రీభూమినాయక!" అనుచు ద్వయము పూర్వఖండములోని శ్రీమత్పదార్థము, "దయాదిగుణామృతాబ్దే!" అనుచు శ్రీమత్పదములో తెలుపబడిన లక్ష్మీసంబంధముచే స్వాతంత్ర్యము తలవంచగా, ఉద్బుద్ధములైన దయ, వాత్సల్యము, సౌశీల్యము, సౌలభ్యము-మొదలగు గుణములను కల్గియుండుట అనెడి నారాయణశబ్దార్థము, "జగదేకశరణ్యమూర్తే!" అనునపుడు "మూర్తి" శబ్దముద్వారా స్వోపలక్షణభూతమైన శరణశబ్దార్థము, దీనియందే శరణవరణమునకు తగిన తిరుమేనిని కల్గియుండుటను తెలుపబడుటచే, అర్థవశమున "శరణం ప్రపద్యే!" అనుదాని యొక్క అర్థమును, "శ్రీమన్!" అని ద్వయమంత్రము ఉత్తరఖండములో గల "శ్రీమత్" అను పదముయొక్క అర్థమగు దివ్యదంపతిత్వము, "దేవాధిదేవ!" అనుచు దేవాధిసకలశేషిత్వఏరూపమైన నారాయణశబ్దార్థము, "అనంతగరుడాదిభి రర్చితాంఘ్రే" అను అర్చనద్వారా చతుర్థీవిభక్త్యర్థమగు కైంకర్యము, "శ్రీవేంకటాచలపతే!" అను ప్రయోగమునందలి పాపమును పోగొట్టుట అను అర్థము నిచ్చు వేంకటశబ్దముచే కైంకర్యవిరోధినిరసనము అను నమఃశబ్దార్థమును తెలుపబడుట గమనింపతగినది. ఇచటి వేంకటశబ్దము వేంకటేశ్వరుని తెలుపును. "శ్రీవేంకటేశ శ్చాసా అచలపతి శ్చ శ్రీవేంకటాచలపతిః" అను విగ్రహమును ఇచట చెప్పనగును. "ధామాశ్రయంతి తవ వేంకట సుప్రభాతమ్" (26) అను శ్లోకములో వేంకటపదము పర్వతమునుకాక, స్వామిని నిర్దేశించుటను గమనింపవచ్చును.

(22) శ్రీపద్మనాభ! పురుషోత్తమ! వాసుదేవ!
వైకుంఠ! మాధవ! జనార్దన! చక్రపాణే! ।
శ్రీవత్సచిహ్న! శరణాగతపారిజాత!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥



శ్రీపద్మనాభ=నాభిలో కమలమును కలవాడా!, పురుషోత్తమ=పురుషులలో ఉత్తముడా!, వాసుదేవ=అంతటను వ్యాపించి, ప్రకాశించువాడా! వైకుంఠ=వైకుంఠవాసా!, మాధవ = లక్ష్మీపతీ!, జనార్దన=దుష్టులను హింసించువాడా!, చక్రపాణే =చక్రాయుధపాణీ!, శ్రీవత్సచిహ్న =శ్రీవత్సమను పుట్టుమచ్చను గుర్తుగా (వక్షఃస్థలమున) కలవాడా!, శరణాగతపారిజాత=శరణువేడినవారికి పారిజాతమువలె అన్నిటిని ప్రసాదించువాడా!, శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్=శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

వైకుంఠనిలయుడవై, లక్ష్మీపతివై, పురుషోత్తముడవై, నాభీకమలమునందు చతుర్ముఖబ్రహ్మను సృష్టించినవాడవై, అంతట వ్యాపించియున్నవాడవై, శ్రీవత్సాంకుడవై, చక్రపాణివై, అసురులను వధించువాడవై, శరణుపొందినవారికి అన్నిటిని అనుగ్రహించు వాడవైయున్న వేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

భగవానుని మహిమలన్నియు ఇందు తెలుపబడుచున్నవి. పద్మనాభ నామము-నాభీకమలమునుండి బ్రహ్మను తన్మూలముగా లోకములను సృష్టించుటను, పురుషోత్తమశబ్దము ఆ లోకములలో నున్న సంసారులనెడి క్షరపురుషులు, అక్షరపురుషుల కంటె ఉన్నతిని కల్గియుండుటను, వాసుదేవశబ్దము తనచే సృష్టింపబడిన అన్ని నిత్యపదార్థములయందు వ్యాపించియుండి, వానియందలి దోషములేమియు సంక్రమింప కుండనుండుటను, "వికుంఠానా మయమ్" అని వ్యుత్పత్తినికల వైకుంఠశబ్దముచే భగవదనుభవమందు ఆటంకములేని నిత్యసూరులకు నాయకుడైయుండుటయును, వైకుంఠలోకమునకు నాయకుడైయుండుటయును, శ్రీవత్సచిహ్ననామముచే శ్రీవత్సాంకుడైన, అందమైన రూపమును కల్గియుండుటయును, "మాధవ!" అను నామముచే పూర్వోక్తవైభవములన్నియు అడవికాచిన వెన్నెల కాకుండునట్లు సఫలముచేయు లక్ష్మీదేవికి భర్తయగుటయును, "చక్రపాణే!, జనార్దన!" అను నామములచే చక్రాయుధమును చేతిలో ధరించి, దుష్టులను హింసించు స్వభావమును, "శరణాగత పారిజాత!" అనుటచే ముందు పల్కిన దానికి విరుద్ధముగా ఆశ్రితులకు పారిజాతమువలె వారు వారు కోరిన ఐశ్వర్యకైవల్యకైంకర్యములను అనుగ్రహించు ఔదార్యమును కల్గియుండుటను, వేంకటేశ్వరుడైయుండు స్థితిలో ప్రకాశించుటయును తెలుపబడినవి.

(23) కందర్పదర్పహరసుందరదివ్యమూర్తే !
కాంతాకుచాంబురుహకుట్మలలోలదృష్టే ।
కల్యాణనిర్మలగుణాకర! దివ్యకీర్తే !
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

కందర్పదర్పహర=మన్మథుని మదమును పోగొట్టు, సుందరదివ్యమూర్తే=అందమైన, గొప్ప రూపమును కలవాడా!, కాంతాకుచ+అంబురుహకుట్మల=ప్రేయసి అయిన లక్ష్మీదేవియొక్క కుచములనెడి తామరమొగ్గలలో, లోలదృష్టే=ఆసక్తినికల దృష్టిని కలవాడా!, కల్యాణనిర్మల=మంగళకరములై, దోషములులేని, గుణాకర=గుణాలకు నిధివంటివాడా!, దివ్యకీర్తే=గొప్ప కీర్తిని కలవాడా!, శ్రీవేంకటాచలపతే=శ్రీవేంకటేశ్వరా!, తవ సుప్రభాతమ్ = నీకు సుప్రభాతము.

మన్మథుడు నిన్ను చూచి మోహించి, తానే అందమైనవాడను గర్వమును విడచివేయగా, నీవుకూడా మోహంతో చూచే గొప్ప అందాన్నికల లక్ష్మీదేవిచేత ఉద్బుద్ధములైన కల్యాణగుణాలకు నిలయుడవు కావడంవల్ల సాటిలేని గొప్ప కీర్తిని కలవాడా! వేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

ఇందు మొదటిపాదములో "సాక్షాన్మన్మథమన్మథః" (శ్రీభాగ-10-32-2) అను అర్థము సూచింపబడుచున్నది. రెండవపాదముతో "యువతి శ్చ కుమారిణీ" (కుమారియైయుండియే యౌవనము తలఎత్తిన దశనుకల్గినది) అని చెప్పబడిన లక్ష్మీదేవి యొక్క యౌవనదశ తెలుపబడుచున్నది. "యువా-కుమారః" (కొంచెము కౌమారదశను కలవాడై, పూర్ణయౌవనమును కలవాడు) అని నిర్దేశింపబడిన భగవానునకు తగిన యౌవనదశ లక్ష్మీదేవిది-అని భావము. ఇట్లు ఇద్దఱియొక్క అందము చెప్పబడుటచే భగవానునకు లక్ష్మీదేవితోగల భోగము ప్రాకృతమై (దోషమును కల్గినదై) , మనవంటివారి భోగమువంటిదియైయుండునేమో! అను సందేహము కల్గు అవకాశము కలదు. అది మూడవపాదములోగల "నిర్మలగుణాకర" అనుటచే తీర్చబడుచున్నది. దోషరహితములగు గుణములకు ఆకరమైయున్న వానివద్ద ఏ దోషమును ఉండుటకు అవకాశము లేదుకదా! అట్లయినచో, భగవానునకు పిరాట్టితోగల భోగము ఎట్టిది? అనినచో, శ్రీవైకుంఠగద్యములో "శ్రీమతః చరణారవిందయుగళమ్" అనునపుడు శ్రీమత్పదమును వివరించుచు పెరియవాచ్చాన్ పిళ్ళై "శ్రీమతః" - భోగస్రోతస్సులో (భోగమను ప్రవహములో) తీరమును చూచుటకు సహాయకురాలగు సాక్షాలక్ష్మిని తనకు ప్రధాన మహిషిగా కలవానికి. ఇతనిది సంసారిసాధారణమైన భోగము కాదు కదా! అవాప్తసమస్త కాముడగుటచే (కోరికలన్నియు తీరినవాడగుటచే) ఆనందమయుడైయున్నవానికి దేవేరులతో కలయికచే కల్గు భోగము అనగా ఏది? అందు సహాయకురాలు అగుట ఏమి? అనగా, ఇతనికి భోగమనగా ఆశ్రితోజ్జీవనము (తనను ఆశ్రయించినవారు మోక్షమును పొందుట). దానికి పురుషకార భూతమైయుండి, చేర్చుటయే (లక్ష్మీదేవి) సహాయభూతురాలుగా నుండుట" అని అనుగ్రహించుటచే



భోగమనగా ఇది అని తెలియనగును. తనను చూడగనే అందరును శరణాగతిని చేయునట్టి, అందమును కల భగవానుడు లక్ష్మీదేవి కుటకుట్మలములనుచు గూఢముగా చెప్పబడిన ఆమె భక్తియొక్క ప్రారంభదశలోనే ముగ్ధుడై, ఆమె పురుషకారమును చేసినవారికి ఐశ్వర్యాదులను అనుగ్రహించుచున్నాడనునది మొదటి రెండుపాదములలో తేటపడిన అర్థము.

(24) మీనాకృతే! కమఠ! కోల! నృసింహ! వర్ణిన్ !
స్వామిన్! పరశ్వథతపోధన! రామచంద్ర!
శేషాంశరామ! యదునందన! కల్కిరూప!
శ్రీవేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్! ॥

మీన+ఆకృతే=చేపరూపమును దాల్చినవాడా!, కమఠ=కూర్మరూపియైనవాడా!, కోల = వరాహమూర్తీ!, నృసింహ = నరసింహరూపా!, వర్ణిన్=వామనబ్రహ్మచారీ!, పరశ్వథతపోధన=గొడ్డలిని ఆయుధముగాకల పరశురామమునీ!, రామచంద్ర =శ్రీరామచంద్రా= శేషాంశరామ =ఆదిశేషుని అంశకలిసిన బలరామా!, యదునందన =యాదవుడవగు శ్రీకృష్ణా!, కల్కిరూప= కల్కిరూపమును దాల్చినవాడా!, స్వామిన్=ఇట్లు అవతరించిన స్వామీ=శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్=శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

పది అవతారములను ఎత్తి, సత్పురుషుల శత్రువులగు రాక్షసులను నిరసించి, మమ్ములను రక్షించిన స్వామి యగు శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

పూర్వశ్లోకములో వచ్చిన కల్యాణగుణప్రస్తావమువలన స్మరణకు వచ్చిన అవతారములను ఇందు స్తుతించుచున్నారు. గుణపరీవాహములేకదా భగవదవతారములు. అనగా-జ్ఞానము, శక్తి, దయ, వాత్సల్యము-మొదలగు గుణములను వెలువరించుటకొఱకే భగవదవతారములు ఏర్పడినవి-అని తాత్పర్యము.

"నా చాసా సింహ శ్చ-నృసింహః" ఆకంఠము మానవరూపము, ముఖము సింహ ముఖమునుకల అవతారము. "వర్ణి" అనగా బ్రహ్మచారియైన వామనుడు. "వర్ణినో బ్రహ్మచారిణః" అని అమరకోశము. "వర్ణీ"-వర్ణింపబడువాడు సాలగ్రామముతో సమానమైన, సహజమైన పవిత్రతను కలవాడుగా పొగడబడుచున్నాడుకదా బ్రహ్మచారి. పరశ్వథమనగా పరశువు. "పరశు శ్చ పరశ్వథః" అని అమరకోశము. "రామచంద్రః" పదునాఱు కళలనుకల చంద్రునివలె సౌశీల్యము, వీర్యము-మొదలగు పదునాఱు గుణములను కల శ్రీరాముడు శ్రీరామచంద్రుడనబడుచున్నాడు. "దేవక్యా జఠరే గర్భం శేషాంశం ధామ మామకమ్, తత్ సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయ" (శ్రీభాగ-10-28) (నా తేజస్సు ఆదిశేషుడను పేరును కల దేవకి గర్భమును గ్రహించి,

రోహిణీ గర్భములో ప్రవేశపెట్టుము) అని శ్రీకృష్ణుడుగా అవతరింపబోవు భగవానుడు యోగమాయను ఆజ్ఞాపించుటచే రోహిణియొక్క కుమారుడగు బలరాముడు ఆదిశేషుని అంశమనుట స్పష్టము. యదుకులములో అవతరించిన శ్రీకృష్ణుడు యదుకులములోని వారికి ఆనందమును కల్గించుటచే యదునందనుడైనాడు. కలియుగాంతమున భగవానుడు కల్కమను శ్వేతాశ్వమును అధిరోహించి, పాపులను తన చేతి ఖడ్గముతో ఖండించునని పురాణ కథనము. కల్కమనగా తెల్లగుఱ్ఱము. దానిని కలవాడు; కావున కల్కి.

(25) ఏలాలవంగఘనసారసుగంధితీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణమ్ ।
ధృత్వా-ద్య వైదికశిఖామణయః ప్రహృష్టాః
తిష్ఠంతి వేంకటపతే! తవ సుప్రభాతమ్ ॥

వైదికశిఖామణయః=వైదికులలో శ్రేష్ఠులు, వియత్‌సరితి=ఆకాశగంగలోనుండి, హేమఘటేషు=బంగారు కలశములందు, పూర్ణం=నిండుగా, దివ్యం తీర్థం=గొప్ప తీర్థమును, ఏలాలవంగఘనసారసుగంధి=ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము -అను వీనితో పరిమళించునట్లు, ధృత్వా=(శిరస్సుపై) ధరించి, ప్రహృష్టాః=మిక్కిలి ఆనందమును కలవారై, తిష్ఠంతి (ఇచటకు వచ్చి) నిలచియున్నారు, వేంకటాచలపతే=వేంకటాద్రినాథా, తవ సుప్రభాతమ్=నీకు సుప్రభాతము.

వైదికోత్తములు ఆకాశగంగానదినుండి పవిత్రజలములను బంగారు కలశలములలో నిండుగా తీసికొని వచ్చి, అందు ఏలాలవంగాది పరిమళద్రవ్యములను చేర్చి, తలపై దాల్చి, తీసికొనివచ్చి, నీ ఆరాధన కొఱకు వేచియున్నారు. శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

పాపవినాశతీర్థమునుండి తిరుమలనంబి కలశములో తీసికొనివచ్చి, భగవానునకు సమర్పించుచున్న తిరుమంజన తీర్థము పిమ్మట భగవదాజ్ఞానుసారము ఆకాశగంగనుండి తీసికొనివచ్చుటచే శ్లోకములో "వియత్సరితి" అని అనబడినది. దీనిని తిరుమల సమయాచారములను గ్రంథములో (తిరుమలై ఒళుకు) కాననగును. "వైదిక శిఖామణయః" వేదమును తెలిసికొని, దాని ప్రకారమునడుచుకొను వారిలో శ్రేష్ఠులు. ఈ విధముగా చెప్పబడువారు తిరుమలనంబి వంశీయులు. ఇచట ఇట్లు తెలుపబడిన రీతిలోనే వీరు ఈనాటికిని తిరుమంజనము ఆకాశగంగనుండి తీసికొనివచ్చు కైంకర్యమును, వేదపారాయణమును చేయు సేవను, నిర్వహించుచుండుటను ప్రత్యక్షముగా చూడవచ్చును. ఈ స్తుతికర్తలగు అణ్ణన్ తాముకూడ తోళప్పర్ (తిరుమలనంబి వంశీయులు) ఆజ్ఞానుసారము కొంతకాలము తిరుమలలో తిరుమంజనకైంకర్యమును చేసినట్లు వారి చరిత్రలో గమనింపవచ్చును. అందుచే ఇందు ఆదరము వ్యక్తమగునట్లు అణ్ణన్ ఈ విధముగా పల్కిరి అనదగును. కైంకర్యరూపముగా చేయుచుండుటచే "ప్రహృష్టాః" అని ప్రయోగింపబడినది.



(26) భాస్వా నుదేతి వికచాని సరోరుహాణి
సంపూరయంతి నినదైః కకుభో విహంగాః ।
శ్రీవైష్ణవా స్సతత మర్థితమంగళా స్తే
ధామాశ్రయంతి తవ వేంకట! సుప్రభాతమ్ ॥

భాస్వాన్=సూర్యుడు, ఉదేతి=ఉదయించుచున్నాడు, సరోరుహాణి=తామరపూవులు, వికచాని= వికసించినవి (అయినవి), విహంగాః=పక్షులు, కకుభః=దిక్కులను, నినదైః (తమ) ధ్వనులతో, సంపూరయంతి=నిండించుచున్నవి, శ్రీవైష్ణవాః=శ్రీవైష్ణవులు, సతతమ్= ఎల్లప్పుడును, అర్థితమంగళాః=నీకు మంగళము కలుగవలెనని ప్రార్థించువారై, తే ధామ= నీ ఆలయమును, ఆశ్రయంతి=పొందుచున్నారు, వేంకట=వేంకటేశ్వరా!, తవ సుప్రభాతమ్= నీకు సుప్రభాతము

"కదిరవన్ కుణదిశై చ్చికరమ్ వన్దెడున్దాన్" (సూర్యుడు ఉదయగిరి శిఖరంపైకి వచ్చాడు) అనునట్లు. సూర్యుడు ఉదయించెను. తామరలు పూసినవి. పక్షులు తమ కిలకిలారావము లతో దిక్కులను నిండించుచున్నవి. నీకు మంగళమును ఆశాసించుచు తిరుమలపెరియ కేళ్విజీయర్ మొదలగు వైష్ణవులు నీ ఆలయమును చేరియున్నారు. వేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

భగవానుని ఎల్లప్పుడు పల్లాణ్డు పాడువారు భగవద్రామానుజుల స్థానమున పట్టాభిషిక్తులగు పెరియ కేళ్విజీయర్, శిఱియ కేళ్విజీయర్ స్వాములు (పెద్ద జీయరు, చిన్నజీయరు), వారి ఏకాంతులు, తిరుమల అనంతార్యుల వంశస్థులు, అరైయర్ కులములో పుట్టినవారు మొదలగు శ్రీవైష్ణవులు.

భాగవతులు, పరమభాగవతులు, ఏకాంతులు, పరమైకాంతులు-అను ఈ రీతిలో పలువురు కలరు. మోక్షము కొఱకై భక్తిని అనుష్ఠించువారు భాగవతులు. అందులకై (మోక్షమునకై) ప్రపత్తిని చేయువారు పరమభాగవతులు. భగవానుని మాత్రమే ఉపాయముగా స్వీకరించువారు ఏకాంతులు, భగవానుని మాత్రమే కోరు అనన్య ప్రయోజనులు, అనగా - భగవానుని మాత్రమే ప్రాప్యముగా కోరువారు పరమైకాంతులు.

ఈ శ్లోకములో చెప్పబడిన వారెవ్వరు అనగా, అతనివలన తమకు దేనిని కోరక, అతనికే మంచిని కోరువారగుటచే ముందు పల్కిన సత్పురుషులకంటె గొప్పవారని చెప్పతగినవారు అనుటను భావింపనగును.

(27) బ్రహ్మాదయ స్సురవరా స్సమహర్షయ స్తే
సంత స్సనందముఖా స్త్వథ యోగివర్యాః।
ధామాంతికే తవ హి మంగళవస్తుహస్తాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

సమహర్షయః=మహర్షులతో కూడిన, బ్రహ్మ+ఆదయః=బ్రహ్మ దేవుడు మొదలగు, సురవరాః=గొప్ప దేవతలు, అథ తు=మఱియు, తే సంతః=నీ అభిప్రాయములో సత్పురుషులగు, సనందనముఖాః=సనందనుడు మొదలగు, యోగివర్యాః హి=గొప్ప యోగులుకదా! మంగళవస్తుహస్తాః=మంగళద్రవ్యములను చేతులలో దాల్చినవారై, తవ=నీ, ధామ+అంతికే =ఆలయసమీపమున, (సంతి=ఉన్నారు), శ్రీవేంకట+అచలపతే=శ్రీవేంకటేశ్వరా!, తవ సుప్రభాతమ్=నీకు సుప్రభాతము.

మునివరులు, దేవతలు, యోగులు నీకు కానుకలుగా చెల్లించుటకై, అద్దము, విసనకఱ్ఱ మొదలగు మంగళద్రవ్యములను చేతులలో ధరించియుండి నీ కోవెల సమీపములో నిలచి ఉన్నారు. శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

మహర్షులు-అత్రి మొదలగు సప్తర్షులు. ఈ మునులు, బ్రహ్మ మొదలగు దేవతలును, బ్రహ్మభావనను, కర్మభావనను కలవారు. బ్రహ్మభావన మాత్రమేకల సనందనాదియోగులు (ఆ ఇద్దఱికంటె) భగవానుని అధికమైన ప్రేమకు ఆస్పదులు కావున, ''తే సంతః'' అని అనబడిరి. బ్రహ్మభావన-బ్రహ్మధ్యానము, కర్మభావన-కర్మానుష్ఠానము. మంగళద్రవ్యము లేవి? అనగా-పూర్ణకుంభము, చామరము, అద్దము, విసనకఱ్ఱ, అంకుశము, మృదంగము, దీపము, ధ్వజము-మొదలగునవి.

(28) లక్ష్మీనివాస! నిరవద్య! గుణైకసింధో!
సంసారసాగరసముత్తరణైకసేతో(పోత)!
వేదాంతవేద్యనిజవైభవ! భక్తభోగ్య!
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్ ॥

లక్ష్మీనివాస=లక్ష్మీదేవికి నిలయమైన వాడా!, నిరవద్య=దోషములు లేనివాడా! గుణ+ఏకసింధో=గుణములకు సాటిలేని సముద్రమా! సంసారసాగరసముత్తరణ+ఏకసేతో =సంసారమను సముద్రమును దాటుటకు సాటిలేని వారధివంటివాడా! (తెప్పవంటివాడా)



వేదాంతవేద్యనిజవైభవ=ఉపనిషత్తులచే తెలియబడు, సహజసిద్ధమైన వైభవమును కలవాడా!, భక్తభోగ్య=భక్తులకు మధురస్వరూపుడా!, శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్ = శ్రీవేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

లక్ష్మీదేవికి నిలయుడవని, దోషరహితుడవని, గుణసముద్రుడవని, సంసార సముద్రమును దాటించు సేతువని, నీ దాసులకు తీయనివాడవని-ఈ విధముగా పలు రీతులలో ఉపనిషత్తులచే తెలియబడు మహిమనుకల వేంకటేశ్వరా! నీకు సుప్రభాతము.

"లక్ష్మీనివాస" - భగవానుని స్వరూపమును లక్ష్మీదేవి తన స్వరూపముతో ఆశ్రయించియుండునట్లే, ఆ స్వామి తిరుమేనినికూడ తన తిరుమేనితో ఆశ్రయించి యుండును. ఈ విషయము "శాంతానంత" ఇత్యాది చతుఃశ్లోకములోని నాల్గవ శ్లోకములో తెలుపబడినది.

"నిరవద్య!", "గుణైకసింధో!" అనుటచే హేయప్రత్యనీకత్వము, (దోష ప్రతిభటత్వము) కల్యాణైకతానత్వము (కల్యాణగుణములకు పూర్ణమైన స్థానముగానుండుట) అనునవి క్రమముగా తెలుపబడినవి. "నిరవద్యగుణైకసింధో!" అనుటను ఒకే సంబోధనగా గ్రహించి, "నిరవద్య!" అను దానిని గుణములకు విశేషణముగా చేసి, దోషరహితములగు గుణములకు సాటిలేని సముద్రమా! - అని అర్థమును చెప్పవచ్చును. వాత్సల్యాది గుణములకు దోష మేమి? అనగా భగవానుని స్వాతంత్ర్యముచే అదుమబడియుండుట. అది లేకుండుట అనగా శ్లోకములోని "లక్ష్మీనివాస!" అను పూర్వపదముచే సూచింపబడిన లక్ష్మీపురుషకారముచే పాపులను దండించి తీరవలెనను నిరంకుశస్వాతంత్ర్యము అదుమబడి, వాత్సల్యాదులు తలఎత్తుట.

అవి తలఎత్తినచో, భగవానుడు ఆశ్రితుల దోషములను భోగ్యములుగా తలచి, తాను వారికి ఉపాయమై, మోక్షము నిచ్చిన పిమ్మట, భక్తులకు తీయనివాడగుటను భక్తభోగ్య పదము తెలుపుచున్నది. ఇట్టి వైభవములను మనము తెలియుట దేనినిబట్టి, అనగా అందులకు సమాధానమును "వేదాంతవేద్యనిజవైభవ!" అను ప్రయోగము చెప్పుచున్నది. వేదాంతమనగా ఉపనిషత్తు.

శ్లోకములోని మొదటి సంబోధనకు ప్రమాణము "హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ" అను పురుషసూక్త వచనము. "నిరవద్య" అనుటకు "అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకః విజిఘత్సః, అపిపాసః" (ఛాందోగ్య-8-7-1) (పాపము లేనివాడు, ముసలితనము

లేనివాడు, మరణము లేనివాడు, శోకము లేనివాడు, ఆకలి లేనివాడు, దాహము లేనివాడు) అను ఉపనిషత్ సూక్తి. "గుణైకసింధో!" అనుటకు "సత్యకామః" (ఛాందోగ్య-8-7-1) (నిత్యమైన కల్యాణగుణములు మొదలగువానిని కలవాడు) అనునది. "లక్ష్మీనివాస నిరవద్యగుణైకసింధో!" అనుటకు "శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే" (పురుషకారమును చేయునది అని మనచే పొగడబడు లక్ష్మీదేవిచే భగవానుడు దోషములు లేని గుణములను కలవాడుగా స్తుతింపబడుటను పొందుచున్నాడు) అనునది ప్రమాణములు. "సంసారే" త్యాది ప్రయోగమునకు "అమృతస్య ఏష సేతుః " (ముండక2-2-5) (ఇతడు అమృతశబ్ద వాచ్యమగు మోక్షమును పొందించు వారధి అగుచున్నాడు) అనునది ప్రమాణము. "భక్తభోగ్య!" అనుటకు "రసో వై సః" (ఈ పరబ్రహ్మ అనుభవింపతగిన మాధుర్యమును కలవాడు) అనునది ప్రమాణము. ఇంకను మిగిలినవానికిని ఈరీతిలోని గమనింపనగును.

(29) ఇత్థం వృషాచలపతే రిహ సుప్రభాతం
యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః ।
తేషాం ప్రభాతసమయే స్మృతి రంగభాజాం
ప్రజ్ఞాం పరార్థసులభాం పరమాం ప్రసూతే ॥

ఇత్థం=ఇట్లు, వృషాచలపతేః=తిరుమల నాథునకు, సుప్రభాతం=సుప్రభాతమును (పల్కు స్తోత్రమును), ఇహ=ఈ తిరుమలలో, యే మానవాః=ఏ మానవులు, ప్రతిదినం=ప్రతి దినమును, పఠితుం ప్రవృత్తాః=పల్కుటకు ప్రారంభింతురో, తేషాం=వారికి, ప్రభాత సమయే=ఉదయకాలమునందు స్మృతిః=స్మృతి (తలచుట) అంగభాజాం=శరీరమును కల మానవులకు, పర+అర్థసులభాం=గొప్ప ప్రయోజనమును సులభముగా పొందదగిన, పరమాం ప్రజ్ఞాం=గొప్ప జ్ఞానమును, ప్రసూతే=జనింపజేయును.

ఈ విధముగా వేంకటేశ్వరునకు సుప్రభాతమును పల్కు స్తోత్రమును ఎవరు ప్రతిదినము తిరుమల క్షేత్రమున పఠింతురో, వారిని ప్రాతఃసమయమున తలచినంతనే చాలును; ఆ తలపు వారికి భక్తిని కల్గించి, వారిని పరబ్రహ్మతో కూడునట్లు చేయుననుటలో సందేహము లేదు.

శ్రీవేంకటేశ్వరుని సుప్రభాతమును ఎవరు పఠింతురో ఆ మానవులకు ఊరకనే పఠించుట మాత్రము కాకుండ, ప్రాతఃకాలమున వేంకటేశ్వరుని స్మృతియును ఉండునో, అది మోక్షకారణ మగు భక్తి ప్రపత్తులను దశలను కల్గించునని.

ఎవరు ఈ స్తుతిని పఠింతురో ప్రాతఃకాలమున వారినిగూర్చిన స్మృతి మానవులకు మోక్షకారణమగు భక్త్యాదులను కల్గించుననియు,



లేక, ఎవరు ఈ స్తుతిని పఠింతురో వారు ప్రాతఃకాలమున ఎవరిని స్మరింతురో, ఆ స్మృతికి లక్ష్యభూతులగువారికి భక్తిమొదలగువానిని కల్గించుననియు ఇట్లు మూడు విధములుగా ఇచట అర్థమును చెప్పుదురు. వీనిలో ఉత్తరోత్తరము ఉత్కృష్టము.

౦

శ్రీమతే వేంకటేశాయ నమః

# శ్రీవేంకటేశస్తోత్రము - సవ్యాఖ్యానము

## అవతారిక

ప్రతివాదిభయంకరం అణ్ణన్ శ్రీవేంకటేశ సుప్రభాతస్తోత్రమును ముగించిన పిదప ఇక, ఈ శ్రీవేంకటేశస్తోత్రమును ప్రారంభించుచున్నారు. స్తోత్రమనగా-గుణిలో నున్న గుణములను పల్కుట. అనగా-గుణసముద్రుడగు భగవానునియందున్న గుణములలో కొన్నిటిని సాధ్యమైనంతవరకు వర్ణించుట. ఇట్లు ఈ ఆచార్యులు, మనలను రక్షించుటకు తగిన భగవానుని గుణములను స్తుతించిన పిదప తమకు అనిష్టములగు పాపములను పోగొట్టి, తమకు ఇష్టములగు ఫలములను అనుగ్రహింపవలెననుటను ఈ స్తోత్రము ద్వారా ప్రార్థించుచున్నారు.

1. కమలాకుచచూచుకకుంకుమతో
   నియతారుణితాతులనీలతనో! ।
   కమలాయతలోచన! లోకపతే !
   విజయీభవ! వేంకటశైలపతే! ॥

కమలాకుచచూచుకకుంకుమతః=శ్రీమహాలక్ష్మియొక్క కుచాగ్రములయందుగల కుంకుమచూర్ణముచే, నియత+అరుణిత+అతుల నీలతనో=ఎల్లప్పుడు ఎఱ్ఱగా చేయబడిన, సాటిలేని నీలమేనిని కలవాడా! కమల+ఆయతలోచన=తామరదళమువలె విశాలములైన కన్నులను కలవాడా! లోకపతే=లోకములకు ప్రభూ!, వేంకటశైలపతే=వేంకటేశ్వరా! విజయీ భవ=విజయుడవు కమ్ము.

సహజముగా నీలమేఘమువలె నల్లనిదైనను లక్ష్మీదేవి వక్షఃస్థలములో అలంకరించుకొనిన కుంకుమచూర్ణమువలన ఎల్లప్పుడు ఎఱ్ఱనిదైయున్న దేహ సౌందర్యమును, తామర రేకులవలె విశాలములగు నేత్రములను కలవాడవై చూడగానే ఇతడే లోకనాథుడనుట అందఱిచే తెలియబడు వేంకటేశ్వరా! నీవు విజయుడవు కావలయును.

లక్ష్మీదేవి ఆలింగనము చేసికొనుటచే ఆనందించి, తామరవలె వికసించిన కన్నులను కలవాడై, తాను కాపాడవలసిన లోకమును కటాక్షించి, రక్షించుచున్నాడనునది ఈ ప్రారంభశ్లోకముయొక్క తాత్పర్యము.



మొదటి సంబోధనచే శ్రియఃపతిత్వము, రెండవ పదముచే పుండరీకాక్షత్వము, లోకమును రక్షించువాడను అర్థమిచ్చు "లోకపతే!" అను సంబోధన సృష్టి ప్రళయాదుల కును ఉపలక్షణమై, దానిచే జగజ్జన్మాదికారణత్వమును తెలుపబడినవి. ఇవియేకదా పరబ్రహ్మయొక్క అసాధారణ లక్షణములు. ఈ రీతిగా, పరబ్రహ్మ అగు శ్రీమన్నారాయణుడే వేంకటేశ్వరుడని చెప్పినట్లయినది. అట్టి స్వామిని చూచి నీవు సర్వోత్కర్షతో వెలుగవలెనను చున్నారు.

2. సచతుర్ముఖషణ్ముఖపంచముఖ -
   ప్రముఖాఖిలదైవతమౌళిమణే! ।
   శరణాగతవత్సల! సారనిధే!
   పరిపాలయ మాం వృషశైలపతే! ॥

సచతుర్ముఖషణ్ముఖ పంచముఖ ప్రముఖ+అఖిలదైవతమౌళిమణే=చతుర్ముఖునితో కూడిన, కుమారస్వామి, శివుడు మొదలగు సమస్తదేవతలకును తలలో దాల్చు రత్నమా!, శరణాగత వత్సల=శరణు పొందినవారిపట్ల గొప్ప ప్రేమను కలవాడా!, సారనిధే =సారములగు వస్తువులకు నిధివంటివాడా!, వృషశైలపతే=వృషాద్రినాథా, మాం పరిపాలయ=దాసుడనగు నన్ను కాపాడుము.

బ్రహ్మ మొదలగు దేవతలకు నాయకుడవై, భక్తులపట్ల గొప్ప ప్రేమను కల్గి, ఎంత అనుగ్రహించినను, కొఱత లేని సారములగు వస్తువులను కల, నిధివంటి వేంకటేశ్వరా! నన్ను నీవు రక్షింపుము.

"సచతుర్ముఖే"త్యాది శ్లోక పూర్వార్ధముతో "నారాయణా ద్బ్రహ్మా జాయతే నారాయణా ద్రుద్రో జాయతే నారాయణా దింద్రో జాయతే" (నారాయణోపనిషత్తు) (నారాయణుని వలన బ్రహ్మ పుట్టుచున్నాడు, నారాయణునివలన రుద్రుడు జనించు చున్నాడు, నారాయణునివలన ఇంద్రుడు పుట్టుచున్నాడు) అని నారాయణునివలన పుట్టిన దేవతలందఱును తమను సృష్టించిన తండ్రి అగు నారాయణుని శ్రీపాదములను తమ తమ శిరస్సులలో దాల్చుట తెలుపబడినది. "నిరైమలర్ పాదఙ్గళ్ శూడి క్కుఱ్ఱత్తుళాయ్ ముడి క్కోల క్కణ్ణపిరానై త్తొళువార్ ఒఱ్ఱప్పిఱై యణిన్దానుమ్ నాన్ముకను మిన్దిరనుమ్ మఱ్ఱ యమరరు మెల్లామ్" (తిరువాయ్‌మొళి-1-9-10) (అందమైన పూలవంటి శ్రీచరణాలను శిరస్సుపై అలంకరించుకొని, గుచ్చబడిన తులసిని కిరీటంపై కల్గిన, అందమైన శ్రీకృష్ణుని - చంద్రుని భూషణంగా కల శివుడు, చతుర్ముఖుడు, ఇంద్రుడు, అన్యదేవతలు అందఱు కీర్తిస్తారు) అని ఆళ్వార్లు పల్కిరి కదా!

"శరణాగతవత్సల!" అనుటచే బ్రహ్మ మొదలగు దేవతలతో, ప్రహ్లాదుడు, మహాబలి మొదలగు అసురులతో, అర్జునుడు, గోపకులు మొదలగు మానవులతో,

విభీషణుడు మొదలగు రాక్షసులతో, గజేంద్రుడు, సుముఖుడు మొదలగు తిర్యక్కులతో భేదము లేకుండ, వాత్సల్యముతో రక్షించుట తెలుపబడినది.

"సారనిధే!" అనుటచే మొదట తెలుపబడిన అధికారులకు అనుగ్రహింపతగిన సారములగు వస్తువులు అన్నియు ఇతని వద్ద ఉన్నవి-అని తెలుపబడినది. ఇట్లు వారిని కాచిన వేంకటేశ్వరుడే, దాసుడనగు నన్నుకూడ రక్షింపవలెనని ఈ శ్లోకముద్వారా ప్రార్థించినట్లయినది.

3. అతివేలతయా తవ దుర్విషహై
రనువేలకృతై రపరాధశతైః ।
భరితం త్వరితం వృషశైలపతే !
పరయా కృపయా పరిపాహి హరే! ॥

అతివేలతయా=అవధిని దాటినది అగుటచే, తవ=నీకు, దుర్విషహైః=సహింపరానివిగా, అనువేలకృతైః=నిరంతరము నాచే చేయబడు, అపరాధశతైః=వందలకొలది అపరాధము లచే, భరితం=నిండినవాడను, త్వరితం=మరింతగా పాపములను చేయుటలోనే మిక్కిలి అభినివేశమును కలవాడను అగు, మాం=నన్ను, వృషశైలపతే హరే =వృషాద్రీశా! హరీ!, పరయా కృపయా=గొప్ప కరుణతో, పరిపాహి=కాపాడుము.

వేంకటేశ్వరా! క్షమాసముద్రుడవగు నీవుకూడ అసహ్యించుకొనునట్లు నేను చేసిన పాపములకు అవధిలేదు. ఇకపై కూడ పాపములలోనే నా మనస్సు ఆసక్తమగు చున్నది. నీ దయను ప్రసరింపజేసినగాని, నేను తరించు దారి లేదు. నన్ను కాపాడుము.

(అతివేలతయా.....భరితమ్) "యద్బ్రహ్మకల్పనియతానుభవే-ప్యనాశ్యం తత్ కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే" (శ్రీవై-స్తవ-61) (ఏ ఒక్క పాపమే లక్షలకొలది బ్రహ్మకల్పములు (బ్రహ్మకల్ప మనగా బ్రహ్మ ఆయుస్సులో ఒక దినము - అనగా - ఒక వేయి చతుర్యుగములు. అనుభవించినను నాశమును పొందకుండునట్టి పాపమును జీవుడు అరక్షణములో చేయును) అని కూరేశులు వచించిన రీతిలో పాపములను అంతు లేకుండ, అవధిని అతిక్రమించి ప్రతిక్షణమును చేయుటచే, క్షమాసముద్రుడవగు నీకుకూడ వెగటు కల్గునట్లు నడచుకొంటిని-అని తాత్పర్యము. "ఏవం సదా సకలజంతుషు సాపరాధం క్షామ్యస్యహో! తదభిసంధివిరామమాత్రాత్" అను నట్లు అన్ని జన్మలలో ఎల్లప్పుడు పాపమును చేయువాడు "ఇక నేను పాపమును చేయకూడదు" అనుచు పాపమును చేయు తలపును విడచినంత మాత్రముననే అతనిని క్షమించెదవు. నేను అట్లు పాపమును చేయుటనుండి నివర్తించినచో ఉజ్జీవింపవచ్చును. కాని, ఆ పనిని కూడ నేను చేయుట లేదు కదా! అను భావము. "త్వరితమ్" అను



ప్రయోగముద్వారా వ్యక్తము. మరింతగా పాపమును చేయుటలోనే ఆశను కల్గిన వాడనైయున్నాను-అని తాత్పర్యము. త్వర అనగా ఉత్కంఠ. గొప్ప ఆశ అందుచే నీ గొప్ప కృపను చూపి రక్షింపవలెనే తప్ప, దాసుడు ఉజ్జీవించుటకు వేఱు గతి లేదు-అను భావము "పరయా కృపయా పరిపాహి హరే!" అనుటచే వ్యక్తమగుచున్నది లేక, "త్వరితమ్ పరిపాహి" అనుచు క్రియావిశేషణముగా అన్వయించి, "నీవు త్వరగా రక్షింపవలెను" అను అర్థమును చెప్పుటయును పొసగును.

4. అధివేంకటశైల ముదారమతేః
జనతాభిమతాధికదానరతాత్ ॥
పరదేవతయా గదితా న్నిగమైః
కమలాదయితా న్న పరం కలయే ॥

అధివేంకటశైలం=వేంకటాచలములో నివసించు, ఉదారమతేః=గొప్ప మనస్సును కలవాడు, జనతా+అభిమత+అధికదానరతాత్=మానవసమూహమునకు వారువారు ఆశపడిన మేరకు మించి అనుగ్రహించుటలో ఆశను కలవాడు, నిగమైః=వేదములచే, పరదేవతయా =పరదేవతగా, గదితాత్=చెప్పబడినవాడును అగు, కమలాదయితాత్=లక్ష్మీవల్లభునికంటె, పరం=వేరొకనిని, న కలయే=పరతత్త్వముగా భావింపను

గొప్ప మనస్సుతో మానవులు అభిలషించిన (ప్రార్థించిన) దానికంటె అధికముగా అనుగ్రహించుటలో ఆశనుకల, వేదప్రతిపాద్యుడగు పరమాత్మవైన నీవు లక్ష్మీదేవితో కూడి వేంకటాచలములో సౌలభ్యముతో ప్రకాశించుచుండగా, నేను నిన్ను విడచి ఇక వేఱెవ్వరిని పరతత్త్వముగా భావింపను.

"వేంకటశైలే-అధివేంకటశైలమ్"-సప్తమీవిభక్త్యర్థములో "అధి" అను ఉపసర్గ చేరిన అవ్యయీభావసమాసమును "అధివేంకటశైలమ్" అనునపుడు గ్రహింపవలెను. వేంకటాచలములో-అని అర్థము. "వసతః" (నివసించు) అను పదమును అధ్యాహారము చేసికొనవలెను. "ఉదారమతిః"-"ఉదారా మతిః యస్య సః" అని విగ్రహవాక్యము. "ఉదారో దాతృమహతోః" అను అమరకోశవచనముప్రకారము గొప్ప దానగుణమును కలవాడని, గొప్ప మనస్సును కలవాడని రెండు అర్థములను చెప్పవచ్చును. మొదటి అర్థమున దాతను తెలుపు ఉదారశబ్దము ఇచట దాతృత్వమును నిర్దేశించునది అగుటచే భావప్రధాన నిర్దేశము. ఔదార్యమను భావమునుకల భగవానుడని అర్థము. "దాస్యరసికాం భుక్త్వా సమృద్ధిం పరామ్" (దాస్యరసికత్వమును-అనగా సేవయొక్క రుచిని తెలియుట అనెడి సంపదను అనుభవించి) (శ్రీగుణ-61) అనెడి చోట

దాస్యరసికాశబ్దమును దాస్యరసికత్వబోధకముగా, అనగా-భావప్రధాన నిర్దేశముగా చేయుటను ఇచట స్మరింపనగును.

(జనతా....రతాత్)- ఈ ప్రయోగము పూర్వోక్తదాతృత్వపరాకాష్ఠను తెలుపుచున్నది. ఈ స్తుతికర్త వేంకటేశ్వరుని ఎదురుగా సేవించునపుడు, ఆ భగవానుడు తాము వేడు నిత్యసేవ -అను ఫలముతోపాటు మోక్షమునుకూడ ఇచ్చువాడుగా సేవను అనుగ్రహించెను. దానిని చూచి "జనతాభిమతాధికదానరతాత్" అని అణ్ణన్ పల్కుచున్నారు. ఇది "ఆయ్ కొణ్డ శీర్ వళ్ళల్ ఆళిప్పిరాన్ (తిరువేజ్గడత్తెన్నానై యెన్నప్పన్) ఎనక్కే యుళన్, శాయ్ కొణ్డ విమ్మైయుమ్ శాదిత్తు వానవర్ నాట్టైయుమ్ నీ కణ్డుకొళ్ ఎన్ఱు వీడుమ్ తరుమ్ నిన్ఱు నిన్ఱే" (హేయగుణాలు లేని, కల్యాణ గుణాలను కల శ్రీసుదర్శన ధారి నా కవితకు విషయం. కాంతిని కల ఇహలోక పురుషార్థాన్ని ఇచ్చి, పరమపదాన్ని కూడా పొందు - అని మోక్షాన్ని నిదానించి చూచి ఇస్తాడు) అను నమ్మాళ్వార్ల సూక్తిని (తిరువాయ్మొళి- 3-9-9) అనుసరించి ఇట్లు ప్రయోగింపబడినది. ఈ సూక్తిలో "శాయ్ కొణ్డ ఇమ్మైయుమ్" అనగా కాంతిని కల ఐహికభగవదనుభవము.

(పరదేవతయా గదితా న్నిగమైః) - "ప్రయతః తేజః పరస్యాం దేవతాయాం సంపద్యతే" (ఛాందోగ్య-6-8-6) (మరణించువాని తేజస్సు అనబడు భూతసూక్ష్మములు పరదేవతయందు చేరుచున్నవి) అనియు, "తం దేవతానాం పరమం చ దైవతమ్..." (ఛాందోగ్య-6-7) (అతనిని దేవతలలో గొప్ప దేవతగా తెలిసికొందురు) అనియును ఇత్యాదిగా గల వేదవాక్యములచే భగవానుడు పరదేవతగా చెప్పబడుటను గమనింపుడు.

ఇట్టి మహిమనుగల శ్రియఃపతి వేంకటాచలములో మిక్కిలి సులభుడై వేంచేసియుండగా, వేఱొక దైవమును పరదేవతగా నేను గణింపను-అను భావము చివరి పాదములో తెలుపబడినది.

5. కలవేణురవావశగోపవధూ -
శతకోటివృతాత్ స్మరకోటిసమాత్ ।
ప్రతివల్లవికాభిమతాత్ సుఖదాత్
వసుదేవసుతా న్న పరం కలయే ॥

కలవేణురవ+ఆవశ=మధురమైన వేణువు ధ్వనికి పూర్తిగా వశమైన, గోపవధూశతకోటి= వందలకోట్ల గోపికలచే, వృతాత్=పరివేష్టింపబడినవాడవు, స్మరకోటిసమాత్= (అందమున) కోటిమన్మథులతో సమానుడగు, ప్రతివల్లవిక+అభిమతాత్ =ఒక్కొక్క గోపికకు ఇష్టమైనవాడగు, సుఖదాత్=ఆనందము నిచ్చువాడవు అగు, వసుదేవసుతాత్ =వసుదేవుని కుమారుడవగు నీ కంటె, పరం న కలయే=వేఱొకనిని నేను భావింపను.



నీవు ఊదు వేణువు ధ్వనికి వశమైన ఒక్కొక్క గోపికయొక్క అభీష్టము తీరునట్లు సుఖమును కల్గించు శ్రీకృష్ణభగవానుడవగు నీవు వేంకటాచలములో అధివసించి యుండగా, నీకంటె వేఱొకనిని నేను భావింతునా!

(కలమ్) అనక్షరరసమైయుండుట. అక్షరము లేకుండ ఆనందమును కల్గించు వేణుధ్వని, శ్రీకృష్ణుడు ఊదు వేణువు యొక్క ధ్వనిని విని, దానిచే ఆకర్షింపబడిన నూఱుకోట్లు గోపికలు పరుగెత్తుకొనివచ్చి, శ్రీకృష్ణుని చుట్టుముట్టియుండుటను మొదటి పాదము తెలుపుచున్నది. దీనికి మూలము - "తూవలమ్బురి యుడైయ తిరుమాల్ తూయవాయిఱ్కుళలోశై వళియే కోవలర్ శిఱుమియర్ ఇళఙ్కొఙ్గై కుతుకలిప్ప ఉడలుళవిళ్న్దు ఎఙ్గుమ్ కావలుమ్ కడన్దు కయిఱు మాలైయాకి వన్దు కవిళ్న్దు నిన్ఱనరే" (పెరియాళ్వార్-3-6-1) (పవిత్రమైన పాంచజన్యాన్ని కల శ్రియఃపతియొక్క పరిశుద్ధమైన నోటినుండి వెలువడే వేణుగానాన్ని విని గోపికలు తమ లేత స్తనాలు కుతూహలాన్ని పొందగా, తమ శరీరంలోని ఇంద్రియాలు వశాన్ని తప్పి, కావలిని దాటివచ్చి వరుసగా నిలిచారు.) అను భట్టనాథసూక్తియే. "కలవేణురవస్య ఆవశాత్ కోటిః" అని, "కలవేణురవేణ అవశా శతకోటిః" అనియును విడదీయవచ్చును. వేణు ధ్వనికి మిక్కిలి వశపడిన గోపికల నూఱుకోట్లు - అని, వేణురవముచే తనకువశులైన గోపికల నూఱుకోట్లు-అనియు క్రమముగా భావము.

(స్మరకోటిసమాత్)-అందఱి మనస్సులో, ఆశను రేకెత్తించి, గుబులు కల్గించువాడు; గొప్ప అందమును కలవాడు మన్మథుడు. అట్టి కోటి మన్మథుల అందమును తానొక్కడే కలవాడు శ్రీకృష్ణుడు.

ఇట్టి అందమునకుగల ప్రయోజనము "ప్రతివల్లవికాభిమతాత్ సుఖదాత్" అను ప్రయోగముచే తెలుపబడినది. దక్షపుత్రికలగు అశ్విన్యాదులను ఇరువది ఏడుమందిని పెండ్లాడి, వారిలో ఒక్కరోహిణిని మాత్రమే ప్రేమించి, ఆమెకు మాత్రమే ప్రియుడై, మిగిలినవారికి అప్రియుడై, తత్ఫలముగా ఈనాటికిని శాపమును అనుభవించుచున్న చంద్రునివంటివాడు కాదు స్వామి. ఇంతటి అందమును కల్గి, పలువురు గోపికలను సమ్మోహనపఱచి, వారిలో ఒక్కొక్కరికిని అంతులేని ఆనందమును కల్గించువాడు శ్రీకృష్ణుడు.

(వసుదేవసుతాత్)-శ్రీకృష్ణుడు నల్లని వాడు, శత్రువులను నశింపజేయువాడు, భూదేవికి ఆనందమును కల్గించువాడు, నిరతిశయసుఖస్వరూపుడు-అను పరత్వమును తెలుపు తిరునామములకంటె, వసుదేవసుతుడను సౌలభ్యమును తెలుపు తిరునామమునే స్వామి

ఆదరించును.

ఇట్లు ద్వాపరయుగములో శ్రీకృష్ణుడై అవతరించిన దేవుడే ఈ కలియుగములో శ్రీవేంకటేశ్వరుడుగా సేవను అనుగ్రహించుచున్నాడు కావున ఆ స్వామిని తప్ప వేఱొకనిని భావింపను-అని తాత్పర్యము.

6. అభిరామగుణాకర! దాశరథే!
జగదేకధనుర్ధర! ధీరమతే ।
రఘునాయక! రామ! రమేశ! విభో!
వరదో భవ దేవ! దయాజలధే ॥

అభిరామగుణ+ఆకర=అభిలషింపతగిన సద్గుణములకు స్థానమైనవాడా!, దాశరథే=దశరథ పుత్రుడా!, జగదేకధనుర్ధర=లోకములో అద్వితీయుడవైన విలుకాడా!, ధీరమతే=కలతచెందని మనస్సును కలవాడా!, రఘునాయక=రఘుకుల నాయకా!, రామ=శ్రీరామా! రమా+ఈశ=(లక్ష్మీస్వరూపిణియగు) సీతకు ప్రభూ!, విభో=అంతటవ్యాపించియున్న వాడా!, దేవ=ప్రకాశించువాడా!, దయాజలధే=కరుణాసముద్రా!, వరదః భవ=వరములను ఇచ్చువాడవు కావలయును.

అంతట వ్యాపించి, ప్రకాశించు కరుణాసముద్రుడవై, దశరథ కుమారుడవై, సీతావల్లభుడవై, మనస్సున ఏ మాత్రము కలతను పొందనివాడవై, గొప్ప విలుకాడవై, శత్రువులను వధించి, రఘుకులమును ఉద్ధరించిన వేంకటేశ్వరా! నేను కోరు వరములను ఇచ్చుటలో నీకు ఏమి శ్రమ ఉన్నది!

(దయాజలధే)- ఈ సంబోధనవల్ల తమకు వరాన్ని ఇచ్చుటకు తగిన ముఖ్యమైన గుణము భగవానుని వద్ద ఉన్నదని సూచింపబడినది.

(అభిరామ!)- ఈ శ్లోకమునుండి మూడు శ్లోకములలో వేంకటేశ్వరుని శ్రీరామునిగా వర్ణించుచున్నారు.

(అభిరామగుణాకర!) మంచిగుణములకు నిధియైనవాడు. "ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్" (రామా.కిష్కిం-15-20) (హిమవత్పర్వతము, బంగారము, వెండి మొదలగువానికి, గైరికము మొదలగు ధాతువులకు ఆకరము అగునట్లు, శ్రీరాముడు సద్గుణములకు నిలయము, ఆ గుణములకుకూడ గొప్పతనమును కల్గించు మహిమను కలవాడుగనున్నాడు) అను తారవచన మిచట స్మరణీయము.

(దాశరథే!)-యోగులకు ఆనందమును కల్గించువాడను అర్థ మిచ్చు రామనామముకంటె, దశరథపుత్రుడను అర్థ మిచ్చుచు, సౌలభ్యగుణప్రకాశకమైన దాశరథి అను నామమే శ్రీరామునకు మిక్కిలి ఆదరణీయము.



(జగదేకధనుర్ధర!)- "ధనుర్వేదవిదాం శ్రేష్ఠః" (రామా-అయో-1-29) (ధనుర్వేదమును తెలిసినవారిలో గొప్పవాడు) అను సూక్తి గమనింపతగినది.

(ధీరమతే!)- "చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణామ్, హతాన్యేకేన రామేణ మానుషేణ పదాతినా" (రామా-ఆరణ్య-26-35) (వాహనారూఢులై వచ్చిన, భయమును కల్గించు పనులను చేయు పదునాల్గువేల రాక్షసులను, వాహనమును అధిరోహింపనివాడు, భూమిపై నిలచియున్నవాడును అగు శ్రీరాముడొక్కడే వధించెను) అనుటను బట్టి శ్రీరాముని ధీరత్వము ఎంతగొప్పదో తెలియనగును.

(రమేశ!)- సీతగా అవతరించిన మహాలక్ష్మికి ప్రభువైనవాడు. "రాఘవత్వే-భవత్సీతా" (విష్ణుపురా-1-9-44) (భగవానుడు రాముడై అవతరించినపుడు లక్ష్మీదేవి సీతగా అవతరించెను) అను వాక్యము గమనింపతగినది.

"విభుః" అనుపదమునకు అంతట వ్యాపించియున్నవాడని, అందఱిని నియమించి, శాసించువాడనియు గల రెండర్థములును శ్రీరాముడను శ్రియః పతియందు చక్కగా పొసగును.

"రమేశ", "దేవ" అను రెండు పదములను కలిపి, "లక్ష్మీవల్లభుడవై ప్రకాశించువాడా!" అను అర్థమును కూడ చెప్పవచ్చును. "ఉత్తమరాజకన్యయా అతీవ రామః శుశుభే" (రామా-బాల-77-36) (ఉత్తమ ప్రభువగు జనకుని కుమార్తె అయిన సీతచే శ్రీరాముడు మిక్కిలి ప్రకాశించెను) అను సూక్తితో ఈ అర్థము పొసగును. "దేవః" ప్రకాశించువాడు (వరదో భవ) నీవు వరములను ప్రసాదించువాడవు అగుము. ఆ వరమేమియో 10వ శ్లోకములో తెలియగలదు.

(దయాజలధే)- దీనిచే తమకు వరమును ఇచ్చుటకు తగిన ముఖ్యమైన గుణము భగవానునియందు పూర్ణముగానున్నదని తెలుపబడినది.

7. అవనీతయాకమనీయకరం
రజనీకరచారుముఖాంబురుహమ్ ।
రజనీచరరాజతమోమిహిరమ్
మహనీయ మహం రఘురామ మయే ॥

అవనీతనయా కమనీయకరం=భూమి పుత్రిక అగు సీతకు అభిలషింపతగిన శ్రీహస్తములను కలవాడవు, రజనీకర చారుముఖాంబురుహమ్=చంద్రునికంటె అందమైన, తామర పూవు వంటి ముఖమును కలవాడవు, రజనీచరరాజతమోమిహిరమ్=రాక్షసులకు నాయకుడగు రావణుడను తమస్సుకు సూర్యునివంటివాడవు, మహనీయమ్=పూజనీయుడవు అగు,

రఘురామమ్=రఘువంశరాముడవగు, నిన్ను, అయే=(శరణముగా) పొందుచున్నాను.

చంద్రునికంటె అందమైన నీ ముఖమును చూచి మోహించి, నీ శ్రీహస్తమును ఆశపడి గ్రహించిన సీతకొఱకు దుష్టరాక్షసుడగు రావణుడను చీకటిని నశింపజేసిన సూర్యునివంటివాడవు, బ్రహ్మ మొదలగు దేవతలచే పూజింపబడి, రఘుకులనాయకుడవై వెల్గు, శ్రీవేంకటేశ్వరుడవగు నిన్ను శరణు పొందుచున్నాను.

(అవనీతనయా)- జనకచక్రవర్తి యాగభూమిని నాగలితో దున్నుచుండగా, ఆనాగటి చాలునుండి ఉద్భవించినదగుటచే సీత అను పేరును భూమిసుత పొందినది. ఆ సీతాదేవి అభిలషింపతగిన శ్రీహస్తమును కలవాడు శ్రీరాముడు. "ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ, ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా" (రామా.బాల-73-33) (శ్రీరామా! నా కుమార్తె అగు ఈ సీత నీ వెంటనే ఉండి, ధర్మాచరణమును చేయునది. ఈమెను పరిగ్రహింపుము. నీకు శుభము కలుగుగాక! నీ హస్తముతో ఈమె హస్తమును పట్టుకొనుము) అనునట్లు విల్లును విఱచి, వీర్యమును ప్రదర్శించిన శ్రీరాముని శ్రీహస్తమునుకదా సీత ఆశపడినది.

(రజనీకర....అంబురుహమ్)- విలాసమునందు, ఎఱ్ఱనిరంగులో, తామరపూవువంటి శ్రీరాముని మోము చంద్రునికంటె అందమైనది. "చంద్రకాంతాననం రామం...న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః" (రామా-అయో-3-28) (చంద్రునికంటె అందమైన తిరుముఖమండలమును కల శ్రీరాముని దశరథుడు తన కెదురుగా వచ్చునపుడు దర్శించుచున్నను తృప్తిని పొందలేదు) అను శ్రీరామాయణసూక్తి దీనికి మూలము.

(రజనీకర...మిహిరమ్)-సూర్యుడు తనను విడచియుండని ప్రభాకారణముగా తమస్సును హరించును. శ్రీరాముడను సూర్యుడు తనను విడచియుండని సీత కారణముగా రావణుడనెడి రాక్షసరాజు అను చీకటిని హరించెను.

(మహనీయమ్)గౌరవింపతగినవాడు. రావణవధకు పిమ్మట బ్రహ్మాదిదేవతలు లంకకు వచ్చి "భవా న్నారాయణో దేవః" (రామా-యుద్ధ-120-13) (నీవు మానవుడవు కావు, సాక్షాత్తు నారాయణుడవు. దైవము) అనుచు ప్రారంభించి, స్తుతించిరి కదా! ఇట్టి శ్రీరాముడవై అవతరించిన నిన్ను శరణు పొందుచున్నానని తాత్పర్యము.

8. సుముఖం సుహృదం సులభం సుఖదం
స్వనుజం చ సుజాయ మమోఘశరమ్ ।
అపహాయ రఘూద్వహ మన్య మహం
న కథంచన కంచన జాతు భజే ॥



సుముఖం=అందమైన ముఖమును కలవాడు, సుహృదం=మంచి హృదయమును కలవాడు, సులభం=సులభముగా ఆశ్రయింపతగినవాడు, సుఖదం=ఆనందమును కల్గించువాడు, సు+అనుజం=మంచి తమ్ముని కలవాడు, సుజాయం=చక్కని భార్యను కలవాడు, అమోఘశరమ్ చ=రిక్తములు కాని బాణములను కలవాడును అగు, రఘూద్వహమ్=రఘుకులప్రధానుడవగు నిన్ను, అపహాయ=విడచి, అన్యం కంచన =వేఱెవ్వరిని, కథంచన=ఏ విధముగానైనను, న జాతు భజే=ఏ నాడును భజింపను.

మనస్సులో సద్భావము అందమైన ముఖములో వ్యక్తమగు వాడవై, నిన్ను ఏనాడును విడచియుండని గొప్పతనమునుకల లక్ష్మణునితో, పతివ్రత అగు సీతతో కలసి, అందఱికిని సులభుడవై, సేవను అనుగ్రహించి, ఆనందమును కల్గించువాడవై, ప్రత్యర్థులను గుఱి తప్పకుండ వధించు బాణములను సంధించు రఘుకులతిలకుడవైన వేంకటేశ్వరా! నీవు నన్ను స్వీకరింపకున్నను, నిన్ను తప్ప నేను వేఱొకరిని భజింపను.

(సుముఖమ్ సుహృదమ్) మంచి మనస్సును కలవారి ముఖము అందముగా నుండును. "మనస్సులోని భావము ముఖమున తెలియును" అందురు కదా! ఈ రెండింటిచే ఫలించిన అంశమును "సులభమ్" అను పదము తెలుపుచున్నది. ఆశ్రయించుటకు, ఆరాధించుటకును సులభుడని భావము. సులభుడైయుండి ఏమి చేయును? అను విషయమును "సుఖదమ్" అను పదము వివరించుచున్నది. ఆశ్రితులకు సుఖమును ఇచ్చుటయే సౌలభ్య ప్రయోజనమని భావము. దీనికంతటికిని కారణము భాగవతపురుష కారము, లక్ష్మీపురుషకారమును అను విషయము "స్వనుజమ్, సుజాయమ్" అను పదములద్వారా వ్యక్తము. తమ్మునకు, భార్యకునుగల మంచి ఏమనగా భగవానుని విడచియుండని స్వభావమే. "న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ" (రామా అయో-53-31) (రఘుకులతిలకా! నిన్ను విడచినచో సీత బ్రతుకదు. నేనుకూడ బ్రతుకను) అని లక్ష్మణుడు పల్కెనుకదా! సుఖమును ఇచ్చునపుడు విరోధులను పోగొట్టికదా. సుఖమును ఇవ్వవలెను. ఆ విరోధినిరసనమునకు తగిన, వట్టిపోని బాణములను కల్గియుండుటను "అమోఘశరమ్" అను విశేషణము తెలుపుచున్నది. "రఘూద్వహమ్" -రఘువంశ ప్రభువులను ఆ వంశములో తాను అవతరించి, ఉద్ధరించినవాడని భావము. ఇట్టి రాముడై అవతరించిన వేంకటేశ్వరుని తప్ప వేఱొకరిని సేవింపను అనుటను చివరగా తెల్పిరి.

"శోభనా జాయా యస్య సః" అను వ్యుత్పత్తిప్రకారము బహువ్రీహి సమాసములో జాయాశబ్దము చివర విధింపబడు "ని" అను సమాసాంత ప్రత్యయము అనిత్య(వైకల్పిక)మగుటచే, అది రాని రూపము "సుజాయః" అని అగును. వచ్చినచో, "సుజానిః" అని అగును.

9. వినా వేంకటేశం న నాథో న నాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి !
హరే! వేంకటేశ! ప్రసీద! ప్రసీద !
ప్రియం వేంకటేశ! ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥

వేంకటేశం వినా=శ్రీవేంకటేశ్వరుడు తప్ప, న నాథః న నాథః=నాథుడు లేనే లేడు, సదా =ఎల్లప్పుడు, వేంకటేశం= వేంకటేశ్వరుని, స్మరామి=స్మరామి=స్మరించుచున్నాను, హరే వేంకటేశ=పాపములను పోగొట్టు వేంకటేశా!, ప్రసీద ప్రసీద=(నాకు తప్పక అనుగ్రహింపుము, వేంకటేశ=వేంకటేశ్వరా! (ఐశ్వర్యమును అనుగ్రహించు స్వామీ!), ప్రియం=నేను కోరిన దానిని, ప్రయచ్ఛ ప్రయచ్ఛ=త్వరగా ఇమ్ము.

శ్రీవేంకటేశ్వరా! నీ వొక్కడవే నాథుడవు అని నిన్నే ఎల్లప్పుడు తలచియుండు నాపట్లదయజూపి, నేను కోఱిన ఫలమును ఇపుడే అనుగ్రహింపవలెను.

(వినా వేంకటేశమ్)- "నాథ్యతే ఇతి నాథః"-అభిలషింపబడు నాయకుడు. ఈ శ్లోకమునందలి మొదటిపాదము "వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి" (వేంకటేశునితో సమానమైన దైవం వేఱొకటి గతంలో లేడు, ఇపుడు లేడు, భవిష్యత్తులో కూడా లేడు) అను పురాణవచనమును అనుసరించినది. వేంకటేశ్వరునితో తులతూగు స్వామి ఇంతవరకు అవతరింపలేదు. ఇకపై అవతరింపబోవునదియును లేదు-అనునది దాని భావము. అందుచే, అతనినే ఎల్లప్పుడు స్మరించుచున్నాను-అని ద్వితీయ పాదముతో (అణ్ణన్) పల్కుచున్నారు. మూడవ, నాల్గవ పాదములు ఆ స్వామినే అభిలషించుచున్నట్లు తెలుపుచున్నవి. వానిచే దాసునిపట్ల దయజూపి, దాసుడు అభిలషించినదానిని త్వరగా అనుగ్రహింపవలెనని తెలుపబడినది. అభిలషించు విషయ మేది? అనుటను అనంతర శ్లోకములో వ్యక్తీకరించుచున్నారు.

10. అహం దూరత స్తే పదాంభోజయుగ్మ -
ప్రణామేచ్ఛయా-గత్య సేవాం కరోమి ।
సకృత్సేవయా నిత్యసేవాఫలం త్వం
ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో! వేంకటేశ ॥

ప్రభో! వేంకటేశ!=స్వామీ వేంకటేశ్వరా!, అహం=నేను, తే=నీ యొక్క, పద+అంభోజ యుగ్మప్రణామేచ్ఛయా=నీ పాదపద్మముల జంటను నమస్కరించు కోరికతో, దూరతః ఆగత్య=దూరమునుండి వచ్చి, సేవాం కరోమి=సేవను చేయుచున్నాను. సకృత్ సేవయా (ఈ) ఒక్కసారి సేవించుటచే, నిత్యసేవాఫలం=నిత్యముగా సేవించు ఫలమును, ప్రయచ్ఛ ప్రయచ్ఛ= తప్పక అనుగ్రహింపుము.



శ్రీవేంకటేశ్వరా! నీ పాదపద్మములకు నమస్కరించు ఆశతో చాలా దూరమునుండి వచ్చి, సేవించు నేను ప్రతిపర్యాయము చేయు సేవకు ఫలము నేను కోరిన దానిని ఎల్లప్పుడు సేవింపవలయును అనునదియే. అందుచే దానిని అనుగ్రహింపవలెను.

(అహం దూరత స్తే)-దాసుడనగు నేను చాలాదూరమునుండి (అనగా-శ్రీరంగము నుండి) ఆచార్యులగు మణవాళమహామునులతో వారికి ప్రియముగా నీ శ్రీపాదములను సేవింపవలెనని వచ్చి దర్శించుచున్నాను-అను భావము మొదటి రెండు పాదములందు వ్యక్తము. "అణ్ణన్ స్వామీ! మీరు ఎల్లప్పుడు సేవించుట నా వలన ఐహిక, ఆముష్మికము లకు వేఱు ఫలములను పొంది, నన్ను విడచి పోవుట కొఱకా?" అని భగవానుడు అడిగినట్లు తలచిన అణ్ణన్ అందులకు సమాధానమును ఉత్తరార్ధము ద్వారా తెలుపు చున్నారు. "నిన్ను ఏనాడును విడువకుండనుండి, నిత్యము సేవించునటయే ఈనాడు నేను చేయు సేవకు ఫలముగా దాసుడు కోరునది. దానిని శీఘ్రముగా అనుగ్రహింపుము"- అని భావము. ఇచట "నిత్యసేవాఫలమ్" అనుటకు "నిత్యసేవైవ ఫలమ్" అను అవధారణా పూర్వపదకర్మధారయ సమాసమును చెప్పనగును. దీనికిముందు "వరదో భవ"(6), "సుఖదమ్" అని వరముగా, సుఖముగా నిర్దేశింపబడినది ఈ నిత్యసేవయే. నిత్యసేవ అనగా ఇచట ఉన్నంతవరకు వేంకటేశ్వరుని నిత్యసేవ, ఈ శరీరమును విడచిన పిదప "సదా పశ్యంతి సూరయః" (సుబాలోపనిషత్-6) (నిత్యసూరులు ఎల్లప్పుడు భగవానుని సేవింతురు) అనునట్లు పరమపదములో నిత్యసేవయును. "ఉట్రేన్......ఈదే ఇన్నుమ్ వేణ్డువదు ఎన్దాయ్" (నిన్ను పొందాను... స్వామీ! ఇంకా నేను కోరేది ఇదే) అని ఆళ్వార్లు పల్కిరి కదా! "ఇన్టువన్దు ఇత్తనైయుమ్ అముదుశెయ్‌దిడ ప్పెరిల్.....పిన్నుమ్ ఆళుమ్ శెయ్‌వన్" (ఈనాడు నీవు దీనిని అంతటినీ ఆరగిస్తే.... తరువాత నేను ఇంకా ఇంకా కైంకర్యం చేస్తాను) అను నాచ్చియార్ (గోదాదేవి) శ్రీసూక్తియును ఇచట స్మరింపతగినది.

11. అజ్ఞానినా మయా దోషా నశేషాన్ విహితాన్ హరే! ।
క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైలశిఖామణే! ॥

శేషశైలశిఖామణే=ఆదిశేషపర్వతమునకు శిరస్సులో ధరించు మణివంటివాడా!, హరే = పాపములను పోగొట్టువాడా!, అజ్ఞానినా మయా=జ్ఞానములేని నాచే, అశేషాన్ = సమస్తములైన (ఏమియు మిగులకుండ అన్నియు) విహితాన్=చేయబడిన, దోషాన్ = దోషములను, త్వం=నీవు, క్షమస్వ=క్షమింపుము, త్వం క్షమస్వ=నీవు క్షమింపుము.

పాపమును చేసినచో నీవు దండింతువు అని తెలియక, దేనిని విడువకుండ చేసిన పాపములను అన్నిటిని నీవు పోగొట్టుము. దానివలననే సదా నీవు హరి అను

పేరును కల్గి, వేంకటాచలములో వేంచేసియున్నావు.

నిత్యసేవను అనుగ్రహించుటకు అవరోధముగా మీరు చేసిన కొండలవలె పేరుకొనియున్న పాపములున్నవి కదా! ఎట్లు అనుగ్రహింపగలను" అని భగవానుడు తలచుచున్నాడని భావించిన అణ్ణన్ అందులకు బదులును దీనిచే తెలుపుచున్నారు. ఇది పాపకార్యమని, చేసినచో నీవు దండింతువని తెలియక దాసుడు చేసినవానిని అన్నిటిని నీ క్షమకు విషయములుగా చేసి, పోగొట్టవలెను-అని విన్నపించి, అణ్ణన్ స్తోత్రపరిసమాప్తిని చేసిరి.

శ్రీవేంకటేశ స్తోత్రవ్యాఖ్య సంపూర్ణము

౦



# శ్రీవేంకటేశ ప్రపత్తి - వ్యాఖ్యానము

## అవతారిక

అణ్ణన్ శ్రీవేంకటేశ స్తోత్రమును పరిసమాప్తి చేసి, అవతారిక ప్రపత్తిని ప్రారంభించుచున్నారు. పూర్వము స్తోత్రములో "అజ్ఞానినా మయా దోషా నశేషా న్విహితాన్ హరే! క్షమస్వ త్వం, క్షమస్వ త్వం శేషశైలశిఖామణే" (11) అనుచు విరోధినివృత్తిని, "ప్రియం వేంకటేశ! ప్రయచ్ఛ ప్రయచ్ఛ" (10) అని ఇష్టప్రాప్తిని కల్గింపుమని ప్రార్థించిరి. అందులకు భగవానుడు "పాపనివృత్తిని, నిత్యసేవా ప్రాప్తిని ఊరకనే ప్రార్థించినచో చాలునా! వానికి ఉపాయముగా కర్మజ్ఞాన భక్తులలో దేనిని మీరు అనుష్ఠించిరి? ఫలమనునది ఉపాయసాధ్యమనుట మీకు తెలియదా!" అని ప్రశ్నించినట్లు తలచి, "స్వామి! వేంకటేశ్వరా! అజ్ఞానమును, అశక్తిని కలవాడను. విశేషించి సర్వాత్మనా నీకు పరతంత్రుడనగు నా వద్ద నీవు పల్కిన ఉపాయము లేమియు ఉండుటకు ప్రసక్తియే లేదు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (భగవద్గీతా-18-66) (కర్మజ్ఞానభక్త్యాది సకలధర్మములను- ఉపాయములను విడచి, (ఉపాయముగా భావించుటను విడచి), నన్ను ఒక్కని మాత్రమే ఉపాయముగా నిశ్చయముతో భావింపుము. నేను నిన్ను నన్ను చేరుటకు అడ్డుగా నున్న పాపములను అన్నిటినుండి నిన్ను విడిపింతును. శోకింపకుము) అని పూర్వము అర్జునుని వ్యాజముగా చేసికొని అనుగ్రహించుట దాసుని వంటివారికొఱకేకదా! అందుచే నీ శ్రీపాదములను మాత్రమే శరణముగా ఆశ్రయించుచున్నాను" అని సమాధానమును చెప్పి, అణ్ణన్ ఇందు ప్రపత్తిని అనుష్ఠించుచున్నారు.

1. ఈశానాం జగతో-స్య వేంకటపతేః విష్ణోః పరాం ప్రేయసీం
   తద్వక్షఃస్థలనిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్ ।
   పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
   వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

అస్య జగతః=ఈ జగత్తుకు, ఈశానాం=నాయకియు, వేంకటపతేః విష్ణోః = వేంకటాచలనాయకుడగు శ్రియఃపతికి, పరాం ప్రేయసీం=గొప్ప పత్నియు, తత్ వక్షఃస్థలనిత్యవాసరసికాం=ఆ స్వామి వక్షఃస్థలములో నిత్యము నివసించుటలో ఆశను కల్గినది, తత్ క్షాంతిసంవర్ధినీం=అతని క్షమను వృద్ధి పొందించునదియు, పద్మ+అలంకృత పాణిపల్లవయుగాం=కమలపుష్పములచే అలంకరింపబడిన, చిగుళ్ళవంటి కరముల జంటను కల్గినది, పద్మ+ఆసనస్థాం=తామరపూవు అనెడి ఆసనమునందున్నది, వాత్సల్య

+ఆదిగుణ+ఉజ్జ్వలాం=వాత్సల్యము మొదలగు గుణములచే ప్రకాశించునది, జగత్ +మాతరం =లోకమునకు తల్లి, భగవతీం=పూజింపతగినదియును అగు, శ్రియం= లక్ష్మీదేవిని, వందే=నమస్కరించుచున్నాను.

ఒక తామరపూవులో నిలచి, రెండు తామరపూవులను రెండు చేతులతో దాల్చి, శ్రీవేంకటేశ్వరుని వక్షఃస్థలములో నిత్యవాసమును చేయుచు, ఆ స్వామి ప్రేమకు పాత్రమైన పత్నియై, మనపట్ల గొప్ప వాత్సల్యమును కల్గి, మనకు తల్లియై, తండ్రి అగు భగవానుడు మన దోషములను చూచి కోపింపకుండునట్లు అతని క్షమను వర్ధిల్లజేసి, మనలను అతనితో చేర్పించునదియై, మనకు పూజనీయురాలగు నాయకియై వెలుగు లక్ష్మికి నమస్కరించుచున్నాను.

(ఈశానామ్..ప్రేయసీమ్)-ఈ ప్రయోగముచే "అస్యేశానా జగతో విష్ణుపత్నీ" (యజుర్వే-4-4-12) (ఈ లోకమునకు నాయకి, విష్ణువునకు పత్నియు అగుచున్నది) అను శ్రుత్యర్థము అనువదింపబడినది.

(తద్వక్షఃస్థల....రసికామ్)-దీనిచే లక్ష్మి మొట్టమొదటగా వక్షఃస్థలమును అధిరోహించి, వేంచేసియుండు సముద్రమును చిలికిన వృత్తాంతము, "ఫలేగ్రహి ర్హి కమలాభేన సర్వశ్రమః" (శ్రీరంగ.ఉత్తర-55) అనుచు భట్టర్ పల్కిన రీతిలోనే తన వక్షఃస్థలవాసముయొక్క రుచిని తెలిసి, ప్రీతితో వచ్చి, చేరిన పిరాట్టిని పొందుటచే సముద్రమును చిలికినపుడు తాను పడిన శ్రమ అంతయును ఫలించినట్లు భగవానుడు తలచిన వృత్తాంతమును స్మరింపజేయబడినది.

(తత్ క్షాంతిసంవర్ధినీమ్)- భగవానుని వక్షఃస్థలముయొక్క భోగ్యతను అనుభవించుటకు మాత్రమే వక్షస్సులో లక్ష్మీదేవి నివసించుట లేదు. భగవానుని శరణు పొందుటకు వచ్చు చేతనుల విషయమున వారి పాపములను చూచి అతనికి కల్గు కోపమును శాంతింపజేసి, అతనియందు అణగియున్న - పాపములను సహించుట అనెడి క్షమాగుణమును ఉద్బుద్ధము చేసి, బాగుగా వర్ధిల్లజేయుటకును ఆమె భగవానుని ఎదలో నివసించుచున్నదని దీనిచే తెలుపబడినది.

(పద్మాలంకృత.....పద్మాసనస్థామ్) - శ్రీవేంకటేశ్వరుని వక్షఃస్థలములో వేంచేసియుండు లక్ష్మీదేవికి రెండు చేతులు మాత్రమే అనుటను ఈ ప్రయోగము స్మరింపజేయుచున్నది. "ద్విభుజా వ్యూహలక్ష్మీః స్యాత్ బద్ధపద్మాసనప్రియా, శ్రీనివాసాంగమధ్యస్థా సుతరాం కేశవప్రియా" (వరాహపురా-పూర్వ-వేంకట-మాహా7వ అధ్యా) (పద్మాసనముగా పాదములను మడచియుంచుకొని, వేంచేసియుండుటలో అభినివేశమును కల్గినది, శ్రీనివాసుని దివ్యదేహముయొక్క మధ్యభాగము అగు వక్షఃస్థలములో వేంచేసి యుండునదియును, రెండు శ్రీహస్తములనుకల వ్యూహలక్ష్మి కేశవుడగు శ్రీనివాసునకు



మిక్కిలి ప్రియముగానున్నది) అనుటను గమనింపనగును.

(శ్రియమ్)-పురుషకారమును చేయుటకు మనచే ఆశ్రయింపబడునది, మనకు పురుషకారమును చేయుటకు భగవానుని ఆశ్రయించునది-అను శ్రీశబ్దవ్యుత్పత్తులు ఇచట వివక్షితములు.

(వాత్సల్యాదిగుణోజ్జ్వలామ్)- "నికరిల్ వాత్సల్యమ్ ఉజ్జ్వలమ్" (సాటిలేని వాత్సల్యం ఉజ్జ్వలం) (ఆచార్య-160) అని నుడువబడినరీతిలో శ్రీవేంకటేశ్వరునివద్ద ఆశ్రితుల దోషములను భోగ్యములుగా గ్రహించు స్వభావమగు వాత్సల్యము ఉజ్జ్వల మగుటకు కారణము ఈమె పురుషకారమే అగుటచే ఈమె వాత్సల్యాదిగుణములచే ఉజ్జ్వలమై యుండుట కైముతికన్యాయసిద్ధముకదా! (భగవతీమ్)-జ్ఞానము, శక్తి మొదలగు గుణములచే మహనీయురాలు-అని భావము.

భగవద్రామానుజులు గద్యత్రయములో శ్రీరంగనాథుని శరణు వేడునపుడు మొదట భగవన్నారాయణేత్యాది చూర్ణికతో శ్రీరంగనాయకి పురుషకారమగుటకు శరణు వేడినట్లే, వీరును అనంతరశ్లోకమునుండి వేంకటేశ్వరుని శరణు వేడబోవువారై. ఈ శ్లోకముతో ఆ స్వామి వక్షఃస్థలములో విశ్లేషింపలేకుండ నివసించు స్వభావమునుకల అలర్‌మేల్ మంగైను పురుషకారమగుటకై శరణు వేడుచున్నారు. "వన్దే" అనునదియు "శరణం ప్రపద్యే" అనునదియును పర్యాయములు.

2. శ్రీమన్! కృపాజలనిధే! కృతసర్వలోక!
సర్వజ్ఞ! శక్త! నతవత్సల! సర్వశేషిన్ !
స్వామిన్! సుశీల! సులభాశ్రితపారిజాత !
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీమన్=లక్ష్మిని ఏనాడును ఎడబాయనివాడా!, కృపాజలనిధే=కరుణాసముద్రా!, కృతసర్వలోక=లోకములను అన్నిటిని సృష్టించినవాడా!, సర్వజ్ఞ=అన్నిటిని తెలిసినవాడా!, శక్త=సామర్థ్యమును కలవాడా!, నతవత్సల=నమస్కరించువారిపట్ల వాత్సల్యమును కలవాడా, సర్వశేషిన్=అందరినుండి కైంకర్యమును స్వీకరించువాడా!, స్వామిన్=స్వామీ!, సుశీల=నీ గొప్పతనమును గణింపకుండ చాలా తక్కువవారితోకూడ కలియువాడా!, సులభ=పొందుటకు వీలయినవాడా!, ఆశ్రితపారిజాత=ఆశ్రయించినవారికి అన్నిటిని అనుగ్రహించు పారిజాతమా!, శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, (తవ) చరణౌ=(నీ) చరణములను, శరణం=శరణముగా, ప్రపద్యే=పొందుచున్నాను.

లక్ష్మీదేవిని వశము చేసికొన్న నీవు కరుణకు పరవశుడవై లోకములను సృష్టించి,

అన్నిటిని తెలిసికొని, తెలిసిన రీతిలోనే కార్యములను చేసి, పూర్తి చేయగల సామర్థ్యమును కలవాడవై అవతరించి, నమస్కరించువారినుండి ప్రేమతో సేవలను స్వీకరించి, స్వామివై, తక్కువవారితో కూడ కలసియుండి, ఆశ్రయించినవారికి అన్నిటిని ఇచ్చుచు, తిరుమలలో మొలచిన పారిజాతమా! అనునట్లు సులభుడవై యున్న శ్రీవేంకటేశ్వరా! నీ పాదములను శరణముగా పొందుచున్నాను.

ఇందు "తవ" అను పదమును అధ్యాహారము చేసి, దానిని "చరణౌ" అను దానితో కలిపి అర్థమును చెప్పనగును. పైనగల కొన్ని శ్లోకములందుకూడా ఈ ప్రకారమే అన్వయింపనగును.

ఈ శ్లోకములో ద్వయమంత్రము పూర్వఖండముయొక్క అర్థములు నిండియుండుట అనుభవింపదగినది. "శ్రీమన్!" అనుటచే ద్వయమంత్రం పూర్వఖండములో పురుషకార స్వరూపిణియగు లక్ష్మీదేవియొక్క నిత్యసంబంధము భగవానునకు కలదని తెలుపు "శ్రీమత్" పదముయొక్క అర్థము చెప్పబడినది.

ఆ లక్ష్మీదేవియొక్క పురుషకారముబలముచే (మన కొఱకు భగవానునివద్ద ప్రేమతో పల్కు మాటల ఔదార్యముచే) భగవానునియందున్న, ఆశ్రితుడగు పాపిని స్వీకరింపకుండ దండించుటకు కారణమైన నిరంకుశస్వాతంత్ర్యము అణగి, పిమ్మట ఆ ఆశ్రితుని అంగీకరించుటకు తగినట్లు తలఎత్తు గుణములను కలవాడని తెలుపు ద్వయములోని నారాయణశబ్దముయొక్క అర్థము ఇందు పలు పదములద్వారా సూచింపబడినది.

ఆ గుణములు ఆశ్రయణసౌకర్యాపాదకగుణములని, ఆశ్రితకార్యాపాదక గుణములనియు రెండు విధములు. మనము భగవానుని ఆశ్రయించుట అనునది మనకు సాధ్యమైన కార్యమే. అసాధ్యమగు కార్యము కాదు-అనుటను తెలుపు గుణములు మొదటివర్గములోను, ఆశ్రయించిన మన విరోధులను గ్రహించి, వానిని పోగొట్టి, అభీష్టమును నేఱవేర్చుటకు సహాయపడు గుణములు రెండవ వర్గములోను చేరును. మనము వెనుకంజ వేయకుండ, భగవానుని ఆశ్రయించుటకు, ఆశ్రయించిన మనలను అతడు తొలగ త్రోయకుండ స్వీకరించుటకు తగిన ఆతని మంచిగుణములని, ఆశ్రయించిన మన కార్యమును సఫలము చేయుటకు తగిన అతనికి యోగ్యమైన గుణములని వీనిని క్రమముగా గుర్తించుట తగును.

మనము భగవానుని ఆశ్రయింపకుండ తొలగిపోవుటకు కారణము భయము, సందేహము, అతృప్తి, అరుదుగానుండు స్వభావమును. వీనిని క్రమముగా వాత్సల్యము, స్వామిత్వము, సౌశీల్యము, సౌలభ్యము-అను గుణములు పోగొట్టి, మనలను స్వామిని



ఆశ్రయించునట్లు చేయును. భయమనగా పాపులమగు మనము భగవానుని ఆశ్రయించినచో, అతడు మనలను స్వీకరింపడు. అందులకు బదులుగా దండించియే తీరును-అని తలచినపుడు ˘ల్గునది. పాపములనెడి దోషములను భోగ్యములుగా-అనగా గుణములుగా స్వీకరించుట అనెడి అతని వాత్సల్యమును తలచినంతనే ఆభయము తీరును. సందేహమనగా-భగవానునకును, మనకును మధ్య ఏమి సంబంధము కలదు? అందుచే అతడు మన పనిని చేయునో! చేయడో! అనునదియే. మనకు కల్గు లాభనష్టములను తన లాభనష్టములుగానే భావించుటకు తగిన అతని స్వామిత్వమును (ఉభయవిభూతులకును నాయకుడైయుండు స్థితిని) భావింపగానే, ఆ సందేహము తీరును. అతృప్తి అనగా-అతడు మిక్కిలి తక్కువవారమగు మనకు మాత్రమే స్వామియా! బ్రహ్మాదిదేవతలకు, నిత్యసూరులకును స్వామి కదా! మిక్కిలి గొప్పవారగు వారి కార్యమును చేయునేగాని, మన కార్యమును అతడు ఎక్కడ చేయును! అను మానసికస్థైర్యము లేకుండుటయే. అతడు మిక్కిలి గొప్పవాడైనను, చాలా తక్కువ వారలమగు మనతో ఏ భేదమును లేకుండ కలసి ప్రవర్తించు స్వభావమగు అతని సౌశీల్యమును తలచినచో ఆ అతృప్తి తీరును. ఇన్ని ఉన్నను, అతడు మనకు కనుపించినచో కదా అతనిని ఆశ్రయింపగలము! "కణ్గళ్ కాణ్డఱ్కు అరియనాయ్" **(తిరువాయ్-3-6-11)** (కన్నులతో దర్శించడానికి సాధ్యం కానివాడు) అని అతడు చెప్పబడుచున్నాడే! అను అతని అలభ్యత్వమును - అనగా దర్శించుటకు వీలుకాని స్థితిని తలచినచో, పరమపదనాథుడు కన్నులకు కన్పించనివాడైనను, "పిన్నానార్ వణజ్గుమ్ శోది" **(తిరునెడు-10)** (అనంతర కాలంలోని వారు కూడా సేవించే జ్యోతిస్స్వరూపుడు) అను అర్చామూర్తియొక్క అందఱి కన్నులకు లక్ష్యభూతుడగు స్థితి అను సౌలభ్యము తలపునకు రాగానే ఆ అలభ్యత్వభావన తొలగును. ఇట్లు ఈ నాల్గు గుణములును పూర్వము తెల్పిన భయమును, సందేహమును, అతృప్తిని, అలభ్యత్వభావనను పోగొట్టి, భగవానుని మనము ఆశ్రయించుట సుకరమే-అని తెలుపుటచే ఇవి ఆశ్రయణసౌకర్యాపాదకగుణములగుచున్నవి. "సులభ!" అను విశేషణముయొక్క వివరణమే "శ్రీవేంకటేశ!" అను పదము. వేంకటాచలములో వానరములకును, వానితో సమానులగు వేటగాండ్రకును కన్పించువాడైయుండి, "అడిక్కీళ్ అమర్న్దు పుకున్దు అడియీర్ వాళ్మిన్" **(తిరువాయ్-6-10-11)** (నా పాదాలచెంత చేరి నిలిచి, ఓ దాసులారా! తరించండి!) అని తన హస్తముద్రతో చూపుచు నిలుచు స్వభావముకదా "శ్రీవేంకటేశ" అను పదముయొక్క ధ్వన్యర్థము.

ఇక, ఆశ్రితకార్యాపాదకములగు జ్ఞానము, శక్తి, ప్రాప్తి, పూర్తి, కృప-అను ఈ గుణములును ఈ శ్లోకములో తెలుపబడుటను గమనించెదము. తనను ఆశ్రయించిన

వాని విరోధియగు పాపము ఇది అని, అభీష్టము ఇది అని తెలిసికొనుటకు జ్ఞానము, తెలిసిన రీతిలోనే విరోధినిరసనము చేసి, అభీష్టమును నెఱవేర్చుటకు శక్తియు, ఆశ్రితుని స్వీకరించినచో, దానివలన కల్గు ఫలము తనదియే అనుటకు తగిన ప్రాప్తి అనెడి శేషిత్వము, ఆశ్రితుని కార్యమును సఫలము చేయునపుడు ఇతనివద్దనుండి ఏ ప్రతి ఫలమును ఎదురుచూడకుండుటకు తగిన పూర్తి అను ఆవాప్తసమస్తకామత్వము, ఇవి అన్నియు ఉన్నను ఆశ్రయించువాని దుఃఖమును చూచి దయ చూపనపుడు ప్రయోజనము లేకుండుటచే, ఇతరుల బాధను చూచి సహింపలేకపోవుట అనెడి కృపయు ఆశ్రయించు వాని కార్యమును సఫలము చేయుటకు ఆవశ్యకములు. కావున, ఆశ్రయింపబడు భగవానునివద్ద అవి తప్పక ఉండవలెను. ఈ శ్లోకములో "సర్వజ్ఞ" అని జ్ఞానము, "శక్త!" అని శక్తియు, "సర్వశేషిన్!" అని ప్రాప్తియు, "కృపాజలనిధే!" అని కృపయు నిర్దేశింపబడినవి. ప్రార్థించినవారికి అన్యవిషయములతో పాటు తననుకూడ అనుగ్రహించు ఔదార్యమును కలవాడు అను అర్థమిచ్చు "ఆశ్రితపారిజాత!" అను పదము నిర్ధనుని ఔదార్యము నిష్ప్రయోజకము. కావున, కోరిన అన్ని సంపదలను పూర్తిగా ఇవ్వగల్గిన పూర్తిని తెలుపుచున్నది.

ఇట్లు "శ్రీమన్!" అనుటచే ద్వయమంత్రములోని శ్రీమచ్ఛబ్దార్థమును, మిగిలిన పలు సంబోధనలచే నారాయణశబ్దార్థ మగు రెండు విధములైన గుణములను, "చరణౌ శరణం ప్రపద్యే" అను పదములు యథాతథముగా అనువదింపబడుటను దర్శించువారికి ఈ శ్లోకము ద్వయము పూర్వఖండముయొక్క వివరణము అనుట ప్రస్ఫుటమగును.

ఇక, ఇందలి "కృతసర్వలోక!" అనెడి సంబోధనకు శరణాగతిని చేయు ఈ ప్రకరణములో ఏమి ప్రసక్తి? అని అడుగనక్కఱలేదు. "కృపాజలనిధే!" అనుదానికి తరువాతి గల ఈ సంబోధన-కేవల కృపచే నా వంటివారితో పాటు, సర్వలోకములను సృష్టించిన నీవు శరణాగతిని చేయు దాసుని కార్యమును కూడ (నిత్యసేవను-అనగా-ఇచట నిత్యసేవను, పిమ్మట పరమపదములో సదా దర్శనమును) కేవల కృపతో నేఱవేర్పవలెను అను ప్రార్థనకు సూచకము. కావున, దీనికి ఇచట మిక్కిలి సంబంధము కలదని చెప్పుట తగును.

మఱియు, "శ్రీమన్! కృపాజలనిధే! కృతసర్వలోక!" అను ప్రయోగమును మాత్రము ప్రత్యేకముగా గమనించినచో, లక్ష్మీదేవిచే వర్ధిల్లజేయబడిన కృపకు సముద్రుడై, ఆ పిరాట్టియొక్క క్రీడార్థము భగవానుడు సర్వలోకములను సృష్టించునను అర్థము స్ఫురించు అవకాశము కలదు. "అణ్డాన్.....సహస్రమకరో త్తాన్ భూర్భువ స్సర్వతః శ్రీరంగేశ్వరదేవి! తే విహృతయే సంకల్పమానః ప్రియః" (శ్రీగుణ-19) (శ్రీ రంగనాయకీ! నీ భర్త నీ విలాసము కొఱకే సంకల్పించి, భూలోకభువర్లోకసువర్లోకాదులను అన్నిటిని కల్గిన అండములను సృష్టించెను) అని భట్టర్ పల్కుట ఇచట స్మరణీయము.



3. ఆనూపురార్పితసుజాతసుగంధిపుష్ప -
సౌరభ్యసౌరభకరౌ సమసన్నివేశౌ ।
సౌమ్యౌ సదా-నుభవనే-పి నవానుభావ్యౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, ఆనూపుర+అర్పిత=పాదనూపురములవరకు అర్పింపబడిన, సుజాతసుగంధిపుష్పసౌరభ్య=మంచిజాతికి చెందినవి అగుటచే సుగంధమునుకల పుష్పముల పరిమళమునకును, సౌరభకరౌ=పరిమళమును కల్గించునవి, సమసన్నివేశౌ = ఒక దానితో వేఱొకటి తగియున్నవి, సౌమ్యౌ=మంగళకరమ్మైనవి, సదా+అనుభావ్యౌ = నిత్యనూతనములుగా అనుభవింపతగినవియును అగు, చరణౌ=(నీ) చరణములను, శరణం ప్రపద్యే=రక్షకముగా పొందుచున్నాను.

వేంకటేశ్వరా! మంగళకరములై, ఒకదానికి వేఱొకటి పొందికగా తగియున్న అందమును కల్గినవియై, దృష్టిని మరల్పకుండ సేవించుచున్నను తృప్తిని కల్గింపకుండ, ఇంకను సేవింపవలెనని తోచునవి, సమర్పించిన పిదపనే ఇవి మంచిజాతికి చెందిన పుష్పములు అను సుగంధమును వెదజల్లుచున్నవి అని తోచునట్టి పుష్పములచే, ఇక చాలునని తోచకుండ నూపురములుకూడ కనపడకుండ మఱుగుపడునట్లు అర్చన చేయబడిన నీ శ్రీపాదములను శరణు పొందుచున్నాను.

(సుజాతసుగంధిపుష్పసౌరభ్యసౌరభకరౌ)-సుగంధమును వీచు మంచి జాతి పుష్పముల సుగంధమునకుకూడ వేంకటేశ్వరుని శ్రీపాదములు సుగంధమును కల్గించుట అనగా - "సర్వగంధః" (ఛాందో-3-25) (అన్ని విధములైన సుగంధములను కలవాడు) అని చెప్పబడువాని శ్రీపాదములగుటచే, పరిమితి కల్గినవి, నాశనమును కల్గినవియు అగు ప్రాకృతపుష్పముల సుగంధమునకు, అంతులేనిది, అనశ్వరమైనదియు అగు తన వివిధములైన అప్రాకృతసుగంధములను కల్గియుండు స్వభావమును కల్గించుటయే.

(సదానుభావ్యే -పి నవానుభావ్యౌ) "ఎప్పొళుదుమ్ నాళ్ తిజ్గళ్ ఆణ్డూళియూళితొఱుమ్ అప్పొళుదైక్కు ప్పొళుదు ఎన్నారావముదమే" (తిరువాయ్-2-5-4) (దినాలు, మాసాలు, ఏండ్లు, కల్పాలు కల్పాల తరబడిగా ఎప్పటికప్పుడు అతృప్తామృతమై ఉండే వాడా!) అనునట్లు ఎంతకాలము అనుభవించినను అనుభవించిన పూర్వశ్రీపాదములుగా తోపకుండ, నూతనములుగా భాసించుటకు కారణమైన, అప్రాకృతమైన అందమును కల్గియున్న శ్రీపాదములని అర్థము. "క్షణే క్షణే య న్నవతా ముపైతి తదేవ రూపం

రమణీయతాయాః" (మాఘ-64-17) (ఏ వస్తువు ప్రతిక్షణము నూతనత్వమును పొందు చున్నదో అదియే నిజమైన అందము యొక్క రూపము) అను సూక్తి ఇచట స్మరింపతగినది.

ఇట్టి వస్తువు సంస్కృతజ్ఞులు "ఆసేచనమ్" అను పదముతో వ్యవహరింతురు. "తత్ ఆసేచనకమ్ తృప్తేః నాస్తి అంతః యస్య దర్శనాత్" అని అమరకోశవచనము. (ఏ వస్తువును చూచుచున్నపుడు చూడవలెనను ఆశ తీరదో, (చూచినది చాలునని తలపు కలుగదో), ఆ అందమైన వస్తువు ఆ సేచనకమనబడును) గమనింపనగును. తృప్తి అనగా ఆశ.

4. సద్యోవికాసిసముదిత్వరసాంద్రరాగ -
సౌరభ్యనిర్భరసరోరుహసామ్యవార్తామ్ ।
సమ్యక్షు సాహసపదేషు విలేఖయంతౌ
శ్రీవేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, సద్యః వికాసిసముదిత్వర=అపుడే వికసించుటకు ఆరంభించి, ఇంకను వికసించు స్వభావమును కల్గినవియై, సాంద్రరాగ=మిక్కిలి ఎఱ్ఱనివియై, సౌరభ్య నిర్భర సరోరుహ=సువాసన నిబిడముగా (నిండుగా) నున్న తామరపూలతో, సామ్యవార్తామ్ అపి=(ఆ శ్రీపాదములు) సాటియైనవి అను చెప్పుటను కూడ, సమ్యక్షు సాహసపదేషు = గొప్ప మొరటుతనమునకు లక్ష్యము అగు కార్యములలో (ఒకటిగా), విలేఖయంతౌ వ్రాయునట్లు చేయగల, చరణౌ=(నీ) శ్రీపాదములను, శరణం ప్రపద్యే=శరణు పొందు చున్నాను.

శ్రీవేంకటేశ్వరా!, బాగుగా ఎఱ్ఱనివియై, వికసించుచు, గుత్తిలోనే ఉండి సువాసనను నిండుగాకల తామరపూలతో ఈ శ్రీపాదములు పోలినవిగా నున్నవా? అని సందేహపూర్వకముగా పల్కినను, ఆ మాటకూడ గొప్ప మొరటుతనములలో ప్రధానమైనది అని చెప్పదగినట్లున్న, ఎఱ్ఱని, సువాసనను వెదజల్లుచు, వికసించిన నీ శ్రీపాదములను శరణు వేడుచున్నాను.

ఇందు "సముదిత్వర" శబ్దము "సమ్, ఉత్" అను రెండు ఉపసర్గలతో కూడిన "ఇణ్-గతౌ" అను ధాతువునకు స్వభావార్థమున "క్వరచ్" ప్రత్యయము చేరగా, నిష్పన్నమైనరూపము. ఇది సరోరుహ పదమునకు విశేషణము. దీనిని "సమ్-ఉత్-ఇత్వర" అని, "సమ్, ఉదిత్వర" అని, "సముదిత్వర" అని గ్రహించి, అందము, సౌకుమార్యము, సౌగంధ్యము మొదలగునవి బాగుగా వర్ధిల్లి, ఇంకను మరింతగా వృద్ధి చెందు స్వభావమునుకల తామరపూలు అని, బాగుగా ఉదయించు (వృద్ధి చెందు) స్వభావమును కల తామరపూలు అని, సముదాయముగా (రెండు శ్రీపాదములకును ఉపమానముగా చెప్పునట్టి రెండును ఒకటిగా చేరి) నుండుటయే స్వభావముగాకల శ్రీపాదములని క్రమముగా అర్థమును చెప్పుట తగును.



ఇందు శ్రీవేంకటేశ్వరుని శ్రీపాదములకు ఉపమానముగా చెప్పుటకు తామరపూవులను శిక్షించుచున్నారు. అపుడే వికసించునవిగా అవి ఉండవలెను; రెండును ఒకటిగా చేరియుండవలెను; మిక్కిలి ఎఱ్ఱనివియై యుండవలెను; సుగంధమును నిండుగా కల్గియుండవలెను-అని వానిని ఇంతటి అరుదైన అంశములను కల్గియుండవలెనని పల్కి, వానిని శ్రీపాదములకు ఉపమానముగా పలుకవచ్చునా? అని ఆలోచించినచో, అట్లు కూడ పలుకరాదు. ఆ విధముగా ఒక వేళ పల్కినచో, అది సాహసవచనము (ఆలోచింపకుండ మొరటుతనముతో పల్కు మాట) అని భగవానుని శ్రీపాదములను మనము సేవించి మాత్రముననే మనకు శిలాశాసనమువలె నిశ్చయము కల్గును అనుటను "సమ్యక్షు సాహసపదేషు విలేఖయంతౌ" అను ప్రయోగముద్వారా తెలిపిరి. "కట్టురై క్కిల్ తామరై నిన్ కణ్పాదమ్కై యొవ్వా" (తిరువాయ్-3-1-2) (వివరించి పల్కితే తామరపూవు నీ నేత్రాలకు, శ్రీచరణాలకు, కరాలకు సాటిరాదు) అను నమ్మాళ్వార్ల శ్రీసూక్తిని ఇచట స్మరింపనగును.

5. రేఖామయధ్వజసుధాకలశాతపత్ర-
వజ్రాంకుశాంబురుహకల్పకశంఖచక్రైః ।
భవ్యై రలంకృతతలౌ పరతత్త్వచిహ్నైః
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, రేఖామయ=రేఖలరూపములోని, ధ్వజసుధాకలశ+ఆతపత్ర వజ్ర+అంకుశ+అంబురుహకల్పకశంఖచక్రైః=ధ్వజము, అమృతకలశము, గొడుగు, వజ్రాయుధము, అంకుశము, పద్మము, కల్పవృక్షము, శంఖము, చక్రము-అనెడి, భవ్యైః మంగళకరములగు, పరతత్త్వచిహ్నైః=పరతతత్త్వమునకు ఉండతగిన లక్షణములతో, అలంకృతతలౌ=అలంకరింపబడిన క్రింది భాగమునుకల, చరణౌ=(నీ) శ్రీపాదములను, శరణం ప్రపద్యే=రక్షకముగా ఆశ్రయించుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! నీ అరికాళ్ళలో శంఖచక్రపద్మాదుల ఆకారములు రేఖారూపముననుండుటచే నీవే పరతత్త్వమని నిశ్చయించి, నీ శ్రీపాదములను శరణు పొందుచున్నాము.

పెరియాళ్వార్ "ఒరు కాలిల్ శఙ్గు ఒరు కాలిల్ శక్కరమ్ ఉళ్ళడి పొఱిత్తమైన్ద ఇరు కాలుఙ్కొణ్డు అఙ్గఙ్గెళుదినాప్పోల్ ఇలచ్చినై ప్పుడనడన్దు" (పెరియా-1-7-6) (ఒక పాదంలో శంఖం, ఇంకొకపాదంలో చక్రంయొక్క చిహ్నాలను కల రెండు పాదాలను మోపి ఆయాచోట్ల తూలికతో రాసినట్లుగా గుర్తులు పడేటట్లు నడచి) అనియు,

ఆళవన్దార్ "కదా పునః" (31) అను శ్లోకముతో "త్రివిక్రమా! శంఖచక్రకల్పకధ్వజారవిందఅంకుశ వజ్రలాంఛనములను కల నీ పాదపద్మయుగము దాసుని శిరస్సును ఎపుడు అలంకరింప గలదో కదా! అనియు పల్కిన రీతిలోనే అణ్ణన్‌కూడ వేంకటేశ్వరుని శ్రీపాదములు ధ్వజసుధాకలశాది సల్లక్షణములతో కూడి వెలుగుచున్నవి - అని ఈ శ్లోకమున తెలుపు చున్నారు. ఇవి అన్నియు పరమాత్మకు తగిన లక్షణములు. కావున, పరమాత్మ అగు శ్రీమన్నారాయణుడే తిరుమలలో వేంకటేశ్వరుడుగా దర్శన మిచ్చుచున్నాడని చెప్పబడి నట్లయినది. "మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్, స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే" (శేషధర్మమ్-వేంక.మా-48-13) (ఆశ్చర్యకరమగు శక్తిని గల శ్రీమన్నారాయణుడు గొప్ప ఆనందమును కల్గించు, ఉన్నతమగు పరమపదమును విడచి, (మనము ఉజ్జీవించుటకు తిరుమలలో) స్వామిపుష్కరిణీతీరమున లక్ష్మితో కూడి ఆనందించుచున్నాడు) అనెడి పురాణశ్లోక మిచట అనుసంధేయము.

6. తామ్రోదరద్యుతిపరాజితపద్మరాగౌ
బాహ్యై ర్మహోభి రభిభూతమహేంద్రనీలౌ ।
ఉద్యన్నఖాంశుభి రుదస్తశశాంకభాసౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, తామ్ర+ఉదరద్యుతిపరాజిత=ఎఱ్ఱని, లోపల భాగములోని కాంతితో జయింపబడిన, పద్మరాగౌ=పద్మరాగమణులను కల్గినవి, బాహ్యైః మహోభిః = బయుట గల కాంతులచే, అభిభూతమహేంద్ర నీలౌ-జయింపబడిన ఇంద్రనీలమణులను కల్గినవి, ఉద్యత్ నఖ+అంశుభిః=పైకి ప్రసరించు నఖముల కిరణములచే, ఉదస్తశశ +అంకభాసౌ=తిరస్కరింపబడిన చంద్రకాంతులను కల్గినవియు అగు, చరణౌ=(నీ) చరణములను, శరణం ప్రపద్యే=శరణు పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! నీ అరికాళ్ళలోని ఎఱ్ఱని కాంతిలచే పద్మరాగరత్నములు, బయటి నల్లని కాంతులచే ఇంద్రనీలమణులు, నఖముల తెల్లని కాంతులచే చంద్రుడును జయింపబడి పరుగెత్తగా, నేను మాత్రము పోకుండ నిలచి, నీ పాదములను ఆశ్రయించు చున్నాను.

ఈ శ్లోకములో "ఉద్యన్నఖాంశుభిః ఉదస్తశశాంకభాసౌ" అనుటకు తగినట్లు "సౌందర్యాసారామృతసింధువీచిశ్రేణీషు పాదాంగుళినామికాసు, న్యక్కృత్య చంద్ర శ్రియ మాత్మకాంత్యా నఖావళీ శుంభతి సుందరస్య" అనెడి సుందబాహుస్తవ శ్లోకము (67) అనుసంధేయము. తిరుమాలిరుమ్‌శోలైలోని సుందరబాహుస్వామి దివ్యదేహశోభ అనెడి



అమృతసముద్రములోని కెఱటముల వరుసలా! అని ఉత్ప్రేక్షించునట్లు ఉన్న-ఆ స్వామి శ్రీపాదముల వ్రేళ్ళలోని నఖముల వరుసలు తమ కాంతులతో చంద్రుని కాంతిని జయించి వెల్గుచున్నవి-అని ఆ శ్లోకభావము. ఎల్లప్పుడు వృద్ధి చెందుచు, తరుగుచూనుండి, పూర్ణుడై యున్న పౌర్ణమినాడుకూడ కళంకముతో ఇంచుమించుగా సగభాగము కాంతి తగ్గియున్న చంద్రుని ప్రాకృతమైన కాంతికంటె, వృద్ధిచెందుట, ఏనాడు తరుగుట లేక కళంకరహితమైనది, సదా పూర్ణమైనది అగు భగవానుని శ్రీపాదనఖముల అప్రాకృతమైన కాంతి చాలా గొప్పది-అని భావము.

7. సప్రేమభీతికమలాకరపల్లవాభ్యాం
సంవాహనే-పి సపది క్లమ మాదధానౌ ।
కాంతా వవాఙ్మనసగోచరసౌకుమార్యౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, సప్రేమభీతి=ఆశతో, భయముతో, కమలాకరపల్లవాభ్యాం= లక్ష్మీదేవి చిగురువంటి రెండు కరములతో, సంవాహనే అపి=మెల్లగా పట్టుకొని ఒత్తవలెనని తాకినంతలోనే, సపది=వెంటనే, క్లమం=శ్రమను, ఆదధానౌ=పొందినవి, కాంతౌ= అందమైనవి, అవాఙ్మనసగోచరసౌకుమార్యౌ=వాక్కుకు, మనస్సునకును అందని మార్దవమును కల్గినవి అగు, చరణౌ=(నీ) శ్రీపాదములను, శరణం ప్రపద్యే=రక్షకముగా పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! లోకములను కొలచి, లంకలో నడచి అలసి సొలసిన నీ శ్రీపాదములను పుష్పములో అవతరించిన నీ దేవేరి అగు లక్ష్మీదేవి తన చిగుళ్ళవంటి చేతులతో పట్టుకొనవలెనను ఆశను, పట్టుకొన్నచో ఎక్కడ వాడిపోవునో! ఏమో! అను భయమును మాటి మాటి కలుగగా, ఒకసారి పట్టుకొనుట, వెంటనే విడచుట వంటి స్థితిని పొంది, "ఏమి ఈ పాదముల సౌకుమార్యము!" అని వాక్కుతో వర్ణించుటకు, మనస్సుతో తలచుటకును సాధ్యముగానట్టి సౌకుమార్యమును కల నీ శ్రీపాదములను (నేను శరణు పొందినచో వాడిపోవు అను నిశ్చయముతో) శరణు పొందుచున్నాను.

భగవానుని శ్రీపాదములను సంవాహనము చేయవలెనను ఆశ, స్పృశించినచో వాడిపోవునోమో! అను భయము లక్ష్మీదేవికి స్వరూపప్రయుక్తముగను, గుణప్రయుక్తము గను కల్గుచున్నవి. స్వరూప మనగా-భగవానుకు తాను పత్నియైయుండు సహజమైన స్థితి. గుణమనగా-భగవానుని శ్రీపాదములందున్న నిరతిశయసౌకుమార్యము. నాయకుని పాదములను సంవాహనమును చేయవలెనను ఆశ, పట్టుకొన్నచో కందిపోవునేమోనను భయమును అతనికి నాయకిగానున్న పిరాట్టి స్వరూపము కారణముగా కల్గునవి. మిక్కిలి మృదువైన పాదములను సంవాహనము చేయవలెనను ఆశయు, తాను అట్లు సంవాహనము

చేసినచో వానికి శ్రమ కల్గునేమో అను భయమును లక్ష్మీదేవికి ఆ శ్రీపాదములందున్న సౌకుమార్యము అను గుణము కారణముగా కల్గుచున్నవని గ్రహింపనగును.

ఇట్లు ఆశ, భయము మాఱి మాఱి కలుగగా, చివరకు ఆశ భయమును జయింపగా, లక్ష్మీదేవి స్వామి శ్రీపాదములను పట్టుకొనుటచే అవి కందిపోయినవి అనుటను అణ్ణన్ "సపది క్లమ మాదధానౌ" అను ప్రయోగముద్వారా తెలుపుచున్నారు. లక్ష్మీదేవి కరసౌకుమార్యముకంటె, స్వామి పాదముల సౌకుమార్యము అధికము అనునదియే ఇచటి కవి తాత్పర్యము.

ఇందులకు మాఱుగా భట్టర్ అనుగ్రహించిన విషమున ఇక గమనించెదము. "యద్బృందావనపండితమ్" అని ప్రారంభమగు శ్రీరంగరాజస్తవ - పూర్వశతక శ్లోకము(124)లో శ్రీరంగనాథుని శ్రీపాదములకు "లక్ష్మీకరసౌఖ్యసాక్షి" అనెడి ఒక విశేషణము కలదు. శ్రీరంగనాథుని శ్రీపాదయుగ్మము లక్ష్మీదేవి శ్రీహస్తముల స్పర్శవలన సుఖమును అనుభవించుచున్నవని ఈ సూక్తి భావము. ఇది "లక్ష్మ్యాః కరస్పర్శజాత సుఖస్య సాక్షీ, అనుభవితా, పాదసంవాహనకాలే ఇతి భావః" (లక్ష్మిదేవి యొక్క కరస్పర్శవల్ల కల్గిన సుఖానికి సాక్షి - అనుభోక్త - శ్రీచరణాల సంవాహన సమయంలో - అనిభావం) అనెడి సంస్కృత వ్యాఖ్యానము వలన స్పష్టమగును. లక్ష్మీదేవియొక్క శ్రీహస్తములు తమను తాకుటను ముందు భగవానుని శ్రీపాదములు వాడి బాధపడినవి అని, అవి తాకిన పిమ్మట, సుఖమును పొందినవి అనియు దీని అర్థము. భగవానుని శ్రీపాదములకంటె లక్ష్మీదేవి శ్రీహస్తములు మిక్కిలి సుకుమారములనుట ఇచట కవి తాత్పర్యము.

ఇట్లు కొన్నిచోట్ల భగవానుని గొప్పతనమును తెలుపుట, మఱికొన్ని సందర్భములలో లక్ష్మీదేవి ఔన్నత్యమును పల్కుటయును అనుభవరసికులకు ఒక అద్వితీయమైన విందు అగును. అది అట్లుండనిండు.

భగవానుడు శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రములో "పుష్పహాసః" అను నామముతో కీర్తింపబడుచున్నాడు. పుష్పముయొక్క హాసమువంటి హాసమును (శోభను) కలవాడని దీని అర్థము. హాసమనగా - వికాసము. వికసించు కాలములో చూచువారి మనస్సులో ఆనందమును కల్గించు పుష్పముయొక్క సౌకుమార్యము.

ఇట్టి సౌకుమార్యము భగవానుని తిరుమేని అంతయు వ్యాపించియుండుననుట "రంగభర్తు రపి లోచనచర్యాం సాహసావళిషు లేఖయమానమ్, పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్య మతివాఙ్మనసం నః" (శ్రీరంగ పూ.శ-88) అనుచు భట్టర్ అనుగ్రహించుటనుబట్టి తెలియుచున్నది. సేవించు వారి కన్నులు నిశితముగా



చూచినచో, అదికూడ మొఱటు పనులలో ఒకటిగా శిలాక్షరముగా లిఖింపబడునట్లు చేయునది, తిరునామమునకు కారణమైనది అగు "పుష్పహాసః" అను తిరునామమును కల్గించు శ్రీరంగనాథుని తిరుమేని సౌకుమార్యము మన వాక్కుకు, మనస్సునకును అందనిది- అని ఈ శ్లోకభావము.

ఇట్లు దివ్యదేహమంతయు వ్యాపించియున్నట్లు భట్టర్ అనుగ్రహించిన సౌకుమార్యమును-ప్రతివాదిభయంకరం అణ్ణన్ "సప్రేమభీతి" అను ఈ శ్లోకములో శ్రీపాదములలోనున్నట్లు పల్కిరి.

"వడివిణైయిల్లా మలర్మకళ్ మత్ర నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై" (రూపంలో సాటిలేని లక్ష్మీదేవి, మఱియు భూదేవి సంవాహనం చేసే మృదువైన శ్రీచరణాలు) (తిరువాయ్-9-2-10) అను నమ్మాళ్వార్ల శ్రీసూక్తియు, "అవర్కళుమ్ తిరువడికళై ప్పిడిక్క పువ్వాల్ పూ త్తొడువార్పోలే కన్నుకిన్దదో! ఎన్ను కూశి త్తొడవేణ్డుమ్పడియాయ్త్తు సౌకుమార్య మిరుప్పదు" (వారు కూడా శ్రీపాదాలను తాకబోతే పూవులను తాకేవారి వలె - కందిపోతాయేమో! - అని సంశయించి స్పృశించవలసినట్లుగా పాదాల సౌకుమార్యం ఉంటుంది) అను అచటి ఆచార్యుల వ్యాఖ్యాన సూక్తియును ఇందులకు మూలముగా భావింపనగును.

8. లక్ష్మీమహీతదనురూపనిజానుభావ -
నీళాదిదివ్యమహిషీకరపల్లవానామ్ ।
ఆరుణ్యసంక్రమణతః కిల సాంద్రరాగౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, లక్ష్మీమహీతదనురూపనిజ+అనుభావనీళా+ఆది=లక్ష్మీదేవి, భూదేవి, వారిరువురను పోలిన, మాఱని మహిమనుకల నీళాదేవి మొదలగు, దివ్యమహిషీ = గొప్ప దేవేరులయొక్క, కరపల్లవానామ్=చిగుళ్ళవంటి చేతులయొక్క, ఆరుణ్య సంక్రమణతః కిల=ఎఱ్ఱని రంగుయొక్క సంక్రమణముచే (సోకుటచే), కాబోలు, సాంద్రరాగౌ=మిక్కిలి దట్టమైన ఎఱ్ఱని రంగును పొందిన, చరణౌ=(నీ) చరణములను, శరణం ప్రపద్యే=శరణు పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! సహజముగా కొంచెము ఎఱ్ఱగానున్న నీ శ్రీపాదములు మిక్కిలి ఎఱ్ఱనివై తోచుటకు, శ్రీదేవి, భూదేవి,నీళాదేవి మొదలగు నీ పత్నులు తమ చిగుళ్ళ వంటి చేతులతో సంవాహనము చేయునపుడు, ఆ చేతులనుండి ఎఱ్ఱని కాంతులు ప్రసరించుట కారణమైయుండవచ్చునని ఉత్ప్రేక్షించునట్లు ఉన్న నీ శ్రీపాదములను శరణుపొందుచున్నాను.

ఈ శ్లోకార్థమునకు అనుగుణముగా "వందారుబృందారకమౌళిమాలా యుంజానచేతఃకమలాకరేభ్యః, సంక్రాంత రాగా వివ పాదపద్మౌ శ్రీరంగభర్తుః మనవై నవై చ" (శ్రీరంగపూర్వ-123) అనెడి భట్టర్ శ్రీసూక్తిని అనుసంధింపనగును. తనను నమస్కరించునపుడు దేవతల (ఎఱ్ఱని రంగునుకల మణులచే పొదగబడిన) కిరీట సమూహములు, తనను ధ్యానించునపుడు యోగుల రాగముతో (ఎఱ్ఱని రంగుతో) కూడిన మనస్సులు, తనను సంవాహనము చేయునపుడు దేవేరి అగు లక్ష్మీదేవియొక్క శ్రీహస్తములు అను వీనినుండి రాగము సంక్రమించినదా! ఏమి! తలచునట్లున్న శ్రీరంగనాథుని శ్రీపాదపద్మములను దాసుడనగు నేను ధ్యానింతును; స్తుతింతును కూడ- అనునది ఈ శ్లోకార్థము. భగవానుని శ్రీపాదములు సహజముగానే ఎఱ్ఱనివి అయినను, కవుల వైఖరికి తగినట్లు ఇట్లు హేతూత్ప్రేక్ష చేయబడినది.

9. నిత్యానమద్విధిశివాదికిరీటకోటి -
ప్రత్యుప్తదీప్తనవరత్నమహఃప్రరోహైః ।
నీరాజనావిధి ముదార ముపాదదానౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, నిత్య+అనవద్యవిధిశివ+ఆది=ఎల్లప్పుడును నమస్కరించునట్టి బ్రహ్మ, శివుడు మొదలగువారియొక్క, కిరీటకోటి=కిరీటముల అగ్రములలో, ప్రత్యుప్త =పొదగబడిన, దీప్త=ప్రకాశించునట్టి, నవరత్న=తొమ్మిదిరత్నములను కల్గిన, మహఃప్రరోహైః=మొలˇలవంటి కాంతులతో, ఉదారం=గొప్పదైన, నీరాజనావిధిం=హారతిని పట్టుటను, ఉపాదదానౌ=స్వీకరించునట్టి, , చరణౌ=(నీ) చరణములను, శరణం ప్రపద్యే =రక్షకముగా ఆశ్రయింతును.

శ్రీవేంకటేశ్వరా! బ్రహ్మాదిదేవతలు నిన్ను తమ శిరస్సులతో నమస్కరించునపుడు వారి కిరీటాగ్రములలో పొదగబడిన నవరత్నముల కాంతులు ప్రసరించుటచే,వానిని తనకు కర్పూరహారతిగా స్వీకరించుచున్నవా! అనునట్లున్న నీ శ్రీపాదములను శరణు పొందుచున్నాను.

ఈ శ్లోకార్థమునకు అనుగుణముగా "మనుకులమహీపాలవ్యానమ్రమౌళి పరంపరామణిమకరికారోచిర్నీరాజితాంఘ్రిసరోరుహః" (శ్రీరంగరాజ-ఉత్త-77) అని భట్టర్ అనుగ్రహించుటను స్మరింపనగును. మనుకులములో జన్మించిన ప్రభువుల నమస్కరించిన (శిరస్సులలో నున్న) కిరీటముల వరుసలలో, ఆడుచేపల ఆకారమున పొదగబడిన మణుల కాంతులచే హారతి ఇవ్వబడిన శ్రీపాదములను కలవాడు శ్రీరంగనాథుడు-అనునది ఈ శ్లోకార్థము.



10. విష్ణోః పదే పరమ ఇత్యుదితప్రశంసౌ
యౌ మధ్వ ఉత్స ఇతి భోగ్యతయా-ప్యుపాత్తౌ ।
భూయ స్తథేతి తవ పాణితలప్రదిష్టౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, యౌ=ఏ శ్రీపాదములు, "విష్ణోః పరమే పదే" ఇతి "శ్రీమహావిష్ణువుయొక్క గొప్ప శ్రీపాదములందు" అని, ఉదితప్రశంసౌ=గొప్పవిగా (వేదముచే) చెప్పబడిన కీర్తిని కల్గినవి, మధ్వ ఉత్స ఇతి=ఏవి తేనెను స్రవించుచోటో అని, భోగ్యతయా అపి=అనుభవింపతగినవిగా, ఉపాత్తౌ=(వేదముచే) చెప్పబడినవో, భూయః =తిరిగి, తథా ఇతి=ఇవి అట్టివే అని (ఇపుడు), తవ=నీ, పాణితలప్రదిష్టౌ=(కుడి) చేతితో చూపబడినవో, తౌ చరణౌ=ఆ (నీ) శ్రీపాదములను, శరణం ప్రపద్యే=శరణు పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! నీ కుడిచేయి, "వేనిని విష్ణువు యొక్క శ్రీపాదములు మిక్కిలి గొప్పవి అని, తేనెను స్రవించుటచే అది అందఱిచే అనుభవిపతగినవి అని వేదము కీర్తించుచున్నదో, అవియే ఇవి" అని ఎత్తి చూపునట్లున్న నీ శ్రీపాదములను, శరణు చెందుచున్నాను.

"విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (విష్ణుసూక్త-5) (గొప్పదైన, మధువును స్రవించే విష్ణువు చరణాలలో) అనెడి శ్రుత్యర్థ మిచట అనుసంధింపబడినదనుటను శ్లోకములోని పదములనుబట్టియే సులభముగా గ్రహింపవచ్చును. విష్ణువుయొక్క గొప్ప శ్రీపాదములనుండి మధుప్రవాహము ప్రవహించుచున్నదని దీని అర్థము. తామరపూవునుండి తేనె స్రవించునట్లే, స్వామి శ్రీపాదముల నుండియు తేనె స్రవించును-అని భావము.

"నా పాదములు మిక్కిలి గొప్పవి అని, మధువును స్రవించుటచే మిక్కిలి భోగ్యములని వేదమువలన ఈనాటికిని వినుచున్న ఓ భక్తులారా! ఎపుడైనను మీరు వానిని దర్శింపవలదా! ఇదిగో వానిని చూపుచున్నాను చూడుడు" అనుచు వేదమయమగు పర్వతముపై వేంచేసియున్న వేదప్రతిపాద్యుడగు శ్రీవేంకటేశ్వరుడు వేదముచే పొగడబడుతన శ్రీపాదములను తన కుడిచేతితో చూపుచు, ముందు చెప్పిన శ్రుతి వాక్యమును సత్యము చేయుచున్నాడు-అని భావము.

ఈ మధు ప్రవాహము శ్రీపాదముల కాంతిప్రవాహమే ననుటను కూరేశులు "శ్రేయః కిరంతు కిరణాః చరణారవిందనిష్యందమానమకరందరసౌఘదేశ్యాః, తజ్జ్ఞాః శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతాః" (అతిమానుష-2) అని పల్కుటను గమనింపనగును. శ్రీరంగనాథుని శ్రీపాదములనుండి ప్రవహించు మధుప్రవాహమువంటివి, వేదములవలన తేనె ప్రవాహమని తెలిసికొనబడునవియును అగు ఆ శ్రీపాదములనుండి వెలువడు

కిరణములు మనకు మంచిని విస్తరింపజేయుగాక- అనునది ఈ శ్లోకార్థము. ఆ శ్రీపాదముల నుండి ప్రవహించు మధుప్రవాహమే గంగ అయినది అని పెద్దలు చెప్పుటయును కలదు.

11. పార్థాయ తత్సదృశసారథినా త్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి ।
భూయో-పి మహ్య మిహ తౌ కరదర్శితౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా, పార్థాయ= అర్జునునకు, తత్ సదృశసారథినా=అతనికి తగిన సారథియైన, త్వయా ఏవ=(శ్రీకృష్ణుడవై అవతరించిన) నీచేతనే, శరణం వ్రజ ఇతి=(వీనిని) శరణముగా పొందుము అని, యౌ స్వచరణౌ=ఏ నీ శ్రీపాదములు, దర్శితౌ = చూపింప బడినవో, భూయః అపి=మరల కూడ, ఇహ=ఈ తిరుమలలో, మహ్యం=నాకు, త్వయా ఏవ =వేంకటేశ్వరుడవై అవతరించిన నీచేతనే, కరదర్శితౌ=కుడి చేతితో చూపింపబడినవో, తౌ=అట్టి, తవ చరణౌ=నీ శ్రీపాదములను, శరణం ప్రపద్యే=రక్షకముగా పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా!, నీ శ్రీపాదములను పూర్వము అర్జునునకు "శరణు పొందుము" అని నీచే చూపబడినవో, వానినే ఈనాడు నాకు "శరణు పొందుము" అని చూపుచున్నావు. కావున, అర్జునుడు ఆశ్రయించి ఫలమును పొందినట్లే, నేను కూడ ఫలమును పొందుటకు అట్టి నీ శ్రీపాదములను శరణు పొందుచున్నాను.

(తత్సదృశసారథినా) - అర్జునునకు తగిన సారథి. అర్జునుని పట్ల ప్రేమను కల సారథి. కర్ణునిపట్ల స్నేహము లేని సారథియగు శల్యునివలెకాక, అర్జునునిపట్ల మిక్కిలి ప్రేమను కలవాడు శ్రీకృష్ణుడని తాత్పర్యము. "తాళ్న్ద తనఞ్జయఱ్కాకి తరణియిల్ మణిత్తిన్‌తేర్ ఊర్న్దవన్" (పెరియాళ్వార్ తిరు-1-9-4) (శరణాగతి చేసిన అర్జునుని కోసం భూమిపై అందమైన, దృఢమైన రథాన్ని నడపినవాడు) అనునపుడు "ఆకి" అనుటకు "పక్షపాతియాయ్" అని శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన అర్థమే ఇచట అణ్ణన్ "సదృశ" అను పదముతో సూచించిరని చెప్పనగును.

అర్జునుడు, శ్రీకృష్ణుడును నరనారాయణుల అవతారములుగా చెప్పబడుటచే శ్రీకృష్ణుడు అర్జునునకు తగిన సారథిగా చెప్పబడెననియు చెప్పవచ్చును. పూర్వము నరుడు శిష్యుడై క్రింద ఉండగా, నారాయణుడు ఆచార్యుడై ఉన్నతస్థానముననుండి తిరుమంత్రమును ఉపదేశించెను. ఇపుడు నరావతారమగు అర్జునుడు రథియై ఉన్నత



స్థానమున నుండగా, నారాయణావతారమగు శ్రీకృష్ణుడు సారథియై క్రిందనిలచి, చరమశ్లోకమును ఉపదేశించెను అనెడి వ్యత్యాసము గమనింపతగినది. నరుడు నారాయణునకు తగిన శిష్యుడైనట్లే, శ్రీకృష్ణుడును అర్జునునకు తగిన సారథి అయ్యెనని భావము.

శ్రీకృష్ణుడు పార్థుని ఉద్దేశించి "మా మేకం శరణం వ్రజ" (గీత-18-65) (నన్ను ఒక్కని మాత్రమే శరణు పొందుము) అనుచు తననే రక్షకముగా ఆశ్రయింపుమని విధించెనే కాని, తన శ్రీపాదములను ఆశ్రయింపుమని విధింపలేదు కదా! అందుచే ఈ శ్లోకములో తన శ్రీపాదములను రక్షకముగా ఆశ్రయించునట్లు చూపెననుట ఎట్లు పొసగును! అనినచో, పల్కెదము.

ఈ చరమశ్లోకమనెడి విధియొక్క అనుష్ఠానమును తెలుపు ద్వయమంత్రములో "శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే" అనుచు వేదపురుషుడు శ్రీపాదములనే రక్షకముగా ఆశ్రయించినట్లుండుటచే తను, పరమవైదిక శిఖామణులగు నమ్మాళ్వార్లును, తిరుమఙ్గై ఆళ్వార్లును క్రమముగా "తిరువేఙ్గడత్తానే! ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుకున్దేనే" (తిరువాయ్ 6-10-10) (శ్రీవేంకటేశా! నీ చరణాల చెంత చేరి నిలచాను) అని, "ఆళివణ్ణా! నిన్నడియిణై అడైన్దేన్ అణిపొళిల్ తిరువరఙ్గత్తమ్మానే" (సముద్రవర్ణా! అందమైన శ్రీరంగంలో నివసించేస్వామీ! నీ చరణద్వయిని ఆశ్రయించాను) (పెరియ తిరు-5-8-1) అనుచు శ్రీపాదములనే తాము రక్షకముగా ఆశ్రయించినట్లు సాయించుట చేతను, శ్రీయామునులు "త్వత్పాదమూలం శరణం ప్రపద్యే" (స్తోత్రరత్న-22) (నీ పాదమూలాన్ని శరణువేడాను) అని, భగవద్రామానుజులు "శ్రీమన్నారాయణ త్వత్పాదమూలం శరణ మహం ప్రపద్యే" అనియు శ్రీపాదములనే శరణముగా ఆశ్రయించుటచేతను, ఇట్లు వేద, వైదికపురుషులు అనుష్ఠానమునకు తగినట్లు వేదవేద్యుడగు శ్రీకృష్ణుడు పల్కిన చరమశ్లోకమునందుకూడ "మామ్" అనుటకు "నన్ను" అను అర్థమును చెప్పవీలున్నను "నా పాదములను" అని తెలుపుట శ్రీకృష్ణుని ఉద్దేశ్యమైయుండవచ్చునని తలచియే ఇచట అణ్ణన్ "యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి" అని శ్రీకృష్ణుడు తన శ్రీపాదములను ఆశ్రయించునట్లు చూపెనని పల్కిరి. విధివాక్యమైన చరమశ్లోకము, దాని అనుష్ఠాన వాక్యములును పోలియుండ వలయును కదా!

శేషిపట్ల శేషభూతుడు చేరు చోటు (రేవు) శ్రీపాదములే అగుటచే, ఆ శ్రీపాదములనే రక్షకముగా ఆశ్రయించుట వేద, వైదిక పురుషుల అనుష్ఠానము కావున, నా పాదములను రక్షకముగా ఆశ్రయింపుమనుటకు సందేహించి, నన్ను ఆశ్రయింపుమని పల్కుట వేదవేద్యుడగు భగవానుని విధిగా అమరియుండుట మిక్కిలి తగినదియే.

12. మన్మూర్ధ్ని కాళియఫణే వికటాటవీషు
శ్రీవేంకటాద్రిశిఖరే శిరసి శ్రుతీనామ్ ।
చిత్తే-ప్యనన్యమనసాం సమ మాహితౌ తౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, మన్మూర్ధ్ని=నా తలయందు, కాళియఫణే=కాళియుని పడగ యందు, వికట+అటవీషు=కఠినములగు అడవులలో, శ్రీవేంకటాద్రిశిఖరే=శ్రీవేంకటాచల శిఖరముపై, శ్రుతీనాం శిరసి=వేదశిరస్సు అనబడు ఉపనిషత్తులలో, అనన్యమనసాం = నిన్నే తలచు మనస్సునుకలవారియొక్క, చిత్తే అపి=మనస్సులోకూడ, సమం=ఒకే విధముగా, ఆహితౌ=ఉంచబడిన, తే చరణౌ=నీ శ్రీపాదములను, శరణం ప్రపద్యే=రక్షకముగా పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! నిన్నే ధ్యానించు ఆళ్వార్లవంటి మహనీయుల మనస్సులో, వారు ఆదరించి కీర్తించు వేదాంతములలో, ఆ వేదము పొగడు శ్రీవేంకటాచల శిఖరములో, ఇట్టి గొప్పతనము ఏమియు లేని నా తలపై, క్రూరకాళియుని తలపై, భయంకరములగు అడవులలో, ఏ విధమైన వ్యత్యాసమును గణింపక నీవు ఉంచిన నీ శ్రీపాదములను నేను శరణు జొచ్చుచున్నాను.

(మన్మూర్ధ్ని) చాల నీచుడనగు నా తలపై-అని భావము. పూర్వము వేంకటేశ స్తోత్రములో "అపరాధశతైః భరితమ్" (3) అని "అజ్ఞానినా మయా దోషా నశేషా న్విహితాన్" (11) అని తమను అజ్ఞానిగా, దానివలన ఏమియు మిగల్చకుండ అన్ని పాపములను నిండుగా కల్గినవానినిగా తమనుగూర్చి నైచ్యానుసంధానమును చేసిరికదా అణ్ణన్! దానికి అనుగుణముగానే ఇచట "మన్మూర్ధ్ని" అనుచు మిక్కిలి నీచుడనగు నాయొక్క తలపైకూడ తన శ్రీపాదములను ఉంచితివి కదా! అవి విస్మయపడుచున్నారు.

(కాళియఫణే)-"దుష్టకాళియ తిష్ఠ" అని ప్రసిద్ధి పొంది, యమునానదికి చెందిన ఒక మడుగును తన విషాగ్నితో దూషితము చేసి,అందు స్నానము చేయుటకు, అందలి నీటిని తాగుటకును వీలులేకుండునట్లు గోపాలురకు ఉపద్రవమును కల్గించిన దుష్టుడగు కాళియుని తలపై- "కాళియన్ పొయ్కై కలఙ్గ ప్పాయ్న్దిట్టు అవన్ నీణ్ ముడి యైన్దిలుమ్ నిన్ఱు నడఞ్జెయ్దు" (పెరియాళ్వార్-3-9-7) (కాళియుడు ఉండే సరస్సు కలత పొందేటట్లు దూకి, అతని ఉన్నత శిరస్సులు ఐదింటిపై నిలచి నాట్యం చేసి) అని, "కాలాల్ కాళియన్ తలై మిదిత్తదుమ్" (పెరుమాళ్-7-9) (కాళ్ళతో కాళియుని శిరస్సులను అణగదొక్కడం) అనియును దివ్యసూరులు పల్కిన తీరులో నీవు నీ శ్రీచరణము లను ఉంచితివికదా! అనుచున్నారు. భగవానుడు మానవజాతికి



అనుగ్రహించిన జ్ఞానమును ఉపయోగించి, సన్మార్గమున పయనింపకుండ చెడ్డనే చేయుచున్న తమకంటె, సర్పజాతిలో జనించి జ్ఞానలేశమునుకూడ లేకుండుటచే తెలియనితనముతో దౌష్ట్యమును చేసిన కాళియుడు ఉన్నతుడు-అనునది కవి హృదయము. మిగిలిన వారియందును ఈ రీతిలోనే భావింపనగును.

(వికటాటవీషు) కారడవులలో-అని అర్థము. "మానమరుమెన్నోక్కి వైదే వియిన్ తుణైయా...కానమరుమ్ కల్లదర్పోయ్ క్కాడుఱైన్ద పొన్నడిక్కళ్" (పెరియ-11-5-1) (జింక కన్నులవంటి అందమైన నేత్రాలను కల సీతాదేవి వెంటరాగా అరణ్యంలో శిలామయమార్గంలో పోయి వాసం చేసిన శ్రీచరణాలు) అని తిరుమఙ్గైమన్నన్ పల్కిన రీతిలో శ్రీరామావతారములో, "కుడైయుమ్ శెరుప్పుమ్ కొడాదే తామోతరనై నాన్ ఉడైయుమ్ కడియన ఊన్ఱు వెమ్పరల్కళుడై క్కడియ వెఙ్కానిడై క్కాలడి నోవ క్కన్ఱిన్ పిన్ కొడియేన్ ఎన్ పిళ్ళైయై ప్పోక్కినేన్" (పెరియాళ్వార్ తిరు-3-2-9) (గొడుగును, చెప్పులను ఇవ్వకుండా దామోదరుని నేను వేడిగా ఉండేది, కఠినమైనది, శిలలతో నిండినదైన అడవిలోకి అరికాళ్ళు కాలే రీతిలో పశువుల వెంట, కఠినురాలనైన నేను పంపాను) అనుచు యశోదాభావనతో పెరియాళ్వార్లు అనుగ్రహించిన రీతిలో శ్రీకృష్ణావతారములో ముళ్ళు, రాళ్ళు నిండిన అరణ్యములో శ్రీచరణములను మోపుటయా! అని అణ్ణన్ విద్ధులగు చున్నారు. తెలిసియో, తెలియకనో దౌష్ట్యమును చేసిననందులకు కారణమైన చైతన్యమును కల కాళియునికంటె అచేతనమైన అరణ్యములు గొప్పవి-అని కవి భావన.

(శ్రీవేంకటాద్రిశిఖరే) - "పొన్నై మామణియే! అణియార్న్దదోర్ మిన్నై వేఙ్గడత్తుచ్చియిల్ కణ్డు పోయ్" (పెరియ-10-1-2) (బంగారంవలెస్పృహణీయమైన వాడు, అందం నిండిన సాటిలేని మెఱపు తీగవంటి ఉజ్జ్వల స్వరూపి అయిన స్వామిని వేంకటాద్రిలో సేవించి) అనియు, "ఎన్దాయ్! తణ్ తిరువేఙ్గడత్తుళ్ నిన్ఱాయ్!" (తిరువాయ్ మొళి-2-6-9) (స్వామీ! చల్లని వేంకటాద్రిలో నిలిచి ఉండేవాడా!) అనియును దివ్యసూరులు అనుగ్రహించినట్లు తిరుమల శిఖరములో శ్రీపాదములను మోపుటయా! అనుచు కవి ఆశ్చర్యపడుచున్నారు. ఈ లోకములోనున్న ప్రాకృతమగు అరణ్యములకంటె శ్రీవైకుంఠములోనుండి గరుడునిచే తీసికొనిరాబడినట్లు పురాణములలో చెప్పబడుచున్న అప్రాకృతమైన శ్రీవేంకటాచలము గొప్పది-అని కవి ఆశయము.

(శ్రుతీనాం శిరసి)-"నిత్యం శ్రూయతే ఇతి శ్రుతిః" ఎల్లప్పుడు వినబడు చుండుటచే వేదమునకు శ్రుతి అను పేరు కల్గినది. ఎవనిచేతను వ్రాయబడుటకు

ముందు వినబడకుండనుండి, వ్రాయబడిన పిమ్మటనే వినబడుచున్న ఇతర గ్రంథములవలెకాక, అన్ని కాలములయందు ఒకే విధముగ వినబడుచుండుటచే శ్రుతి అని పేరును కల్గిన వేదము అపౌరుషేయమని, నిత్యమని, నిర్దోషమనియు కీర్తింపబడుచున్నది. దాని పూర్వ భాగము కర్మకాండ మనియు, ఉత్తరభాగము బ్రహ్మకాండమనియు వ్యవహరింపబడు చున్నవి. ఇచట "శ్రుతీనాం శిరసి" అనుటచే వేదములందు తలవలె ఉన్నతమైన, ఉత్తరభాగమైన బ్రహ్మకాండము సూచింపబడినది. "వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః" (గీత-15-15) - (పూర్వోత్తర భాగములగు వేదములన్నిటిచే నేనే తెలియబడుచున్నాను) అని భగవానుడు స్వయముగా అనుగ్రహించుటచేతను, "సర్వే వేదాః యత్పద మామనంతి" (కఠోప-2-15) (వేదములన్నియు ఏ భగవత్స్వరూపమును తెలుపుచున్నవో) అని ఉపనిషత్తు ఘోషించుచుండుటచేతను వేదములన్నిటియందు భగవానుడు ప్రతిపాదింప బడుచున్నను, (భగవానుని శ్రీపాదములచే అంకితమైయున్నను) శ్రుతిశిరస్సు అగు ఉపనిషత్తు అనెడి బ్రహ్మకాండమునందు మాత్రము ఆ పరమాత్మ శ్రీపాదములు మోపబడియున్నట్లు పల్కుట పూర్వభాగములోకంటె ఉత్తరభాగమగు బ్రహ్మకాండములోగల ప్రాధాన్యమునుబట్టియే. కర్మకాండములో కర్మలచే ఆరాధింపబడుచున్న అగ్ని, ఇంద్రుడు మొదలగు దేవతలకు అంతర్యామిగా భగవానుడు మఱుగుపఱచి ప్రతిపాదింపబడుట చేతను, బ్రహ్మకాండములో-అనగా ఉపనిషత్తులలో అన్నిచోట్ల భగవానుడు సాక్షాత్తుగానే ప్రతిపాదింపబడినట్లు చెప్పబడుటచే తను ఉత్తరభాగమగు శ్రుతిశిరస్సు పూర్వభాగము కంటె ప్రధానమైనది. దీనిని భగవద్రామానుజులువారు శ్రీభాష్యారంభశ్లోకములో "శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే" అనుటద్వారా వ్యక్తీకరించిరి. "శ్రుతౌ దీప్తే, శ్రుతిశిరసి విదీప్తే" అనుచు అభిజ్ఞులగు పెద్దలు దీనిని విడదీసి వివరించిరి. శ్రుతిలో అనగా పూర్వభాగములో అంతర్యామిగా మఱుగుపఱుపబడియుండుటచే కొంచెముగానే ప్రకాశించుచున్నట్లు, ఆ శ్రుతి శిరస్సులో, అనగా ఉత్తర భాగములో అధికముగా స్పష్టముగా ప్రకాశించుచున్నట్లును ఉన్నవాడు శ్రీనివాసుడగు పరబ్రహ్మము-అనునది పై సూక్తిభావము. శ్రీరంగామృతకవియు "ఓదియ వేదత్తిన్ ఉట్పొరుళాయ్ అదనుచ్చి మిక్క శోదియై" (ఇరామా-85) (అధ్యయనం చేసే వేదంలోని అంతరార్థమై, దాని శిరస్సులలో గొప్పగా ప్రకాశించే జ్యోతివి) అని అనుగ్రహించిరి. అట్టి గొప్ప వేదశిరస్సులో భగవానుడు స్పష్టముగా తెలియబడుటను చూచి "శ్రుతిశిరస్సులో నీవు నీ శ్రీపాదములను మోపితివి" అని కవి పల్కిరి. ఆళవన్దార్ "యన్మూర్ధ్ని మే శ్రుతి శిరస్సు చ భాతి...పాదారవింద మరవిందవిలోచనస్య" (స్తోత్రరత్న-7) అని అనుగ్రహించుటను



అనుసరించుచు అణ్ణన్‌కూడ "మన్మూర్ధ్ని" అని, "శ్రుతీనాం శిరసి" అనియు అనుగ్రహించుట గమనింపతగినది. ముందు పల్కిన వేంకటాచలముకంటె, దానిని ఉన్నతముగా కీర్తించునట్టి "అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే, శిరింబిఠస్య సత్వభిః తేభిష్ట్వా చాతయామసి" (ఋ.8-8-13-1) మొదలగు శ్రుతులు ఉన్నతములని కవి హృదయము. ప్రమాణముచేకదా ప్రమేయమగు వేంకటాచలముయొక్క గొప్పతనము వ్యక్తమగును. "ఓ సంసారియైన జీవుడా! నీవు సంపదలేనివాడవుగా, గ్రుడ్డివాడవుగా, పలు తాపములను (తాపత్రయములను) కలవాడవుగా, శత్రువులను కలవాడవుగానున్నచో, (ఆ కొఱతలన్నియు తీరుటకు) శ్రీనివాసుని తిరుమల క్షేత్రమునకు ఆ స్వామి భక్తులతో కలసి, పొమ్ము. అట్లు వెడలి, ఆ భక్తుల మూలముగానే నీమనోరథమును భగవానుని సన్నిధిలో ప్రార్థించి, పొందుము. లేక, వారి మూలముగానే నీవు నిన్ను ఆ స్వామికి సమర్పించుకొనుము" అనుచు పూర్వోదాహృతమగు ఋక్కుకు భగవద్రామానుజులవారు అనుగ్రహించిన అర్థమును శ్రీవేంకటాచలేతిహాసమాలలోని మొదటి స్తబకము చివరలో చూడనగును.

(అనన్యమనసాం చిత్తే)- "అన్యస్మిన్ మనః యేషాం తే, అన్యమనసః, అన్యమనసః న భవంతి ఇతి అనన్యమనసః"-వేఱొక నీచవిషయములో తమ మనస్సును ప్రవర్తింప నీయకుండ, భగవానునియందే మనస్సును లగ్నము చేయు మహనీయుల చిత్తమున-అని అర్థము. వారు ఎట్టివారు అనగా, "ముళువేళులకు ముణ్డాన్ ఉకన్దు వన్దడియేనుళ్ పుకున్దాన్ అకల్వాను మల్లనిని" (తిరువాయ్-2-6-7) (ముల్లోకాలను ఆరగించినవాడు ఆనందంతో వచ్చి దాసుడనైన నాలో ప్రవేశించి, ఇక నిన్ను విడచివెళ్ళనని అన్నాడు) అనునట్లు భగవానుడు తమ చిత్తములలో ప్రవేశించియుండగా, ఆ స్వామినే "ఉణ్ణుమ్ శోఱు పరుకుమ్ నీర్ తిణ్ణుమ్ వెట్రిలైయుమ్" అనునట్టి ధారకపోషక భోగ్యములుగా, "శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయుమ్" (అందమైన కన్నులను కల కాంతలు, గొప్పసంపద, మంచి సంతానం, ఇంకా తల్లి తండ్రి) అనునట్లు సర్వవిధబంధువుగా, మిగిలిన అన్ని పురుషార్థములుగా, వానికి తగిన ఉపాయముగా భావించిన నమ్మాళ్వార్ మొదలగు దివ్యసూరులు, "నిత్య మచ్యుత పదాంబుజయుగ్మరుక్మవ్యామోహతః తదితరాణి తృణాయ మేనే" (శ్రీవైకుంఠస్తవ-1) అని పూర్వాచార్యులు పల్కినట్లు వైకుంఠము, వేంకటాచలము, తిరుమాలిరుమ్‌శోలై మొదలగు దివ్యదేశములలో వేంచేసియుండు సన్నివేశముతోనే స్వామి తమ చిత్తమును ఆదరించి, అభిమానించి, స్వస్థానముగా స్వీకరింపగా, బంగారమువలె ఆశపడతగిన అతని శ్రీపాదములను ఆశించి, వానినే చింతించి, బాహ్యావస్తువులను తృణప్రాయములుగా తలచి, నిరాదరించిన భగవద్రామానుజులు,

"శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే, సర్వలోకనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్" (మంగళాశాసనమ్613) అనుచు అణ్ణన్ తామే అనుగ్రహించినట్లే, అన్నిలోకములందు అంతర్యామియైయున్న తాపము తీరునట్లు భగవానుడు తమ మనస్సులో చల్లబడునట్లు, నిత్యవాసము చేయగా, ఆ స్వామి శ్రీపాదములను తాము రక్షకముగా ధ్యానించుటయేకాక, "సౌమ్యోపయంతృమునినా మమ దర్శితౌ తౌ....చరణౌ" (ప్రపత్తి-15) అనుచు ఈ స్తుతిలోనే తాము పల్కిన రీతిలో తమకు రక్షకముగా చూపి అనుగ్రహించిన శ్రీమణవాళమహామునులువంటి మహాత్ములును. వారి దివ్యచిత్తములలో నీవు నీ శ్రీచరణములను మోపితివి కదా! అనుచు అణ్ణన్ విద్ధులగుచున్నారు. నిత్యనిర్దోషముగు వేదమునకును ప్రామాణ్యము శిష్టపరిగ్రహత్వమునుబట్టియే గ్రహింపబడుటచే, వేదముకంటె ఆళ్వార్, ఎమ్బెరుమానార్, జీయర్వంటి శిష్టులు గొప్పవారని అణ్ణన్ అభిప్రాయము.

చివరగా, ఇట్లు తెలిపిన ఉత్తరోత్తరము ఉన్నతములగు విషయములలో చివరిది అగు మహనీయుల మనస్సుతో సమానముగా మిక్కిలి అధమమైన దాసుని తలను తలచి, నిర్హేతుకముగా నీ శ్రీచరణములను నీవు ఉంచితివి కదా! ఏమి నీ సౌశీల్యపరాకాష్ఠ! అనుచు మనస్సులో మిక్కిలి అచ్చెరువొంది, ఆనందించి "శ్రీవేంకటేశ్వరుడే దాసుని తలపై శ్రీపాదములను ఉంచుటచే జ్ఞానోదయమై, ఆ పాదములే రక్షకముగా ఆశ్రయించితిని" అనుచు అణ్ణన్ పల్కుచున్నారు.

13. ఆమ్లానహృష్యదవనీతలకీర్ణపుష్పౌ
శ్రీవేంకటాద్రిశిఖరాభరణాయమానౌ ।
ఆనందితాఖిలమనోనయనౌ తవైతౌ
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, అమ్లానహృష్యత్=వాడని, వికసించునట్టి, అవనీతల కీర్ణపుష్పౌ =(సమీపముననే) భూమిపై రాలిన పుష్పములను కల్గినవి, శ్రీవేంకటాద్రిశిఖర + ఆభరణాయమానౌ=శ్రీవేంకటాద్రి శిఖరమునకు ఆభరణమువలెనున్నవియు, ఆనందిత + అఖిలమనఃనయనౌ=ఆనందింపజేయబడిన జనులందఱి మనస్సును, నేత్రములను కల్గినదియును అగు, ఏతౌ తవ చరణౌ=ఈ నీ శ్రీపాదములను, శరణం ప్రపద్యే= రక్షకముగా పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! భక్తులు నీ శ్రీపాదములందు అర్చించిన పుష్పములు అచట చోటు చాలక, ప్రక్కన చిందినవి. అవి కొంచెము కూడ వాడనివియై, వికసించుచునే యుండగా, దానిని సేవించినవారు, "ఇది ఏమి? శ్రీవేంకటాచల-శిఖరమునకు అలంకరింపబడిన ఆభరణమో ఏమో!" అని తలచునట్లు వారి మనస్సును, కన్నులను అపహరించి, ఆనందించునట్లు చేసిన నీ శ్రీపాదములను శరణు పొందుచున్నాను.



భక్తులు భగవానుని పాదములందు అర్చించిన పుష్పములు ప్రక్కన క్రిందబడియున్నవి. అవి అట్లు జారిపడినను ఏ మాత్రము వసివాడకుండ, వికసించియే యున్నవి. ఇట్లు అర్చించిన భక్తులు నిత్యసూరులే. "వానవర్ వానవర్ కోనుడుమ్ శిన్దు పూమకిళుమ్ తిరువేఙ్గడత్తు" (తిరువాయ్-3-3-2) అను నమ్మాళ్వార్ల పాశురసూక్తియును, "నిత్యసూరికళ్ శ్రీసేనాపతియాళ్వానోడుఙ్గూడ ఆరాధనార్థమాక త్తూవిన పుష్పఙ్గళ్ నిలమిదియాలే (ఇడత్తిన్ సారమాన తన్మైయాలే) శెవ్విప్పెఱుమ్బడియాన (వాడామల్ మలర్న్దేయిరుక్కు మ్బడియాన) తిరుమలై" (నిత్యసూరులు విష్వక్సేనునితో పాటు ఆరాధన కోసం కోసిన పూలు స్థలమహిమచేత నికాసాన్ని పొందేటట్లున్న తిరుమల) అను శ్రీకృష్ణసూరి వ్యాఖ్యాన సూక్తి వలన దీనిని తెలియవచ్చును. పూవులు ఎల్లప్పుడు వికసించియే యుండుట పుష్పమండపమగు తిరుమలలో కదా! ఈ శ్రీపాదములు నారాయణుని వాడని పాదపద్మములగుటచే తమవద్దకు చేరిన పుష్పములనుకూడ తమతో సామ్యమును అనుగ్రహించి వాడని పుష్పములుగా చేసినవి అనియు చెప్పవచ్చును. ఇట్టి గొప్పతనమును పొందిన శ్రీపాదములు తిరుమల శిఖరమునకు అలంకారమగు ఒక మస్తకాభరణముగా నుండి సేవించువారి కన్నులకు, మనసుకును ఆనందమును కల్గించున్నవని భావము.

14. ప్రాయః ప్రసన్నజనతాప్రథమావగాహ్యౌ
మాతు స్తనా వివ శిశో రమృతాయమానౌ ।
ప్రాప్తౌ పరస్పతులా మతులాంతరౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీ వేంకటేశ=శ్రీవేంకటేశ్వరా! ప్రాయః=బహుశః, ప్రపన్నజనతా=శరణుపొందువారికి, ప్రథమ+అవగాహ్యౌ=మొదటగా తెలియబడునవి, శిశోః=బిడ్డకు, మాతుః స్తనౌ ఇవ=తల్లి స్తనములవలె, అమృతాయమానౌ=అమృతమువలె నున్నవియు, పరస్పరతులాం=ఒక దానితో వేఱొకటి పోలియుండుటను, ప్రాప్తౌ=పొందినవి, అతులాంతరౌ=వేఱొక దానితో సామ్యమును లేనివి అగు, తే చరణౌ=నీ శ్రీపాదములను, శరణం ప్రపద్యే=శరణు పొందుచున్నాను.

శ్రీవేంకటేశ్వరా! శరణు పొందుట అనగా నీ శ్రీపాదములను రక్షకములుగా ఆశ్రయించుటయే కావున, శరణమును పొందు మానవులకు, బిడ్డకు మొట్టమొదట తెలియదగిన తల్లి స్తనములవలె, అమృతప్రాయములుగానున్నవి, వేఱొక ఉపమానము

లేక, తమకు తామే సాటిగా ఉన్నవి అగు నీ శ్రీపాదములను శరణువేడుచున్నాను.

భగవానుని ప్రపత్తి చేసి ఆశ్రయించు భక్తులు మొదట అతని శ్రీపాదములను గూర్చి తెలిసికొని ఆశ్రయింపవలెను. "పిరాట్టియుమ్ అవనుమ్ విడిలుమ్ తిణ్ కళలాయిరుక్కుమ్" (లక్ష్మి, భగవానుడు విడచినా తాము విడువని శ్రీచరణాలు) అను పిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన రీతిలో మనలను విడువకుండ రక్షించు శ్రీపాదము లనే ఆశ్రయింపవలెను-అని భావము. తల్లి స్తనములను అనగా-పాలను ఇచ్చి తన జీవనమునకు కారణమైన స్తనములను - మొట్టమొదటగా తెలిసికొని బిడ్డలు ఆశ్రయించు రీతిని దీనికి దృష్టాంతముగా - ఇందలి ముందు పాదములలో పల్కుచున్నారు. దానికి తగినట్లు "శేషిపక్కల్ శేషభూతన్ ఇళియుమ్ తుఱై. ప్రజై ములైయిలే వాయ్ వైక్కుమాపోలే" (ముముక్షు-147) (శేషియైన భగవానునివద్ద శేషభూతుడైన జీవుడు ప్రవేశించే రేవు- చోటు. శిశువు తల్లి స్తనాన్ని నోటిలో పెట్టుకొనేటట్లు) అను లోకాచార్య శ్రీసూక్తియు, "శేషిపక్కల్ ఆశ్రయిక్క ఇళియుమ్ శేషభూతన్ తన్ (శేషత్వ) స్వరూపానుగుణమాక ఇళియుమ్ తుఱై తిరువడికళ్. స్తనంధయ ప్రజై (పాలుణ్ణుమ్ శిఱుకుళన్దై) తాయినుడైయ అవయవమెల్లామ్ కిడక్క త్తనక్కు వకుత్తదాయుళ్ళ ములైయిలే వాయ్ వైక్కుమాప్పోలే-ఎన్దై" (శేషిని ఆశ్రయించే శేషభూతుడైన జీవుడు తన స్వరూపానికి తగినట్లుగా చేరే చోటు శ్రీచరణాలు. శిశువు తల్లి అంశాలన్నీ ఉన్న తనకు తగినదై ఉండే తల్లిస్తనాలను నోటిలో పెట్టుకొనేటట్లే ఇది) అను దానికి గల మణవాళమహాముునుల వ్యాఖ్యానమును అనుసంధింపనగును.

ఇక, ఉత్తరపాదములను గమనించెదము "ప్రాప్యౌ పరస్పరతులామ్ అతులాంతరౌ.....చరణౌ" తమకు బయట వేఱొక ఉపమానము లేకుండ, తమకు తామే పరస్పరము ఉపమానముగా నున్న శ్రీపాదములని అర్థము. "ఇణైత్తామరైయడి" (రెండు తామరపూల వంటి శ్రీచరణాలు) కదా శ్రీనివాసుని శ్రీపాదములు. ఒకదానికి వేఱొకటి ఉపమానముగా ఉండుట అనునది "చరణౌ" అను ద్వివచనము యొక్క అర్థము. దానిని ప్రత్యేకముగా రెండు విశేషణములతో ఈ స్తుతికర్త వివరించుచున్నారు - అని తెలియనగును.

15. సత్త్వోత్తరైః సతతసేవ్యపదాంబుజేన
సంసారతారకదయార్ద్రదృగంచలేన ।
సౌమ్యోపయంతృమునినా మమ దర్శితౌ తే
శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ=శ్రీవేంకటేశ్వరా!, సత్త్వ+ఉత్తరైః=సత్త్వగుణములలో నిండిన పెద్దలచే, సతతసేవ్యపద+అంబుజేన=ఎల్లప్పుడు ఆరాధింపతగిన పదాంబుజములను కల్గినవారు, సంసారతారక=సంసారమును దాటించు, దయా+ఆర్ద్రదృగంచలేన=దయచే తడసిన కటాక్షములను కలవారును అగు, సౌమ్యోపయంతృమునినా=శ్రీమణవాళ మహామునులచే, మమ దర్శితౌ=నాకు చూపబడినవి అగు, తే చరణౌ=నీ శ్రీపాదములను, శరణం ప్రపద్యే =రక్షకముగా ఆశ్రయించుచున్నాను.



శ్రీవేంకటేశ్వరా! సత్త్వగుణమును నిండుగాకల గొప్పవారు, ఎల్లప్పుడు నీ శ్రీచరణములను ధ్యానము చేయువారు, వారిని కరుణపొంగిన కటాక్షములచే చల్లగా కటాక్షించి సంసారసముద్రమును దాటించు గొప్పతనము నిండినవారగు మణవాళమహామునులచే, "ఇవి మిక్కిలి ఉన్నతములు, శరణుపొందినవారిని మోక్షమును పొందింపగల్గినవి" అని నాకు చూపింపబడిన శ్రీపాదములను శరణు పొందుచున్నాను.

శ్రీమణవాళమహామునుల శ్రీపాదపద్మములను సదా ధ్యానించు వారి శిష్యులు. అజ్ఞానము-సోమరి తనము-నిద్ర మొదలగువానిని కల్గించు తమో గుణము, సంశయము, భ్రమ-కామము-జుగుప్స మొదలగువానిని కల్గించు రజోగుణమును కొంచెము కూడ కలవకుండ స్వచ్ఛమైన జ్ఞానము, చక్కని ఆచారము మొదలగు గుణములకు కారణమగు శుద్ధసత్త్వగుణమునే నిండుగా కలవారు. వారు ఎట్లుందురనుటను "అపగతమదమానై రంతిమోపాయనిష్ఠైః, అధిగతపరమార్థై రర్థకామానపేక్షైః, నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః, వరవరమునిభృత్యై రస్తు మే నిత్యయోగః" (ఉత్తరదినచర్యా-11) అనుచు వీరివలెనే (అణ్ణన్ వలెనే) శ్రీమణవాళ మహామునుల వేఱొక శిష్యులగు ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన శ్లోకముద్వారా తెలియనగును. గర్వమును, తాను స్వతంత్రుడనను అభిమానమును లేనివారు, కర్మ,జ్ఞాన, భక్తి, ప్రపత్తులు, ఆచార్యాభిమానము అని చెప్పబడు అయిదు విధములగు మోక్షోపాయము లలో చివరిది అగు ఆచార్యాభిమానమను ఉపాయమునందు నిష్ఠను కలవారు, పురుషార్థమునకు అవధి అగు ఆచార్యకైంకర్యమును పొందినవారును, సంపదయందు, దానితో అనుభవించు అల్పానందమునందు ఏ మాత్రము అపేక్షను లేనివారును, స్నేహితులు-శత్రువులు అను తారతమ్యము లేకుండ అందఱిపట్ల స్నేహభావమును కలవారును, క్రోధము, లోభము-అను వీనిని జయించినవారును, కావుననే మిక్కిలి ప్రకాశించువారును అగు శ్రీవరవరమునుల శిష్యులతో నాకు సంబంధము నిత్యముగా కల్గుగాక-అనునది పైశ్లోక భావము.

(సంసారతారకేత్యాది) ఈ ప్రతివాది భయంకరమ్ అణ్ణానే అనుగ్రహించిన వాళిత్తిరు నామములో గల "కరుణై పొఙ్గియ కణ్ణిణై వాళియే" (కరుణ నిండిన నేత్రద్వయికి

మంగళం) అను సూక్తియొక్క వివరణమే ఈ ప్రయోగము. శ్రీవరవరమునుల నేత్రద్వయములో పొంగు కరుణ ఎట్టిది? అనగా జన్మమరణచక్రరూపమగు సంసారమునుండి దాటించి, పరమపదమును అనుగ్రహింపగల్గినది వారి దయ-అనుచు దానికి సమాధానము ఈ ప్రయోగము ద్వారా తెలుపబడుట గమనింపతగినది.

"సౌమ్యోపయంతా" అనునది శ్రీరంగనాథునకుకల అళకియమణవాళన్ అను తిరునామముయొక్క ద్రావిడీకృతరూపము. ఈ తిరునామము శ్రీమణవాళ మహామునులకు వారి పితృపాదులచే నామకరణసమయమున పెట్టబడినది. పిమ్మట సన్న్యాసాశ్రమమును స్వీకరించి, శ్రీరంగనాథునకు మంగళాశాసనమును చేసి, నమస్కరించి నిలిచినపుడు, "మీరు నా నామమగు అళకియమణవాళన్ అనెడి పూర్వనామమునే కల్గియుండుడు. ("నీర్ నమ్ముడైయ నామమాన మున్ తిరునామత్తైయే ముట్రనడత్తుమ్) (యతీంద్ర ప్రవణప్రభావమ్) (మీరు నానామాన్ని కలవారై వర్తించండి) అని శ్రీరంగనాథుడు అనుగ్రహించినట్లు కానవచ్చుటచే వీరు సౌమ్యోపయంతృముని అని పిలువబడిరనదగును. ఇట్టి వరవరమునులు వేఱొక గతి ఏమియు లేని తమకు ప్రక్కననుండి, శ్రీవేంకటేశ్వరుని శ్రీపాదములను రక్షకముగా చూపి, సుప్రభాతాది స్తోత్రములను ఆ స్వామి విషయమున రచించునట్లు నియమించుటచే "సౌమ్యోపయంతృమునినా మమ దర్శితౌ శ్రీవేంకటేశచరణౌ" అని అణ్ణన్ పల్కిరి. ఈ విధముగా ఆచార్యరుచిపరిగృహీతములై, వారు చూపిన (భగవానుని) శ్రీపాదములనే దీనిద్వారా ఆశ్రయించినట్లయినది.

16. శ్రీశ శ్రియా ఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయ ముపేయతయా స్ఫురంత్యా ।
నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ తుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ న జాతు మహ్యమ్ ॥

శ్రీ+ఈశ, వృషగిరి+ఈశ=లక్ష్మీపతివి అగు వృషాద్రిప్రభూ!, త్వత్+ఉపాయభావే=నీవు ఉపాయముగానున్న ఇపుడు, ఘటికయా=(మమ్ములను నీతో) చేర్చునదియై, త్వయి ప్రాప్యే సతి=నీవు (మాచే) పొందబడునట్టి స్థితిలో, స్వయం=తాను కూడ, ఉపేయతయా స్ఫురంత్యా =(మాచే) పొందబడు స్థితిలో వెలుగునదియైయున్న, శ్రియా= లక్ష్మీదేవిచే, నిత్య+ఆశ్రితాయ =ఎల్లప్పుడు (వక్షఃస్థలములో) ఆశ్రయింపబడినవాడవు, నిరవద్యగుణాయ=దోషములు లేని సద్గుణములను కలవాడవును అగు, తుభ్యం=నీకు, కింకరః స్యాం= నేను కైంకర్యమును చేయువాడనుగా అగుదును, మహ్యం=నా కొఱకు, కింకరః=సేవ చేయువాడనుగా (స్వతంత్రుడనుగా), న జాతు స్యామ్=ఏ సమయముననను కాను.



శ్రియఃపతివగు శ్రీవేంకటేశ్వరా!, మేము నిన్ను శరణు పొందగా, నీవు మాకు ఫలమును అనుగ్రహించునపుడు, నీవు మాయందు దోషములను చూచి, కోపింపకుండునట్లు నిన్ను అనునయించి, మేము ఫలమును అవశ్యము పొందునట్లు చేయునది, పిమ్మట ఫలమును పొంది, మేము చేయు అంతరంగ కైంకర్యములను స్వీకరించునదియును అగు అలర్‌మేల్ మఙ్గై నిత్యవాసమును చేయు వక్షఃస్థలమును కల నీ కొఱకే నేను కాగలను. ఏనాడును హిరణ్యునివలె స్వతంత్రుడను కాను. ఈ విధముగా నీవు నన్ను కటాక్షింపవలెను.

ఇట్లు మొదటి శ్లోకములో లక్ష్మీదేవిని పురుషకారముగా ఆశ్రయించి, రెండవ శ్లోకమునుండి 14వ శ్లోకమువరకు శ్రీవేంకటేశ్వరుని చరణములను పలు రీతులలో వర్ణించి, పదునైదవ శ్లోకములో ఆ శ్రీపాదములను శ్రీవరవరమునులు చూపిరని తెలిపి, వానినే తాము ఇష్టప్రాప్తికిని, అనిష్టనివృత్తికిని తగిన ఉపాయముగా ఆశ్రయించునట్లు తెలిపి, (ఈ విధముగా) ద్వయపూర్వఖండార్థమును అనుసంధించి, ఈ చివరి శ్లోకముతో ప్రపత్తియొక్క ఫలముగా కైంకర్యమును శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో ప్రార్థించుటద్వారా ద్వయము ఉత్తరఖండార్థమును అనుగ్రహించి, ఈ ప్రపత్తి గ్రంథరూపమును పూర్తిచేయుచున్నారు.

ద్వయము ఉత్తరఖండార్థముయొక్క వివరణరూపముగా అమరియున్న ఈ శ్లోకములో "త్వదుపాయభావే ఘటికయా స్ఫురంత్యా శ్రియా నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ" (దాసునిచే ఆశ్రయింపబడి, నీవు ఉపాయమగునపుడు పురుషకారముగా ప్రకాశించుచున్న లక్ష్మీదేవిచే నిత్యముగా సంశ్లేషింపబడి, ఆమెచే తలఎత్తిన (ఉద్బుద్ధములైన) దోషరహితములగు కల్యాణగుణములను కల) అనుచు "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అనెడి ద్వయపూర్వఖండార్థమును అనుసంధించినది-ఇంతవరకు అనుష్ఠించిన ప్రపత్తి ఐశ్వర్యాది ఫలముల కొఱకు కాదు, భగవత్కైంకర్యముకొఱకే అనుటను తెలుపుటకు-అని భావము. "త్వదుపాయభావే ఘటికయా స్ఫురంత్యా, త్వయి ప్రాప్యే సతి స్వయమ్ ఉపేయతయా చ స్ఫురంత్యా శ్రియా" (నీవు ఉపాయమగునపుడు పురుషకారరూపిణిగా వెల్గునది, నీవు ప్రాప్యుడవగునపుడు (దాసుడు చేయు కైంకర్యములను స్వీకరించువాడవైయున్నపుడు) తానుకూడ నీవలెనే ప్రాప్యరూపిణిగా వెల్గునదియును అగు శ్రీదేవిచే) అనుటచే లక్ష్మీదేవికి పూర్వఖండములో పురుషకారత్వము, ఉత్తరఖండములో ప్రాప్యత్వమును అనెడి ఆకారభేదమును, భగవానునకు పూర్వఖండములో ఉపాయత్వము, ఉత్తరఖండములో ప్రాప్యత్వమును అనెడి ఆకారభేదమును స్పష్టముగా తెలుపబడుట గమనింపతగినది.

ఇక, "ప్రాప్యే త్వయి స్వయమ్ (అపి) ఉపేయతయా స్ఫురంత్యా నిత్యాశ్రితాయ

నిరవద్యగుణాయ తుభ్యం కింకరః స్యామ్" (నీవు ప్రాప్యుడవు అగునపుడు తాను కూడ ప్రాప్యయై వెలుగు పిరాట్టిచే నిత్యముగా సంశ్లేషింపబడి, దాసునకు భోగ్యములగు, దోషరహితములగు కల్యాణగుణములతో కూడియున్న (నారాయణుడవగు) నీకు దాసుడనగు నేను కింకరుడను కాగలను-అనునది ఉత్తరఖండములోనున్న "శ్రీమతే నారాయణాయ" అను దాని వివరణము. "న జాతు మహ్యమ్(స్యామ్)" అనునది అచట గల "నమః" పదార్థముయొక్క వివరణము. నాకు దాసుడనుగా-అనగా స్వతంత్రుడనుగా ఎపుడును కాబోను-అనుచు ప్రతిపదార్థములో తెలుపబడినది సామాన్యమైన అర్థము. "తుభ్యం కింకరః స్యామ్, న జాతు మహ్యం కింకరః స్యామ్" (నీ ఆనందము కొఱకే నీకు సేవచేయువాడనగుదును. దాసుని ఆనందము కొఱకుగా నీ దాసుడనుగా కాను) అనునది రహస్యగ్రంథములలో పూర్వాచార్యులు అనుగ్రహించి "నమః" పదముయొక్క అర్థము. "నమః కైంకర్యత్తిల్ కళైయఱుక్కిఱదు. కళైయావదు తనక్కెన్న పణ్ణుమదు" (నమస్సు కైంకర్యంలోని దోషాన్ని తీరుస్తుంది. ఇక్కడ కళై-దోషం-అంటే తన ఆనందంకోసం చేయడం) (ముముక్షు-178,179) అను శ్రీపిళ్ళైలోకాచార్యులవారి శ్రీసూక్తి ఇచట అనుసంధేయము.

ఇట్లు దీనితో పూర్వము చేసిన సిద్ధోపాయవరణమును శరణాగతికి ఫలముగా శ్రీవేంకటేశ్వరుని కైంకర్యమును ప్రార్థించి అణ్ణన్ ఈ స్తుతిని పరిసమాప్తి గావించిరి

శ్రీవేంకటేశ ప్రపత్తి వ్యాఖ్యానము ముగిసినది.

౦



శ్రీమతే వేంకటేశాయ నమః

# శ్రీవేంకటేశమంగళము-సవ్యాఖ్యానము

## అవతారిక

పూర్వము శ్రీవేంకటేశస్తోత్రములో "నిత్యసేవాఫలం ప్రయచ్ఛ" (10) అని ప్రార్థించిన ఫలమునకు ఉపాయముగా శ్రీవేంకటేశ్వరుని పాదములో ప్రపత్తి అనెడి స్తోత్రము మూలమున ఆశ్రయించి, దానిచివరలో ముందు ప్రార్థించిన నిత్యసేవాఫలమనెడి నిత్యకైంకర్యమునే "తుభ్యం స్యామ్ కింకరో వృషగిరీశ!" అనుచు అణ్ణన్ మఱల ప్రార్థించిరి. అట్టి కైంకర్యములో వాచికకైంకర్యముకూడ ఒకటి అగుటచే, వాచికమగు మంగళాశాసనమును ఈ స్తుతిలో కావించుచున్నారు.

"మంగళస్య ఆశాసనమ్ మంగళాశాసనమ్"-భగవానునకు మంగళమును - అనగా శుభమును కోఱుట మంగళాశాసనమనబడును. ఇది ఒక విధముగా ఆశీర్వాదముగా పరిణమించును.

లోకములో రక్షకుడగు-అనగా కాపాడువాడగు పెద్దవాడు (సమర్థుడు) రక్ష్యభూతునకు-అనగా తనచే కాపాడబడువానికి మంచి కలుగవలెనని ఆశీర్వదించుట తగును. సర్వరక్షకుడని పేరు పొందిన భగవానునకు రక్ష్యకోటిలోనికి చేరిన మనము శుభమును ఆశాసించుట మన స్థితికి-అనగా రక్ష్యభూతస్థితికి విపరీతము కాదా! అనెడి ప్రశ్న ఇచట కల్గుట సహజము. ఈ ప్రశ్నకు శ్రీవచనభూషణమను దివ్యగ్రంథములో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన సమాధానమును గమనించెదము.

మనకు శరీరమని, ఆత్మ అని రెండు విషయములున్నట్లే, భగవానునకుకూడ శరీరమని, (దివ్యమంగళవిగ్రహమని), దివ్యాత్మస్వరూపమని రెండు విషయములు కలవు. దివ్యదేహమునందు సౌకుమార్యము, సౌందర్యము-మొదలగు గుణములును, దివాత్మస్వరూపములోని జ్ఞానము, శక్తి-మొదలగు గుణములును కలవు. దివ్యమంగళమును దర్శింపకుండ, ఆ స్వామి స్వరూపము మొదలగు గుణములను తెలిసికొను దశ ఒకటి కలదు. దీనికి జ్ఞానదశ అని పేరు. అపుడు భగవానుని జ్ఞానము, శక్తి-మొదలగు గుణములు మనస్సులో భాసించుటచే అతనిని రక్షకునిగను, మనలను రక్ష్యకోటిలోనికి చేరినవారినిగను తలచి, ఆ స్వామివద్ద వరమును వేడి, మనలను రక్షించుకొందుము. ఆ స్థితిలో రక్ష్యత్వము మనయందు, రక్షకత్వము భగవానునియందును క్రమానుసారముగా నుండును. భగవానుని దివ్యమంగళ విగ్రహమును దర్శించినపు డన్నచో, దానిని మనము స్పృశించుటయేకాదు, చూచిన

కూడ కందిపోవునో? ఏమో? అనునట్టి సౌకుమార్యము, అందము మొదలగు గుణములుండుటను చూచి, వానియందు మన కన్నులును, మనస్సును పారవేసికొని, మోహమును చెందిన మనకు వానియందలి ప్రేమ అధికముగా వృద్ధి చెందును. ఆ స్థితికి ప్రేమదశ అని పేరు. అపుడు ఆ స్వామికి గల జ్ఞానశక్త్యాదిగుణములను మఱచి, ఇంతటి సుకుమారమైన, ఈ అందమైన దివ్యరూపమునకు ఏమి ఉపద్రవము వాటిల్లునో! ఏమో! అను అస్థానే భయశంను పొంది, అతనిని రక్షింపదలచి, "నీవు చిరకాలము వర్ధిల్లుము" అని, "నీకు సర్వశుభము లును కలుగవలెను" అనియు అతనిని మనము మంగళాశాసనమును చేయుదుము. అందుచే ఈ ప్రేమదశలో పూర్వమువలెకాక రక్ష్యత్వము అతని యందు, రక్షకత్వము మనయందును అగునట్లు వ్యత్యస్తమగును. అందుచే మంగళాశాసనము భక్తుని స్వరూపమునకు విరుద్ధము కాదు-అనునది పిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన సమాధానము.

అందుచే భగవానుడు మనలను తన దివ్యరూపసౌందర్యము దర్శింప జేసి,మోహింప జేసి, తాను రక్షకుడను భావమును మనము మఱచునట్లు చేసి, తాను మనకు రక్ష్యభూతుడనుటను తెలిపి, తనను మనము మంగళాశాసనమును చేయునట్లు చేయును కావున, చిన్నవారమగు మనము గొప్పవాడగు భగవానునకు మంగళాశాసనమును చేయుట ఉచితమే అగును-అను బదులు ఇవ్వబడినట్లయినది.

ఇట్లు ప్రేమదశలో అతని అందమునకు, సౌకుమార్యమునకును వివశులై, అతని "పల్లాణ్డు పల్లాణ్డు" అనుచు మంగళాశాసనమును చేసిన పెరియాళ్వార్లవలె ఈ స్తుతికర్త అగు అణ్ణన్ కూడ శ్రీవేంకటేశ్వరునకు మంగళాశాసనమును చేయుచున్నారు.

ఐ

1. శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయే-ర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

శ్రియఃకాంతాయ=లక్ష్మీదేవికి భర్త, కల్యాణనిధయే=మంగళములకు నిధి, అర్థినాం నిధయే=యాచించువారికి నిధియు, శ్రీవేంకటనివాసాయ=శ్రీవేంకటాద్రిని నివాసముగా కలవాడును అగు, శ్రీనివాసాయ=శ్రీనివాసునకు, మంగళమ్ (అస్తు)=మంగళము కలుగుగాక!

దేవేరియగు లక్ష్మీదేవి వక్షఃస్థలములో ఎల్లప్పుడు నివసించియుండుటచే, యాచకుల ప్రార్థనలను ఎంతగా అనుగ్రహించినను కొఱతలేని నిధియై, శ్రీవేంకటాద్రిలో నివసించువాడై, సహజముగానే మంగళముల కన్నిటికిని నివాసభూమియైయున్న శ్రీనివాసునకు మఱింత మఱింత మంగళము కలుగవలెను.



"శ్రయతే ఇతి శ్రీః" అను శ్రీశబ్దవ్యుత్పత్తినిబట్టి, భగవానుని ఆశ్రయించుటచే శ్రీః అను నామము లక్ష్మీదేవికి ఏర్పడినది. "కామ్యతే ఇతి కాంతః" అను వ్యుత్పత్తిని అనుసరించి కాంతశబ్దము భార్యచే మిక్కిలి కోఱబడు భర్తకు వాచకము. కావున "శ్రియఃకాంతః" అను పదము లక్ష్మీదేవి ప్రేమకు లక్ష్యభూతుడగు భగవానుని తెలుపుచున్నది.

(కల్యాణనిధయే) - "కల్యమ్ అణయతి ఇతి కల్యాణమ్"-సుఖమును పొందించునది అని అర్థము. "నిధిః" అనగా నెలవు. ఈ పదముచే సంసారిజనులకు సుఖమును కలుగజేయు పూమాల, చందనము, తాంబూలము, వస్త్రాభరణాదులు, కుంకుమము, అద్దము, వనితలు, శయ్య, సౌధములు, తోటలు, మండపములు, వాపీకూపాదులు మొదలగు మంగళవస్తువులకును, ముముక్షువులు మొదలగువారికి ఆనందమును కల్గించు జ్ఞాన-శక్తి-వాత్సల్య-సౌశీల్య-సౌలభ్య- లావణ్యాది దివ్యగుణములు, దివ్యలీలలు, శుభాశ్రయమగు దివ్యమంగళవిగ్రహము మొదలగు కల్యాణములకు నిధి-అనగా నివాసస్థానమువలె నున్నవాడు భగవానుడని తెలుపబడినది.

అందులకు ప్రయోజనమును "అర్థినామ్ నిధయే" అను ప్రయోగము తెలుపుచున్నది. అనగా-ముందు చెప్పబడిన కల్యాణములను అనుభవింపదలచి తనను సంసారులు, ముముక్షువులు మొదలగు అధికారులకు వానిని ఎంతగా ఇచ్చినను ఆ మంగళములు తన వద్ద కొంచెముకూడ కొఱత పడకుండనుండు నిధివంటివాడని భావము. (శ్రీవేంకటనివాసాయ) అర్థులకు మంగళములను అనుగ్రహించుటకొఱకు శ్రీవేంకటాద్రిని విడువకుండ నుండువాడు.

(శ్రీనివాసాయ)-"శ్రీః నివసతి అస్మిన్ ఇతి శ్రీనివాసః" అనెడి వ్యుత్పత్తినిబట్టి లక్ష్మీదేవి నిత్యవాసమును చేయునట్టివాడను అర్థ మిచ్చు ఈ పదము శ్రీవేంకటేశ్వరునకు యోగరూఢము.

ఈ విధముగా లక్ష్మీదేవి ఆశపడు భర్తయై, ఆమె సంబంధముచే తనకు సమృద్ధిగానున్న కల్యాణములను ప్రార్థించువారికి వారు అడిగిన రీతిలో అనుగ్రహించుచు, వేంకటాచలముపై వేంచేసియుండు శ్రీనివాసునకు ఆ కల్యాణములు (మంగళములు) అధికాధికముగా వృద్ధికావలెనని ఈ శ్లోకముద్వారా (అణ్ణన్) ఆశాసించిరి.

2. లక్ష్మీసవిభ్రమాలోకసుభ్రూవిభ్రమచక్షుషే ।
చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్ ॥

లక్ష్మీసవిభ్రమ+ఆలోక=లక్ష్మీదేవియొక్క విలాసముతోకూడిన కడగంటి చూపులకు లక్ష్యమైన, సుభ్రూవిభ్రమచక్షుషే=అందమైన కనుబొమల విలాసమును, నేత్రములను కలవాడు, సర్వలోకానాం=అన్ని లోకములకు, చక్షుషే=నేత్రములవంటి వాడును అగు, వేంకటేశాయ=శ్రీవేంకటేశ్వరునకు, మంగళమ్ (అస్తు)=మంగళమగుగాక!

లక్ష్మీదేవి యొక్క విలాసముతో కూడిన కటాక్షములకు లక్ష్యములలైన కనుబొమల కదలికలను, నేత్రములను కలవాడు, అన్నిలోకములకు నేత్రస్థానీయుడును అగు వేంకటేశ్వరునకు మంగళము కలుగుగాక.

"లక్ష్మ్యాః సవిభ్రమాలోకాః (స్వస్య) సుభ్రూవిభ్రమే చక్షుషీ చ యస్యాః సః లక్ష్మీసవిభ్రమాలోకసుభ్రూవిభ్రమచక్షుః" అను విగ్రహముద్వారా లక్ష్మీదేవియొక్క విలాసముతో కూడిన కటాక్షములు ప్రసరించిన తన అందమైన కనుబొమలను, నేత్రములను కలవాడు స్వామి-అను అర్థము ఏర్పడును. భగవానుని అందమైన కనుబొమలను, కన్నులను లక్ష్మీదేవి తన కటాక్షములతో చూచుచున్నదని తాత్పర్యము. భగవానుడు తనకు పరబ్రహ్మత్వము సిద్ధించుటకై లక్ష్మీదేవి వద్ద తన సుభ్రూవిలాసములు, కంటిచూపులు- అను వీనితో వేడగా, ఆమెయు తన క్రీగంటి చూపులతో వానిని చూచి, తన అభిప్రాయమును తెలిపి, పరబ్రహ్మత్వము స్వామికి వరముగా ఇచ్చెనను రస్యమైన భావము దీనివలన స్ఫురించును. "అపాంగాః భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్" (శ్రీగుణ-30) లక్ష్మీదేవీ! నీ అధికమైన కటాక్షములు ఏ వ్యక్తిపై పడినచో, అతడు పరబ్రహ్మ అయ్యెను అనుచు పరమరసికులగు భట్టర్ అనుగ్రహించుట ఇచట స్మరణీయము.

ఇక, "లక్ష్మీసవిభ్రమాలోకేషు (స్వస్య) సుభ్రూవిభ్రమః చక్షుః చ యస్య సః" అను విగ్రహమును చెప్పినచో, భగవానుడు తన అందమైన కనుబొమలు కదలికలను, కన్నులను లక్ష్మీదేవియొక్క అందమైన కటాక్షములలో ప్రసరింపచేయుచున్నాడను అర్థమును తోచును. అనగా, లక్ష్మీదేవి నేత్రములలో తన సుభ్రూవిభ్రమములతో కూడిన కటాక్షములను దూతగా విడచి, తన్మూలముగా తన మనోరథమును వ్యక్తీకరించుచున్నాడని తాత్పర్యము. "ఇళవాయ్చ్చియర్ కణ్ణినుళ్ విడవే శెయ్దు విళిక్కుమ్ పిరానైయే" (తన చూపులను లేత వయస్సులోని గోపికల కళ్ళలోకి సందేశాన్ని పంపి దూతగా విడచి) (తిరువాయ్- 1-7-5) అనియు, "తూదు శెయ్ కణ్గళ్ కొణ్డొన్ఱు పేశి" (తిరువాయ్-9-9-9) (దౌత్యాన్ని పంపే నేత్రాలతో ఇంకొకటిని పల్కి) అనియును ఆళ్వార్లు అనుగ్రహించుట ఇందులకు ఒక విధముగా మూలముగా చెప్పవచ్చును.



"సర్వలోకానాం చక్షుః" - అనగా మంచి జ్ఞానమును కల్గించి, రక్షించు కన్నువంటి వేంకటేశ్వరుడు "అడిక్కీళ్ అమర్న్దు పుకున్దు అడియీర్ వాళ్మిన్" (తిరువాయ్-6-10-11) (నా పాదాల చెంత చేరి నిలచి, ఓ దాసులారా! తరించండి!) అని తెలిపి, ఉజ్జీవింపజేయు తన శ్రీపాదములనే ఉపాయమను యథార్థజ్ఞానమును కల్గించి, తత్ఫలముగా తన శ్రీపాదములను రక్షకముగా ఆశ్రయించిన వారిని ఉజ్జీవింపజేసి, కాపాడుచున్నాడని భావము. "చక్షు ర్దేవానా ముత మర్త్యానామ్", "కణ్ణావా నెన్నుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు తణ్ణార్ వేఙ్గడ విణ్ణోర్ వెఱ్పనే" (భూలోకవాసులకు, పరమపద వాసులకు నేత్రస్థానీయుడై, చల్లని వేంకటాద్రి అనే దివ్యపర్వతంలో వేంచేసి ఉండేవాడు) అనెడి దివ్యసూరిసూక్తులును ఇందులకు ప్రమాణములు.

3. శ్రీవేంకటాద్రిశృంగాగ్రమంగళాభరణాంఘ్రయే ।
మంగళానాం నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

శ్రీవేంకటాద్రి=శ్రీవేంకటాద్రియొక్క, శృంగ+అగ్ర=శిఖరాగ్రముయొక్క, మంగళ+ఆభరణ అంఘ్రయే=శుభమును కల్గించు ఆభరణములగు శ్రీచరణములను కలవాడు, మంగళానాం=మంగళకరములగు గుణములకు, నివాసాయ=నివాసమైనవాడగు, శ్రీనివాసాయ శ్రీనివాసునకు, మంగళమ్ అస్తు=మంగళము కల్గుగాక!

శ్రీవేంకటాద్రిశిఖరము ఆభరణమును ధరించినదా! అనునట్లు అమరియున్న శ్రీపాదములను, మంగళకరములగు గుణములను, చరిత్రలను, దివ్యమంగళ విగ్రహమును, దివ్యాభరణములను, ఆయుధములను మొదలగువానిని కల్గిన శ్రీనివాసునకు మంగళము కలుగవలెను.

ఇందలి పూర్వార్ధముద్వారా "శ్రీవేంకటాద్రిశిఖరాభరణాయమాణౌ...శ్రీవేంకటేశ చరణౌ" అనుచు ప్రపత్తి స్తోత్రములో (13) పల్కిన సూక్త్యర్థములను అణ్ణన్ అనుసంధించిరి. "మంగళానాం నివాసాయ" అనుటచే "కల్యాణనిధయే" అనుచు మొదటి శ్లోకములో పల్కిన భావమును స్మరించిరి. ముఖ్యమైనది, రసవత్తరమైనదియు అగు అర్థమును మాటిమాటికి ప్రస్తావించుట పునరుక్తి దోషము కాదు కదా!

"మంగం లాతి ఇతి మంగళమ్" అను వ్యుత్పత్తినిబట్టి సుఖమును ఇచ్చునది అను అర్థమునిచ్చు మంగళశబ్దము పూర్వము ఉపాత్తమైన కల్యాణశబ్దమునకు పర్యాయము. "శ్వః శ్రేయసం శివం భద్రం కల్యాణం మంగళమ్ శుభమ్" అనెడి అమరకోశ ప్రమాణ మిచట అవధేయము.

4. సర్వావయవసౌందర్యసంపదా సర్వచేతసామ్ ।
సదా సమ్మోహనాయా-స్తు వేంకటేశాయ మంగళమ్ ॥

సర్వ+అవయవ=అవయవములన్నిటియందుగల, సౌందర్యసంపదా=సౌందర్యమను సంపదతో, సర్వచేతసాం=సమస్తప్రాణులకు, సదా=ఎల్లప్పుడు, సమ్మోహనాయ = మోహమును కల్గించువాడగు, వేంకటేశాయ=వేంకటేశ్వరునకు, మంగళమ్ అస్తు = మంగళమగుగాక!

శ్రీపాదములనుండి శిరస్సువరకుగల అవయవములలో అందము అతిశయించి యుండుటచే, "తోళ్ కణ్డార్ తోళే కణ్డార్" (శ్రీరాముని బాహువులను చూచిన వారు ఆ బాహువులనే చూచారు) అనునట్లు ఒకొక్క అవయవమునే మోహించి, దర్శించునట్లు అందఱికిని మైకమును కల్గించు భగవానునకు మంగళము కలగవలెను.

శరీరమంతయు వ్యాపించిన సముదాయ శోభ అను అందమునకు లావణ్యమని పేరు. ఒక్కొక్క అంగము సాముద్రికలక్షణములతోకూడి, అమరియుండిన సొబగునకు సౌందర్యమని పేరు. ఇట్టి అవయవశోభను చూపి, అందఱికిని ప్రీతి తన పట్ల కల్గునట్లు భగవానుడు చేయుచున్నాడు. ఇట్లు చేసినచో వారు తనకు దాసులై, తనకు దాస్యము చేయుదురని స్వామి భావము. కైంకర్యము ప్రీతికారితము కదా!

5. నిత్యాయ నిరవద్యాయ సత్యానంతచిదాత్మనే ।
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥

నిత్యాయ = నాశము లేనివాడు, నిరవద్యాయ=దోషములు లేనివాడు, సత్య+అనంత చిదాత్మనే = మార్పులేని, అంతులేని జ్ఞానరూపమైన తన స్వరూపమును కలవాడు, సర్వ+అంతః+ఆత్మనే=అందఱికిని లోపల ఆత్మయై యున్నవాడును అగు, శ్రీమద్వేంకటేశాయ = శ్రీవేంకటేశ్వరునకు, మంగళమ్=మంగళ మగుగాక!

దేహములన్నిటియందు జీవులున్నట్లే, ఆ ఆత్మలయందు తాను ప్రాణ భూతుడైయుండి, వారి దోషములేమియు తనకు అంటనివాడై, ఎల్లప్పుడు ఒకే స్వభావమును కలవాడై, అంతులేని జ్ఞానమును తన స్వరూపముగా కలవాడై, నిత్యముగా వెలుగు శ్రీవేంకటేశ్వరునకు మంగళము కలుగవలెను.

"నిత్యః"- నాశము లేనివాడు. "ఎన్ఱుమ్ ఇఱవాద వెన్దై" (ఏనాటికీ నశించని తండ్రి) (మూన్ఱామ్ తిరువన్దాది-17) అనిరి కదా పేయాళ్వార్లు. (నిరవద్యః) "అపహత పాప్మా విజరో విమృత్యుః విశోకః విజిఘత్సః అపిపాసః"(ఛాందోగ్యే-8-7-1) (పుణ్యాపాపరహితుడు, వార్ధక్యము, మరణము, నిద్ర, ఆకలి, దాహము-అను వీనిని లేనివాడు) అనుచు వేదము పల్కిన రీతిలో పుణ్య పాపాది దోషము లేమియు లేనివాడని భావము.



(సత్యానంతచిదాత్మనే) "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (తైత్తిరీయోపనిషత్-ఆనంద-1) అనునట్లు సత్యత్వం, జ్ఞానత్వం, అనంతత్వం - అనువానిని స్వరూపముగా కలవాడు. జడపదార్థములకువలె స్వరూప వికారములను, ఆత్మలకువలె స్వభావవికారములను లేకుండుట సత్యత్వమగును. జ్ఞానత్వమనగా -ఎల్లప్పుడును సంకోచము లేకుండ, అంతట వ్యాపించియున్న జ్ఞానమును స్వరూపముగా కల్గియుండుట. ఉపనిషత్తులోని జ్ఞానశబ్దమును అణ్ణన్ చిత్ శబ్దముతో ఇచట నిర్దేశించిరి. ఇక అనంతత్వమనగా-దేశ,కాల,వస్తు పరిచ్ఛేదములను లేకుండుట. అనగా-అన్ని చోట్ల, అన్ని కాలములందు, అన్ని వస్తువుల రూపములో నుండు భగవానుని అద్వితీయమైన స్వభావము. (సర్వాంతరాత్మా) అందఱికిని అంతరాత్మయై ప్రవేశించియైయుండి, వారిని తమ తమ కర్మానుసారముగా నియమించు వాడు "ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా.....నారాయణః" (సుబాల-7) (ఈ నారాయణుడు సర్వప్రాణుల లోపల ప్రవేశించి, వానిని ప్రేరేపించుచున్నాడు) అనుటను గమనింపనగును.

6. స్వత స్సర్వవిదే సర్వశక్తయే సర్వశేషిణే ।
సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్ ॥

స్వతః=సహజముగానే, సర్వవిదే=అన్నిటిని తెలిసినవాడు, సర్వశక్తయే=అన్నివిధములైన శక్తులను కలవాడు, సర్వశేషిణే=అందఱిని తనకు శేషవస్తువుగా కలవాడు, సులభాయ =దర్శింపవీలయినవాడు, సుశీలాయ=మంచి స్వభావమును కలవాడును అగు, వేంకటేశాయ=శ్రీవేంకటేశ్వరునకు, మంగళమ్=మంగళమగుగాక!

బ్రహ్మ మొదలగువారి వరములదలనకాక, సహజముగానే అన్ని విధములైన జ్ఞానమును, శక్తిని కల్గియుండి, ఆ బ్రహ్మ మొదలగు దేవతలుసైతము తనకు దాస్యము చేయు మహిమను కలవాడై, ఇపుడు అందఱి కన్నులకు దర్శన మిచ్చువాడై, అందఱితో ఎట్టి భేదము లేకుండ వర్తించువాడై, శ్రీవేంకటాద్రిలో నివసించు భగవానునకు మంగళము కలుగుగాక!

ఒకరి దయ కారణముగా కాకుండ, సహజముగానే అన్నిటిని, వాని వాని స్వభావములను అన్నిటిని తెలియు జ్ఞానమును, అన్ని విధములైన శక్తులను కల్గినవాడు అనుచున్నారు "స్వతః సర్వవిదే సర్వశక్తయే" అనుట ద్వారా. "య స్సర్వజ్ఞః సర్వవిత్" (ముండక-61-1-10) (అన్ని వస్తువులను తెలిసినవాడు, వాని స్వభావములను అన్నిటిని తెలిసినవాడు) అనునది, "పరా-స్య శక్తి ర్వివిధైవ శ్రూయతే" (శ్వేతాశ్వ-6-8) (ఈ

భగవానుని మిక్కిలి గొప్పశక్తి పలువిధములైనది అని వినబడుచున్నది) అనునదియును గమనింపతగినవి.

(సర్వశేషిణే)-అందఱికిని స్వామి. సర్వశేషిత్వమనగా ఉభయవిభూతులలో నున్న చేతనాచేతనములన్నిటిచే ఏర్పడిన లీలారసము, భోగసుఖము అను ఆనందమును కల్గియుండుట అని పెద్దలందురు. ఇట్టి గొప్పతనమును కల్గియున్నను, పరమపదములో నున్నచో తనను ఎవ్వరును దఱిచేరుటకు వీలులేదని తలచి శ్రీవేంకటేశ్వరుడను అర్చారూపమును పరిగ్రహించి, శ్రీవేంకటాద్రిపై వేంచేసియుండి, అందఱి కన్నులకును కన్పించి సులభుడై, వారితో ఏ భేదము లేకుండ కలసియుండి సుశీలుడైయున్నాడను భావమును "సులభాయ సుశీలాయ వేంకటేశాయ" అనుట ద్వారా తెలుపుచున్నారు.

7. పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే ।
ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్ ॥

పరస్మై బ్రహ్మణే=పరబ్రహ్మ అయినవాడు, పూర్ణకామాయ=కోఱికలు అన్నియు తీరినవాడు, పరమాత్మనే=ఆత్మలు అన్నిటిలో గొప్పవాడు, పరతత్త్వాయ=పరమపురుషార్థరూపమైన వాడును అగు, వేంకటేశాయ=వేంకటేశ్వరునకు, మంగళం ప్రయుంజే=మంగళము అగుకాక అందును.

పరబ్రహ్మ, పూర్ణకాముడు, పరతత్త్వమును అగు శ్రీవేంకటేశ్వరునకు మంగళమును ఆశాసింతును.

"నారాయణః పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః......ఆత్మా నారాయణః పరః" (నారాయణోపనిషత్) అనునట్లు నారాయణావతారమగు వేంకటేశ్వరుడు పరబ్రహ్మ అని, పరమాత్మ అని, పరతత్త్వమని ఇందు నిర్దేశింపబడుచున్నాడు. రూప జ్ఞానాది గుణములలో గొప్పవాడై, ఆ గొప్పతనముయొక్క పరమావధియందున్న నారాయణుడు పరబ్రహ్మ అనబడుచున్నాడు. అతడు నిజమునకు ఉన్నతుడగుటచే పరబ్రహ్మ అని పిలువబడుచున్నాడు. అంతియేకాక, ప్రకృతికిని, ముక్తాత్మకును బ్రహ్మమను పేరుండుటచే, వానిని వేరుచేయుటకై "పరమ్" అను విశేషణము ప్రయోగింపబడినది అని పలుకువారును కలరు. "పరమ్" అనగా గొప్పది. పరమాత్మా అనగా ఆత్మలన్నిటిలో గొప్పది. తత్త్వములు ప్రమాణ సిద్ధములగు చిదచిదీశ్వరులని మూడు. పరమాత్మ వానిలో గొప్పవాడగు ఈశ్వరశబ్దవాచ్యుడైన శ్రీమన్నారాయణుడు.

ఏ వస్తువును ఆశపడినను, ఆ ఆశ పూర్ణమగునట్టి-అనగా నెఱవేరునట్టి గొప్పతనమును పొందినవాడనుటను "పూర్ణకామాయ" అను పదము తెల్పుచున్నది. లేక,



"పూర్ణకామః" అనునపుడు కామశబ్దముచే "కామ్యంతే ఇతి కామాః" అను వ్యుత్పత్తిని బట్టి కోఱబడు వస్తువులగు భోగ్య-భోగోపకరణ-భోగ స్థానములు నిర్దేశింపబడి, వాని కొఱకు ఇక ప్రయత్నించి, సంపాదింపవలసిన అక్కరలేనట్లు, సహజముగానే పూర్వమే తనవద్ద పూర్ణముగా నున్న ఆ కామములను కలవాడను అర్థమునుకూడ గ్రహింపనగును. ఇది "సత్యకామః" (ఛాందో-8-7-1) (నిత్యములైనయున్న అన్ని వస్తువులను కలవాడు) అను శ్రుతికి అనుగుణము. ఇచట భోగ్యములనగా - శబ్దాది విషయములు, స్త్రీలు మొదలగు అనుభవింపతగిన విషయములు. భోగోపకరణములు-వానిని అనుభవించుటకు సాధనములైన పుష్పచందన - తాంబూలాదులు. భోగస్థానములు-అనుభవించుటకు తగిన స్థలములగు గృహములు, ఉద్యానవనములు, మంటపము, దిగుడు బావి మొదలగునవి.

8. ఆకారతత్త్వ మశ్రాంత మాత్మనా మనుపశ్యతామ్ ।
అతృప్త్యమృతరూపాయ వేంకటేశాయ మంగళమ్ ॥

ఆకారతత్త్వమ్ = తన దివ్యమంగళ విగ్రహముయొక్క యథార్థస్వరూపమును, అశ్రాంతమ్ = నిరంతరము, అనుపశ్యతామ్ ఆత్మనామ్=ధ్యానించు మానవులకు, అతృప్తి+అమృత రూపాయ=చాలునని తృప్తి గలుగని, అమృతమువంటి రూపమునుకల, వేంకటేశాయ = వేంకటేశ్వరునకు, మంగళమ్ అస్తు=మంగళమగుగాక !

మన శరీరము కర్మవలన ఏర్పడినది. భగవానునకు తిరుమేని భక్తులకు దర్శన మీయవలెనను అతని కృపవలన ఏర్పడినది. అందుచే అతని దివ్యరూపమును (మనము ధ్యానము చేయవలెనని) ఎవడు ధ్యానించు చున్నాడో, అతనికి అతృప్తామృతమై, ఆనందము నిచ్చు రూపమునుకల శ్రీవేంకటేశ్వరునకు మంగళము కలుగవలెను.

ఆకారముయొక్క తత్త్వమనగా దివ్యరూపముయొక్క యథార్థస్థితి. అనగా -అప్రాకృతత్వము, స్వేచ్ఛాగృహీతత్వము, స్వాభిమతత్వము-మొదలగునవి. వానిలో అప్రాకృతత్వమనగా-ఈ లీలావిభూతిలో ప్రకృతివికారములగు పంచభూతములచే నిర్మింపబడి, మాంసరక్తాదిమయమైన మన శరీరమువలెకాక, నిత్యవిభూతిలోని శుద్ధ సత్త్వద్రవ్యముయొక్క వికారమై, పంచభూతములచే నిర్మింపబడి, నీలమణిచ్ఛాయను కల్గి, మిక్కిలి సుందరమైయుండుట. ''మణియురువిఱ్ఱాతమైన్దాయ్'' (నీలమణిరూపంలో ఉండేవాడా!) (తిరునెడు-1) అనిరి కదా తిరుమఙ్గైయాళ్వార్లు. స్వేచ్ఛాగృహీతత్వ మనగా-మన మనోరథము వలనకాక, పుణ్యాపాపరూపమైన కర్మలవలన ఏర్పడి, వానిని అనుభవించుటకొఱకే ఉండు మన శరీరములవలెకాక,

తనను ఆశ్రయించినవారికి సేవను అనుగ్రహించుటకొఱకే భగవానుడు తన సంకల్పముచే స్వీకరింపబడియుండుట. ఈ రెండు స్వభావములను "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా'' (గీత-4-6) (నా ప్రకృతిని అప్రాకృతదివ్యమంగళవిగ్రహమును స్వీకరించి, నా సంకల్పముతో జన్మింతును) అని శ్రీకృష్ణుడు పల్కెను కదా! ఇకి, స్వాభిమతత్వమనగా- మనము చేసిన పుణ్యపాపములకు తగినట్లు కొంచెము సురూపముగానో, లేక, విరూపముగానో ఏర్పడి, మనకు ఇష్టముకాని మన శరీరములవలెకాక, అవధిలేని అందమును కల్గి, భగవానునకును మిక్కిలి ఇష్టముగా నుండుట. "తతో-పి తత్ ప్రియతరం రూపం యదత్యద్భుతమ్" (పూర్వము తెలుపబడిన దివ్యాత్మస్వరూపము కంటెను భగవానునకు మిక్కిలి అభిమతమై, ఆశ్చర్యకరమైన ఏ దివ్యమంగళవిగ్రహము కలదో) (చతు-4) అనుచు భగవద్యామునులును సాయించిరి కదా! భగవానుని విభవావతారరూపములు పరమపదములోనున్న రూపమువలె అప్రాకృతములననుటను పూర్వము ఉట్టంకించిన భగవద్గీతావచనమువలన తెలిసికొంటిమికదా! అర్చావతార రూపములలో భగవానుడు తన అప్రాకృతరూపము నందు చూపు ఆదరముతో నిత్యసాన్నిధ్యమును కల్గియుండునని పూర్వాచార్యులు నుడువుటచే, అర్చావతార రూపములకును పూర్వము తెల్పిన స్వభావములు కలవని గ్రహింపనగును. "పరత్వ మవాఙ్మానసగోచరమ్. అవతారత్తుక్కు పిఱ్పాడ రానోమ్. నాఙ్గళ్ ఎఙ్గే యారై ఆశ్రయిప్పదు? ఎన్న, నీఙ్గళ్ ఉకన్దపడియే ఉకన్దరుళప్పణ్ణ అత్తిరుమేనియైయే అప్రాకృత దివ్యసంస్థానత్తోడొక్క విరుమ్బుమ్ అర్చావతారత్తై యాశ్రయియుఙ్గోళ్ - ఎన్గిఱార్" అను తిరువాయ్మొళి (3-6-9) ( పరత్వం వాక్కుకు, మనస్సుకు అందనిది. అవతారాలకు దూరమైనాము. ఇక మనం ఎవరిని ఎక్కడ ఆశ్రయించాలి? అంటే - మీరు ఆశపడిన రీతిలో నిర్మించిన ఆ అర్చారూపాన్నే తనరూపంగా గ్రహించి అప్రాకృతతేజస్సులో అదరించే అర్చావతారాన్ని ఆశ్రయించండి- అని పల్కుతున్నారు) ప్రబంధములో (తజ్ఞమాకియ) పాశురముయొక్క ఈడు వ్యాఖ్యానములోని అవతారికలోగల సూక్తి ఇచట అనుసంధేయము.

ఇట్టి తిరుమేనియొక్క తత్త్వములను అన్నిటిని మనస్సున నుంచుకొనియే సర్వాలంకార భూషితమైన శ్రీవేంకటేశ్వరుని దివ్యరూపమును నిరంతరము ధ్యానించినచో, అది వారికి ఎంత ధ్యానించినను చాలునను తృప్తిని కల్గింపని అమృతమువలె పరమ భోగ్యముగా నుండునని ఉత్తరార్థమున తెలుపబడినది. "ఎప్పొళుదుమ్ నాళ్ తిఙ్గళ్ ఆణ్డాళి యూళితొఱుమ్ అప్పొళుదైక్కప్పొళుదు ఎన్నారావముదమే" (తిరువాయ్- 2-5-4) (దినాలు, నెలలు, సంవత్సరాలుగా ఎప్పటికప్పుడు నాకు అతృప్తామృత రూపుడైన వాడా!) అనియు, "వణ్ణమరుళ్కొళ్ అణి మేకవణ్ణా!.....ఎణ్ణమ్ పుకున్దు తిత్తిక్కు మముదే!... తిరువేఙ్గడత్తానే" (మేఘవర్ణా! మృతరూపుడైనవాడా! నా మనస్సులో ప్రవేశించి భోగ్యమై ఉండే అమృత స్వరూపా!) (తిరువాయ్-6-10-3) "శీరార్ తిరువేఙ్గడమామలై మేయ ఆరావముదే" (గొప్ప వేంకటాద్రిని అభిమానించి వేంచేసి ఉండే అతృప్తామృతమా!) (పెరియ తిరు-1-10-3) అనియును ఆళ్వార్లు అనుగ్రహించిన సూక్తులను ఇచట అనుసంధింపనగును.



9. ప్రాయ స్స్వచరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా ।
కృపయా దిశతే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥

ప్రాయః=కాబోలు! పుంసాం=మానవులకు, శరణ్యత్వేన=ఆశ్రయించుటకు తగినవి అగు, స్వచరణౌ=తన చరణములను, పాణినా=(తన కుడి) చేతితో, కృపయా=దయతో, ఆదిశతే = చూపుచు విధించుచున్న, శ్రీమద్వేంకటేశాయ=శ్రీవేంకటేశ్వరునకు (లక్ష్మీసహితుడగు వేంకటేశ్వరునకు), మంగళమ్ (అస్తు)=మంగళము (అగుగాక)

"మానవులారా! ఈ పాదములను మీరు రక్షకములుగా ఆశ్రయింపుడు" అనుచు తన కుడిచేతితో దయతో తన శ్రీచరణములను చూపి, ఆజ్ఞాపించువానివలె సేవను అనుగ్రహించుచున్న శ్రీవేంకటేశ్వరునకు మంగళము కలుగవలెను.

ప్రపత్తిలో "శరణం వ్రజేతి...మహ్యా మిహ తౌ కరదర్శితౌ తే చరణౌ శరణం ప్రపద్యే" (11) (శరణు పొందుము అని ఈ తిరుమలలో నాకు శ్రీహస్తముతో చూపబడిన నీ శ్రీపాదములను శరణు పొందెదను) అని పల్కిరి. అట్లు చరణములను చూపుచున్న వేంకటేశ్వరునకు మంగళము కలుగవలెనని ఇందు పల్కుచున్నారు. ఇందు (స్వచరణౌ శరణ్యత్వేన ప్రాయః ఆదిశతే) అనగా తన శ్రీపాదములను శరణ్యములుగా చూపుచున్నవానివలెనున్న వేంకటేశ్వరునకు-అని అర్థము. ఇచట "ప్రాయః" అనునది ఉత్ప్రేక్షావ్యంజకము. నోటితో పలుకకుండ చూపుటచే, "వీనిని రక్షకములుగా ఆశ్రయింపుము" అని విధించుట ఈ స్వామియొక్క అభిప్రాయమై యుండవచ్చునని ఉత్ప్రేక్షింపబడుటను గమనింపనగును.

ఇచట "ఆదిశతే" అనియు, "దిశతే" అనియును పాఠములు కన్పడుచున్నవి. "అడిక్కీళ్ అమర్న్దు పుకున్దు అడియీర్! వాళ్మిన్" (దాసులారా! నాపాదాల చెంత చేరి నుంచి ఉజ్జీవించండి) (తిరువాయ్-6-10-11) అను విధికి మొదటిపాఠము అనుగుణము. ఎందులకనగా తానే (కోఱు) కల్గు ఉజ్జీవనమునకు విధి అవసరము లేదు కావున, ఆశ్రయించుటకే విధి ఆవశ్యకము. కావునను, దాని కొఱకు (అనగా -

ఉజ్జీవించుటకు) - "అడిక్కీళ్ అమర్న్దు పుకుమిన్" (నా పాదాల చెంతచేరి నిలవండి) అనునది అభిప్రాయమగుటచే-అని భావము.

ఇకి, "దిశతే" అను పాఠమును అనుసరించి, ఇచ్చువానికి-అని అర్థము. ఇచట "నిర్దిశ్య" అను ఇంకొక పదమును చేర్చుకొని, "స్వచరణౌ శరణత్వేన పాణినా నిర్దిశ్య పుంసాం (తౌ) దిశతే" అని అన్వయించి, తన శ్రీపాదములను శరణ్యములుగా దక్షిణ హస్తముతో సూచించుచు, మానవులకు (వానిని) అనుగ్రహించువానికి- అను అర్థమును చెప్పనగును. ఈ అర్థము "ఆఱెనక్కు నిన్ పాదమే శరణాక త్తన్దొన్దాయ్" (తిరువాయ్- 5-7-10) (ఉపాయంగా నీ చరణాలనే నాకు అనుగ్రహించావు) అను సూక్తికి అనుగుణము.

10. దయామృతతరంగిణ్యా స్తరంగై రివ శీతలైః ।

అపాంగై స్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్ ॥

దయా=దయ అనెడి, అమృతతరంగిణ్యాః=అమృతనదియొక్క, తరంగైః ఇవ = కెరటముల వలె, శీతలైః=చల్లని, అపాంగైః=కటాక్షములతో, విశ్వం=ప్రపంచమును, సించతే= తడపుచున్న, వేంకటేశాయ=శ్రీవేంకటేశ్వరునకు, మంగళమ్ (అస్తు)=మంగళము (అగుగాక!)

ఒడ్డు ఒరసికొని ప్రవహించు దయ అనెడి అమృతమునదియొక్క అలలా ఇవి! అనునట్లున్న చల్లని కటాక్షములతో లోకములను చల్లగా చూచుచున్న శ్రీవేంకటేశ్వరునకు మంగళములు కలుగవలెను.

ఇందు "విశ్వమ్" అనుటకు లోకమను అర్థమును గ్రహించి, ఒక భావము పూర్వము తెలుపబడినది. ఆ శబ్దమునకు ఇచట "అన్నియు" అను అర్థము కూడ పొసగును. అన్ని అను పదమున భగవానుడును చేరును. ఇందు తడపునట్టి భగవత్కటాక్షములు అతని దయ అనెడి అమృతనదియొక్క అలలుగా ఉత్ప్రేక్షించుటకు తగినట్లు, తడపుట అనుటకు చక్కగా నిండుగా ప్రవహించి, మెట్టపల్లములను భేదము లేకుండ సమమగునట్లు చేయుట-అని తాత్పర్యము. కావున, ప్రవాహము మిక్కిలిగా ప్రవహించినపుడు ఎత్తులోనున్న మన్ను అంతయు పల్లమునకు చేరి, మెట్టపల్లములు సమమగునట్లు, ఇచట శ్రీవేంకటేశ్వరుని దయ నిండిన కటాక్షప్రవాహము అంతట నిండి, ఉన్నతుడగు ఆ స్వామినికూడ ముంచెత్తి, అతనిని, అధముడగు మానవుని సమానముగా చేయుచున్నది. అట్టి కటాక్షములను ప్రసరింపజేసి, అధములని చూడకుండ, వారితో సమానముగా కలసి, వేంకటేశ్వరుడు వర్తించుచున్నాడను అర్థమును ఇచట



గ్రహింపనగును. ఈ అర్థము "నిషాదానాం నేతా....సమయసి" (దయా-65) (దయాదేవీ! వ్యాధులకు అధిపతి అగు గుహుడు, వానరాధీశుడగు సుగ్రీవుడు, భిల్లస్త్రీ అగు శబరి, కుచేలుడు, కుబ్జ, రేపల్లెలోని గోపికలు, మాలాకారుడు-అను వీరి నైచ్యమును, శ్రీవేంకటేశ్వరుని ఔన్నత్యమును మిక్కిలి గొప్ప నీ ప్రవాహములతో సమము చేయుచున్నావు) అనుచు శ్రీవేదాంత దేశికులు అనుగ్రహించిన దయాశతక శ్లోకరత్నముతో మిక్కిలి ఒప్పును. విభవావతారములలోవలె శ్రీవేంకటేశ్వరుడును "ఆళియుమ్ కోళరియుమ్....వానరముమ్ వేడుమ్" అని అన్నిటికిని తన దర్శన మనుగ్రహించుచు నిలుచునియున్నాడుకదా!

11. స్రగ్భూషాంబరహేతీనాం సుషమావహమూర్తయే ।

సర్వార్తిశమనాయా-స్తు వేంకటేశాయ మంగళమ్ ॥

స్రక్ భూషా+అంబరహేతీనాం=మాలెలు, ఆభరణములు, పీతాంబరము, దివ్యాయుధములు అను వీనికి, సుషమా+ఆవహమూర్తయే=గొప్ప శోభను కల్గించుచున్న దివ్యరూపమును కలవాడు, సర్వ+ఆర్తిశమనాయ=అందఱి దుఃఖములను తీర్చువాడును అగు, వేంకటేశాయ=వేంకటేశ్వరునకు, మంగళమ్ అస్తు=మంగళమగుగాక!

వస్త్రములు, ఆభరణములు, ఆయుధములు మొదలగువానిచే అలంకరింపబడి, అందముగానుండునట్లు చేయబడు మనవలెకాకుండ, తన దివ్యరూపసంబంధముచే పూమాలెలు, తిరువాభరణములు, పట్టుపీతాంబరము, శంఖచక్రాది దివ్యాయుధములు మొదలగువానికి పూర్వము లేని ఒకానొక అపూర్వమైన శోభను కల్గించుచు, అందఱికిని దర్శన మిచ్చుచు, సకలదుఃఖములను తీర్చు సర్వాంగసుందరుడగు వేంకటేశ్వరునకు మంగళము కలుగవలెను.

"ఆభరణజ్గళుక్కు అళకూట్టుమ్ పెరుమాళ్" (ఆభరణాలను అందాన్నిచ్చే స్వామి) అనుచు శ్రీరంగనాథుడు కీర్తింపబడునట్లే, శ్రీవేంకటేశ్వరుడును ఇందు కీర్తింపబడుచున్నాడు. స్రక్ అనగా మాలె. పూర్వము భగవద్రామానుజుల నియమనమును అనుసరించి, తిరుమలకు వేంచేసి, అచట ఉద్యానవనమును నిర్మించి పెంచి, అందు పూయు పూలను మాలగా గుచ్చి, అనంతార్యులును, ఆ పిమ్మట వారివంశీయులును సమర్పించు మాల-అని దీని అర్థము. భూషా అనగా ఆభరణము. అంబరము-పీతాంబరము. ఆకాశరాజు తన పుత్రిక అగు పద్మావతిని విభవావతారరూపమున అవతరించిన వేంకటేశ్వరునకు ఇచ్చి, కల్యాణమును జరిపించినపుడు ఆ స్వామికి సమర్పించిన కిరీట నూపురాదులగు దివ్యాభరణములును, పీతాంబరములును ఇవి. వీని వివరమును శ్రీవేంకటాచలమాహాత్మ్యములో చూడనగును.

హేతి-అనగా ఆయుధములు. అవి ఏవి? అనగా, తనపట్ల అంతులేని భక్తిని కల్గియున్న తొండమాన్ చక్రవర్తికి, శత్రుసంహారార్థము అనుగ్రహించిన శ్రీసుదర్శనము, పాంచజన్యములను తిరిగి ధరింపకుండ తన ఔదార్యము ప్రకాశించునట్లు రిక్తహస్తములతో శ్రీవేంకటేశ్వరుడు వేంచేసియుండగా, చాలాకాలము గడచిన పిదప, కాళహస్తిలోని శైవులు ఆ స్వామిని షణ్ముఖుడని, శివుడని పల్కుచు యాదవరాజు సభలో వాదింపగా, భగవద్రామానుజులు శ్రీరంగమునుండి తిరుమలకు వేంచేసి, శ్రుతిస్మృతీతిహాస పురాణ దివ్యప్రబంధములను గొని రాజసభలో ఆ స్వామి విష్ణుస్వరూపుడేననుటను స్థాపించి, ఇక ఎవరికిని ఏ విధమైన సందేహమును ఏర్పడకుండునట్లు స్వర్ణమయములగు శంఖచక్రములను ఆ స్వామి హస్తములలో అలంకరింపజేసిరి-అని అవేంకటాచల ఇతిహాసమాల, తిరుమలై ఒళుకు మొదలగు గ్రంథములలో కానవచ్చుటకు అనుగుణముగా, భగవద్రామానుజులు సమర్పించిన శంఖచక్రములును. ఆభరణములు, మాలికలు, పట్టువస్త్రములు ఏవి? అనగా-శ్రీవేంకటేశ్వరునకు మామగారైన ఆకాశరాజు వివాహసమయంలో ఇచ్చిన ఆభరణములు, మాలికలు, పట్టు వస్త్రములు. అదేవిధముగా అనంతార్యులు స్వామికి పద్మావతిదేవిని కన్యాదానము చేసిన సందర్భమున సమర్పించిన ఆభరణములు, పట్టువస్త్రములును తమ తోటకు వచ్చి రాత్రివేళ పుష్పములను కోసిన అలర్ మేల్మఙ్గై పిరాట్టిని, ఆమె ఎవరో తెలియక, అనంతార్యులు సంపెంగచెట్టుకు కట్టివేసి, ఉదయముకాగానే నిజమును గ్రహించి, భగవానుని వద్దకు పిలుచుకొని పోయి, సమర్పింపగా, స్వామిచే అనంతార్యులు మామగారుగా కీర్తింపబడుట ఆ మహనీయుల చరిత్రలో సుప్రసిద్ధము. దీనికి తగినట్లు "మలైయిల్ వేఙ్గడవఙ్కు మామనార్ వాళియే" (శ్రీవేంకటేశ్వరుని మామగారికి మంగళం) అనెడి అనన్దాళ్వాన్ అనంతార్యుల మంగళాశాసన పాశురు అనుసంధింపనగును. భగవద్రామానుజులు శ్రీవేంకటేశ్వరుని సంపద నిత్యము అభివృద్ధి చెందవలెనని స్వర్ణమయమైన లక్ష్మీదేవిని ఆ స్వామి వక్షఃస్థలములో ప్రతిష్ఠ చేయించినందులకు అనుగుణముగా భగవద్రామానుజులును వేంకటేశ్వరునకు మామగారుగా భగవద్రామానుజులు స్వామికి మామ అగుచున్నారు. "శ్రీవేంకటేశశ్వశురః" అని వడుగనంబి ప్రణీతమగు రామానుజాష్టోత్తరశతనామస్తోత్రములో తెలుపబడుటను చూడనగును.

ఇట్టి మాలెలు, దివ్యాభరణములు, పీతాంబరము, శంఖచక్రాది దివ్యాయుధములు మొదలగునవి ద్రవ్యస్వభావముచేతను, వానిని సమర్పించిన శ్వశురపాదుల మహిమచేతను మిక్కిలి గొప్పవియై, ఇతఃపూర్వమే గొప్ప శోభను కల్గినవి అయినను, శ్రీవేంకటేశ్వరుడు తన తిరుమేని సంబంధముచేత, వానికి ఇక దీనికి మించిలేదనట్లు



అత్యుత్తమైన సుషమను కల్గించుచున్నాడు-అనుచు (అణ్ణన్) పల్కుచున్నారు. సుషమ అనగా గొప్ప శోభ. "సుషమా పరమా శోభా" అని అమరకోశవచనము.

(సర్వార్తిశమనాయ) - పూర్వము పల్కిన రీతిలో వేంచేసియుండు శ్రీవేంకటేశ్వరుడు తనను నమస్కరించిన అందఱి దుఃఖములను పోగొట్టుచున్నాడని భావము. వరదరాజస్వామివలెనే వేంకటేశ్వరుడును ప్రణతార్తి హరుడు కదా!

12. శ్రీవైకుంఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే ।
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్ ॥

శ్రీవైకుంఠవిరక్తాయ=శ్రీవైకుంఠములో ఆదరము తీరినవాడును, స్వామిపుష్కరిణీతటే =స్వామిపుష్కరిణి అను కొలనుతీరములో, రమయా=లక్ష్మీదేవితో, రమమాణాయ =క్రీడించుచు, ఆనందించువాడును అగు, వేంకటేశాయ=శ్రీవేంకటేశ్వరునకు, మంగళమ్ అస్తు=మంగళమగుగాక!

అనంతగరుడాది నిత్యసూరులు, ముక్తులును దుఃఖమనునదియే తెలియక ఆనందించుచు జీవించు వైకుంఠములో తన దయ మొదలగు గుణములు ప్రకాశింపపోవుటచే అచట అనాదరమును పొంది, సంసారులు దుఃఖములతో బాధపడుటను తలచి, దయచూపి, ఆ దుఃఖములను పోగొట్టుటకై దయ మొదలగు గుణములు ప్రకాశించునని ఆ గుణములను మరింతగా వృద్ధి పొందించు లక్ష్మీదేవితోపాటు భూలోకములోని తిరుమలలో కోనేటి తీరమున క్రీడించుచు సేవను అనుగ్రహించు భగవానునకు మంగళము ˘లుగవలెను.

"మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్, స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే" అను (శేషధర్మమ్-13) (మాయావి అయిన భగవానుడు గొప్ప ఆనందం కల, ఉత్తమమైన వైకుంఠమును వీడి స్వామి పుష్కరిణీ తీరంలో లక్ష్మితో పాటు విహరిస్తున్నాడు) పురాణ శ్లోకమును అనుసరించుచు ప్రస్తుత శ్లోకము రచింపబడినది.

ఈ శ్లోకమునకు, తన దయ మొదలగు గుణములకు(ఆవశ్యకత) లేకపోవుటచే శ్రీవైకుంఠములో నిరాదరమును పొందిన శ్రియఃపతి వానికి విలుగల చోటు అయిన భూలోకములో స్వామిపుష్కరిణీతీరమున లక్ష్మీదేవితోకూడి మిక్కిలి ఆదరముతో క్రీడించుచున్నాడను అర్థముతో పాటు, పాద్మపురాణము క్షేత్రకాండము ముప్పది నాల్గవ అధ్యాయములో తెలుపబడిన వేఱొక ఈ క్రింది చరిత్రను గ్రహింపనగును.

ఏది పరతత్త్వమని విచారించి తెలిసికొని రమ్మని మహర్షులచే పంపబడిన

భృగుముని మొట్టమొదటగా సత్యలోకమును చేరి, అచట సభలో కొలువు తీరి ఉన్న చతుర్ముఖుని చూడగా, అతడు గర్వముతో ఈ మహర్షిరాకను కొంచెముకూడ లెక్కపెట్టకుండనుండుటను గమనించి ఆ ముని "ఈ బ్రహ్మ రజోగుణ దూషితుడు" అని నిశ్చయించుకొని, శివలోకమును చేరెను. అచట అతడు శివుని దర్శింప ప్రయత్నింపగా, పార్వతీభోగములో ఆసక్తుడైయున్న శివుడు భృగుమహర్షికి దర్శన మీయలేదు. "ఈ శివుడు తమోగుణమును కలవాడు" అని నిశ్చయించుకొని, శ్రీవైకుంఠమును చేరి అచట శయనించియున్న శ్రీమన్నారాయణుని వక్షఃస్థలములో తన్నగా, ఆ స్వామి తటాలున లేచి "రాయికంటె కఠినమైన నా వక్షఃస్థలములో తమె మెత్తని పాదమునకు ఎంత నొప్పి కల్గినదియో కదా!" అనుచు పల్కి, ఆ పాదమును తన చేతులతో ఒత్తగా, "సత్త్వగుణమును నిండుగా కల ఈ స్వామియే పరతత్త్వము" అని నిశ్చయము చేసికొని తిరిగివచ్చిన భృగువు మహర్షులకు తన నిర్ణయమును తెలిపెనను‌ట అందఱు తెలిసినదే.

అట్లు మహర్షి తన్ని తిరిగి వెడలిన పిమ్మట, శ్రీవైకుంఠములో లక్ష్మీదేవి "నాకే స్వంతమైన నీ వక్షస్సులోను తన్నిన మహర్షి పాదమును నీవు సంవాహనము చేసితివే! నేను నిత్యవాసమును చేయు చోటును ముని అలక్ష్యము చేసి తన్నగా, దానిని నీవు ఏ మాత్రము లెక్కింపలేదే! ఇచట నాకు ఇకపై ఏమి పని? నేను ఎచటికైనను వెడలి పోయెదను" అని పల్కి వైకుంఠమునుండి బయలుదేరి, పాతాళమును చేరి, అంతర్ధానమయ్యెను. భగవానుడును లక్ష్మీదేవి లేకపోవుటచే వైకుంఠవాసములో నిరాదరణను పొంది, భూలోకమునకు వచ్చి చేరెను. లక్ష్మీదేవిని వెదకుచు పిమ్మట ఒక అశరీర వాక్కును బట్టి తిరుమలకు సమీపములోగల తిరుచ్చుకనూరులో (తిరుచానూరు) తానే ఒక పద్మసరస్సును నిర్మించి, దాని తీరమున పంద్రెండు ఏండ్లు ఆమెను గూర్చి తపస్సును చేసి, ఆ తటాకము మధ్యనుండి లక్ష్మీదేవి ఆవిర్భవింపగా, ఆమెను పొంది తిరుమలకు తిరిగి వచ్చి, స్వామి పుష్కరిణీతీరములో ఆ లక్ష్మీదేవితో పాటు విహరించుచు ఆనందించుచున్నాడు-అనునది పాద్మపురాణోక్తకథ. దీనికి అనుగుణముగా - లక్ష్మీదేవి లేకపోవుటచే శ్రీవైకుంఠములో విరక్తిని పొంది (భూలోకమును చేరి, లక్ష్మీదేవిని తిరిగి పొంది) ఆమెతో కలసి స్వామి పుష్కరిణీతీరములో ఆదరముతో విహరించు వేంకటేశ్వరునకు మంగళము అగుగాక- అను అర్థముకూడ ఈ శ్లోకమునకు గ్రహింపనగును.

13. శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే ।
సర్వలోకనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥



శ్రీమత్=మంగళాశాసనమును చేయుట అనెడి సంపదను నిత్యము కల్గిన, సుందర జామాతృముని=అకియమణవాళన్‌ముని(వరవరముని)యొక్క, మానసవాసినే= మనస్సునే నివాసముగా కలవాడును, సర్వలోకనివాసాయ=అన్ని లోకములను తనకు నివాసస్థలముగా కలవాడును అగు, శ్రీనివాసాయ=శ్రీనివాసునకు, మంగళమ్ అస్తు= మంగళమగుగాక

ప్రళయకాలములో లోకములను అన్నిటిని తనయందుండునట్లు చోటు నిచ్చి ఆనందించిన తాను, "నాకేమి కొఱతయు రాకుండునట్లు పల్లాండు పాడి రక్షపెట్టు మహనీయులగు శ్రీమణవాళమహాముల తిరువుళ్ళమే నాకు ఆనందమును కల్గించు నివాసము" అని తలచి అచటనే నివసించుచు ఆనందించుచున్న అలర్‌మేల్ మఙ్గై నివసించు వక్షఃస్థలమును కలవానికి మంగళములు కలుగుగాక!

"సర్వలోకనివాసాయ" అనుటకు సర్వలోకములకును నివాసస్థానమైనవాడు అని షష్ఠీతత్పురుషసమాసముగా గ్రహించి, ప్రతిపదార్థములో చూపబడిన అర్థముతో పాటు, సర్వలోకములను నివాసస్థానముగా కలవాడును బహువ్రీహిగా గ్రహించి కూడ వేఱొక అర్థమును చెప్పవచ్చును.

ఇచట లోక శబ్దము జనవాచకము. "లోక స్తు భువనే జనే" అను అమరకోశ వచనమును చూడనగును. "శ్రీమత్సుందరజామాతృముని" అనుచు మిక్కిలి గొప్ప మణవాళమహామునులను ఇచట నిర్దేశించుటచే సర్వలోక శబ్దము సమస్తసాధారణ జనులను నిర్దేశించుచున్నదని చెప్పవచ్చును. "నిర్వృష్టో మేఘః" (వర్షము కురిసి విరమించిన మేఘము) అనునపుడువలె "నివాసః" అనుటకు "నివృత్తో వాసః" అను వ్యుత్పత్తినిబట్టి ఆశ తీరిన వాసస్థానము అను అర్థమును, "మునిమానసవాసినే" అనునపుడు "వాసిన్" అను పదములోని 'ఇన్' ప్రత్యయము ప్రశంసార్థకమగుటచే, మణవాళ మహామునుల మనస్సులో వాసమును ప్రశస్తముగా, గొప్పదిగా, తన పూర్ణమైన మనోరథమునకు లక్ష్యముగా కలవాడు-అను అర్థమును చెప్పనగును. ఈ విధముగా, "సర్వలోకనివాసాయ శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే శ్రీనివాసాయ మంగళమ్" అని పూర్వమువలెనే అన్వయించి, ఐశ్వర్యము, కైవల్యము మొదలగు అధమపురుషార్థములను కోరు సామాన్యజనులందఱియందు అంతర్యామిగా నుండవలసిన నిర్బంధముతో, కొంచెముకూడ ఆశలేకుండ ముళ్ళమీద ఉన్న వానివలెనుండువాడై, తననే "ఉణ్ణుమ్ శోరు" (తినే అన్నం) మొదలగు సర్వవిధధారకపోషక భోగ్యములుగా తలచు ఉత్తమాధికారులగు శ్రీమణవాళమహామునుల చిత్తములో శ్రీవైకుంఠములోకంటె మిక్కిలి ఆనందముతో వాసము చేయువాడగు శ్రీనివాసునకు మంగళములు కలుగవలెనని ఈ శ్లోకమునకు

అర్థమనియు చెప్పనగును.

14. మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।
సర్వై శ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయా-స్తు మంగళమ్ ॥

మంగళాశాసనపరైః=భగవానునకు మరింతగా మంగళములు కలుగవలెనని తలచుటలో నిష్ఠను కలవారై, మత్+ఆచార్యపురోగమైః=నా ఆచార్యులగు మణవాళమహాములు మొదలగు, పూర్వైః=పూర్వులగు, సర్వైః ఆచార్యైః=ఆచార్యులందఱిచే, సత్కృతాయ =సత్కారముచేయబడిన శ్రీవేంకటేశ్వరునకు, మంగళమ్ అస్తు=మంగళము కలుగుగాక!

నా ఆచార్యులు మొదలగు పూర్వాచార్యులందఱును మంగళాశాసనమును నిష్ఠతో చేయుటచే తన స్వరూపము స్థిరముగానుండునట్లు చేయబడిన శ్రీవేంకచేశ్వరునకు మంగళములు కలుగవలెను.

"సత్కృతః" అనుటకు "సన్ చాసౌ కృత శ్చ సత్కృతః" అను వ్యుత్పత్తిని బట్టి సత్తను కల్గినవాడుగా చేయబడినవాడని అర్థము. సత్త అనగా అర్చావతారరూపములో నిత్యసాన్నిధ్యమును కల్గి భగవానుడు వేంచేసియుండుటయే. అణ్ణన్‌కు ఆచార్యులగు మణవాళమహాములు మొదలగు పూర్వాచార్యులు ఈ తిరుమేనియందు మిక్కిలి ఆదరముతో మంగళాశాసనమును చేయుటచే ఈ తిరుమేనిలో భగవానుడు సత్తను -అనగా నిత్యసాన్నిధ్యమును కల్గినవాడుగా చేయబడినాడను అర్థము ఇచట స్ఫురించును. పెద్దల మంగళాశాసన బలమే భగవానుని నిత్యసాన్నిధ్యమునకు సాక్షాత్ సాధనమని దీనివలన సూచింపబడినది.

లేక, "అర్చకస్య తపోయోగాత్ అర్చనస్యాతిశాయనాత్, ఆభిరూప్యా చ్చ బింబానాం దేవః సాన్నిధ్య మృచ్ఛతి" (అర్చకులు వర్ణాశ్రమధర్మానుష్ఠానముతో కూడియుండుట చేతను, ఆరాధనమును చక్కగా నిర్వహించుటచేతను, అర్చావతార రూపము అందముగా నుండుటచేతను భగవానుడు ఆ ఆకృతిలో సాన్నిధ్యమును కల్గియుండును) అనునట్లు అందమైన తిరుమేనిలో జ్ఞానానుష్ఠానమును కల అర్చకులు చక్కని ఆరాధనమును చేయుట వలననే భగవానుని సాన్నిధ్యము ఏర్పడునని తెలియుటచే, అట్టి గొప్ప తిరువారాధనము నడచుట పెద్దల మంగళాశాసనబలముచేతనే అని తలచినపుడు, భగవత్సాన్నిధ్యమునకు మంగళాశాసనము పరంపరయా కారణ మనియు చెప్పవచ్చును. ఒక పెద్దలు వేఱొక పెద్దలను "తిరుమలలో ఆరాధనము చక్కగా జరుగుచున్నదా'' అని అడుగుట, వారు ''తమవంటివారి మంగళాశాసనబలముచే ఏ కొఱతయు లేదు" అని బదులు పల్కుటయును ప్రసిద్ధమే కదా!



ఇట్లు ప్రతివాది భయంకరం అణ్ణన్ శ్రీవేంకటేశ్వరుని విషయమున సుప్రభాత స్తోత్రము, ప్రపత్తి, మంగళము-అను నాల్గు స్తుతులను తమ ఆచార్యులగు శ్రీమణవాళ మహాములు నియమనమును అనుసరించి అనుగ్రహించి, పరిసమాప్తి కావించిరి.

"శ్రియః కాంతాయ" అను శ్లోకమును కొందఱు పురాణశ్లోకమనియు, మరికొందఱు మణవాళ మహాములు అనుగ్రహించిరనియు అందురు. "మంగళాశాసన పరైః" అనెడి శ్లోకము మణవాళమహాములచే ప్రణీతమైనది.

శ్రీవేంకటేశమంగళ వ్యాఖ్య సంపూర్ణము

శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణములే శరణము

ం